# తిక్కన విరాటపర్వము

## పాండవప్రవేశము

విరాటనగరమందు పాండవు లజ్ఞాతవాసము నెట్లు గడపిరి అని జనమేజయుడు వైశంపాయనుని నిట్లు ప్రశ్నించెను.

చ. మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితముగాఁగ నేమిగతి సన్యగు[illegible]ష్ట్రత్త్వము
నహితుల కప్రథేయ్యముగ నా[illegible]సుమూఁడగు నేఁడు మత్ప్రతా
మహులు చరించి యంతయు సమగ్రముంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా.౧-౧౭

మహితసముజ్జ్వలాకృతులు, మానధనులు, జనమాన్యు లగుటను పాండవు లజ్ఞాతవాసమును గడపుట కష్టము. కొలిపించుకొనుటయేగాని కొలుచుట యెఱుఁగనివారగుటను మఱియు కష్టము. అదిగాక అంగనా సహితులై యున్నారు. పాండవులయొక్క కష్టములు, ద్రౌపదియొక్క కష్టములు, ఒకరినొకరు కనిపెట్టి మెలఁగువలె నుండంగుటయందలి కష్టములు. ఇన్ని కష్టముల నెట్లు దాటిరి అను [illegible] (సొగసును) "అంగనాసహితముగాఁగ" అనుపదము వ్యక్తము చేయుచున్నది. పాండవు లంగనాసహితు లగుటలో లోకవిపరీతమైన విషయ మొకటి (ఏవురికి అంగన యొక్కతే అనుట యనునది) యున్నందున మఱియు కష్టమని పార స్యము. కావున వారావత్సరము నెట్లుగా సన్యగు[illegible]ష్ట్రత్త్వము గడపిరి అని ప్రశ్నించెను. అంతియగాక అహితుల కప్రథేయ్యముగ జరింపవలసియున్నది. ఇందు "అహితులు" అని చెప్పబడినది. కౌరవులకేకాక పాండవద్వేషులందఱు అని చెప్పుట వ్యక్తమగుచున్నది. శత్రుసమూహమున కంతకు దెలియరాకుండ పితామహులైన పాండవులు పదుమూఁడగు నేఁడు నెట్లు గడపిరో ఆయుదంతమంతయు సమగ్రముగా (సమగ్రముగ) జెప్పుమని జనమేజయు డడిగినాడు. ఇట్లుగా జనమేజయుడు ప్రశ్నింపగా నతని "అధికౌత్సుక్యంబున కలిమికి దనహృదయము గా

దరము భరితముగాగ" వైశంపాయను డిట్లు దెలిపెను. ధర్మదేవతావర ప్రసాదంబు గల్గిన పాండవులు భూసురోత్తములకు నమస్కరించి సవినయముగా నిట్లనిరి. 'సుయోధనుడు చేసిన కుటిలవిచేష్టితము తెల్లముకదా! మాతోడ మీరును నడవుల నిడుమలబొందితిరి. కాని ఆకాలమంతయు నొకభంగి బోయినది. ఇప్పుడు మే మజ్ఞాతవాస మొనరింపవలసి యున్నది. దుర్యోధనాదిదుష్టచతుష్టయ మది చెఱుపన వేతురు. చిన్నసన్న యెఱిగి రేని గొప్ప యెగ్గు సంభవించును. కావున మమ్ము నింక నతిరహస్య వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరియింపుడని యనుగ్రహింప గోరెదము" అని పలికిరి. ఇది బాహ్యపరివారమునంతయు జంపివేయుటకు బాండవులు చేసిన ప్రయత్నమై యున్నది. "చిన్న సన్న యెఱిగిరేని చాల నెగ్గు వాటిల్లు" అని పలుకుటలో పాండవులయొక్క లౌకికము వ్యక్తమగుచున్నది. ఆమాటవలన ఎవరిమట్టుకు వారికే పాండవులను విడిచిపోవుట సుసుంజస మను నూహను వారికి పాండవులు కలుగజేసినవారైరని సారస్యము. ధర్మజుడు వారినందఱను విడువవలసి వచ్చినందులకు విషణ్ణహృదయుడైనాడు. ధౌమ్యుడు "దుర్దశలవెల్లునకు నీయంటివారు దురపిల్లుట పాటి కాదు. దేవతలకైన నిట్టివి సంభవించునుగదా" అని పలికినాడు. కొన్ని దృష్టాంతములను చూపినాడు.

సీ. నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్న
సంచరణమున వర్తించుటయును
నదితిగర్భంబున నవతారమై వామ
నాకారమున హరి యడగుటయును
జననియూరుప్రదేశంబున నతినిగూ
ఢంబుగా నౌర్వుండు డాగుటయును
ధేనుశరీరవిలీనుడై యజ్ఞాత
చర్యనూర్వాండుండు సలుపుటయును
ఆ. వినమె యిట్లు వడిన వీరలు పదపడి
తమకు నగ్గమైన తఱి జయింప
రెట్లు ప్రబలి రిపుల నీవును నాపద
కోర్చి భంగపాటు దీర్చికొనుము.

ఇందొక పాదముకంటె నొకపాదమందు కష్టతరమైన విషయమును గవి బ్రహ్మ నిరూపించినాడు. అద్రికంటె నతిదిగర్భము, దానికంటె జనని యూరు ప్రదేశము నివసించుట కనువుకాని స్థలములు. ధేను(పశు) శరీర విలీనత్వ మంతకంటె కష్టతరమైనది. మఱియు "వర్తించుట, యడగుట, డాగుట, అజ్ఞాతచర్య సలుపుట" క్రమముగా గష్టతరమైన విషయములు. తిక్కన ఏదిరచించినను నిట్టి క్రమమును బాటించుచుండును. ధౌమ్యుని యీ వచనములకు చిత్తము కలకదేఱి ధర్మతనూజు డనుజన్ముల దెస జూచెను. భీముడు భీభత్సుని పరాక్రమ మువ్విళ్లూరించినాడు. అదివిని ధర్మజుడు దెలివొందిన మొగంబుతోడ శిరఃకంపము చేసినాడు. ధౌమ్యుని వచనమున ధర్మజుడు విచారమును విడిచినాడనియు, భీమునివచనమున ధైర్యమొందినాడనియు సారస్యము.

తమ్ములు, ధౌమ్యుడు, ద్రౌపదితోడగూడ ధర్మజుడు క్రోశమాత్ర మేగి రేయిగడపి అర్జునునితో "మన మొకయేఁడుపురము. ఈ యంగన వెంట రాగా నెయ్యెడబోయినను వెల్లడికామా. ఈదినములు గడపంగ నెద్ది దెఱగయ్యెడినో" అని పలికినాడు. "దినములు" అని పలుకుటలో నభిప్రాయము కలదు. ఒకటికాదు, రెండుకాదు, పదికాదు, వందకాదు, వందలకొలదిదినములు గడపవలసియున్నదే ఎటులగడచును అని ధర్మజుడు విచారించినాడని భావము. అర్జును డిటుల బదులు పలికినాడు.

గీ. ధర్మదేవత నీడు సత్కర్మమునకు
మెచ్చి యెంతయు ప్రీతిమై నిచ్చినట్టి
వరము గలుగంగ మనమేమి వర్తనమున
నెచ్చటనున్నను నొరులకు నెఱుగ నగునె. ౬౧

మేమేమి అవజ్ఞతలు గావించినను బయల్పడము. నీవు నీదు సత్కర్మమున సంపాదించిన వరము మనకు రక్షగా నున్నందున భయమొంద నవసరములేదు అని పలికినాడని సారస్యము. "అగునె" అను పదము మిగుల సొగసుగా నున్నది. ఇందుకు ధర్మజుడు ప్రియమందినాడు. మన మేయేపనులగావించుచు విరాటుమనము పడయుదమో అది ల్పుడు" అని పలికినాడు. "చెపుడా" అని ఈషద్భ్యమంతయు చేయు యు నొకవిశేషమేను. ధర్మజు డిట్లు పలుకగా నుం దాతని వ్యాపార

మును గూర్చియే యడుగవలసివచ్చినది. అర్జునుడు "సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుంగా నతని నుపలక్షించుచు" పలికినాడు. ప్రభుత్వసంపదయేగాని గొల్చుస్వభావము లేనివాడగు (కొల్చుట యెఱుంగనివాడగు) ధర్మజు డేరీతిని విరాటుని గొల్చి తిరుగును అని అర్జునుని వితర్కము. కావుననే "కొల్చి తిరుగ నెరవు లేని యట్టి నీవు ఎట్టి చందంబున ననుచరించువాడవు" అని పలికినాడు. కొలగానిపనిలో బ్రవేశింపనున్న ధర్మజుని నోట నల్పపుమాట వినవలసివచ్చుచున్నందున విషాదముగ నుపలక్షించినాడు. అన్నికాలములం దన్నివిధములచేతను గౌరవింపదగిన మానిసిగావున గౌరవముగా నుపలక్షించినాడు. అర్జునుడు ధర్మజుని నుపలక్షించుట అప్పుడు సవితర్కముగను, సవిషాదముగను, సగౌరవముగను నున్నదని భావము.

తానుండురీతి వెల్లడించి ధర్మజుడు భీముని నిరీక్షించినాడు. అర్జునుడు ధర్మజుని ఉపలక్షించి పలికినాడనియు, ధర్మజుడు భీముని నిరీక్షించిపలికినాడనియు తిక్కన రచించినాడు. ధర్మజుని సమముగా జూడజాలక అర్జునుడుపలక్షించి పలికినాడు. అనగా సమముగా జూడలేదు గాని చూచుచున్నాడని భావము. ధర్మజు డట్లుగాక భీముని నాపాదమస్తకము నిరీక్షించినాడని భావము. ఇట్లుగా జూపులో వ్యత్యాసమును గనబఱచి తిక్కన, ధర్మజ భీమసేనుల ప్రత్యేకవ్యక్తిత్వమును (స్వరూపమును) జక్కగ వ్యక్తీకరించినాడు.

..........................................................

..........................................................

గీ. నితడు పుట్టిన కోలెను నెసక మెసగు
దర్పమునన వర్తిల్లు నుదగ్రహృదయు
డకట యొరుచిత్తమున కెక్కునట్లుగాగ
మెలగి యేమివిధంబున గొలుచువాడు. ౭౮

ఈపద్యమున "మెలగుట, కొలుచుట" అను రెండువిషయములు చెప్పబడినవి. పుట్టినది మొదలు దర్పించి వర్తించు నుదగ్రహృదయుడౌరు చిత్తమున కెక్కునట్లుగా నెట్లు మెలగగలడు అనునది మొదటి విచారము. భీముడు చిననాటనుండియు దర్పమున వర్తించు నుదగ్ర

హృదయుడు. కావుననే నిర్నిమిత్తముగ కౌరవులు నూర్గురకు భీముని వర్తనము సరిపడినదికాదు. అట్టి స్వభావముగల భీము డిప్పు డెటుల మెలగ గలడు. అదియు నొరుచిత్తమున కెక్కునట్లుగా నెట్లు మెలగ గలడు అని ధర్మజుని శంక. ఇదిగాక అట్లు మెలంగుటలో నితరుని గొలువవలసియున్నది. అది యెట్లు కొనసాగును అనునది యింకొకశంక. ఈ రెండుశంకలను ఒక్కశంకగారచించుట కవిగావించిన చమత్కారము. భీముడు తాను చరించురీతి నెఱిగించినాడు. నానాప్రకారంబుల నతని మనంబు వడయుదని తగుమాటగా బలికినాడు. ఇక్కడ చంపకమాల యందు క్రమాభివృద్ధిని గవి వ్యక్తమొనరించినాడు. "కోలుపులి, కారె నుపోతు, ఉన్మదకరి, ఉగ్రమృగనాథుడు" అనుపదములం దిది కననగును. ధర్మజు డమ్మెయికి సమ్మతించినాడు.

భీముడు పలికినది విని ధర్మజుడందులకు సమ్మతించినాడు. పిదప భీభత్సుని వీక్షించినాడు. భీమబీభత్సులను వీక్షించుటలో గవి కొంత తేడా వ్యక్త మొనరించినాడు. భీముని నిరీక్షించిన ధర్మజునకు ఖేదము గలిగి కన్నీరు వెడలవచ్చినది. దాని నాతడాపుకొనుచు నిట్టూర్పు ఉడంచి ధైర్య మవలంబించినాడు. అనగా నోటమాట వచ్చుట కప్పటి కవకాశ మైనదని భావము. భీభత్సుని వీక్షించిన ధర్మజునకు మనసు పరిభ్రమించు చున్నది. "మహానుభావుడగు అర్జును డొక మత్స్యుని జేరి అనుదాత్తత నెమ్మెయి గొల్చువాడుకో" అని పలికినాడు. భీమునివిషయమున "ఏమి విధమున" అనియు, అర్జునునివిషయమందు "ఎమ్మెయి" అనియు తిక్కన రచించినాడు. ఏవిధమునను భీముడు గొల్చియుండనే లేడనియు, అర్జును డొకవేళ నుండ సహించినను యుండగలడా అనియు ధర్మజుడు తలంచి నాడని సారస్యము. అర్జునుడు దాను మెలంగుతెఱంగు వ్యక్త మొనర్పగా ధర్మజుడు "ఇది వోలునని యియ్యకొనియె" అని వ్రాసినాడు. తానుండు రీతి దెల్పబోయి అర్జునుడు "పేగాదనుడా" అని పలికి యున్నాడు గాన ఇది వోలున్నని పలికినాడని భావము.

నకులునివలనుసూచి మనమందు నిండారిన దుఃఖముగల్గి కంఠ ధ్వని వేఱుకాగా ధర్మజుడు పలికినాడు. నకులుని ప్రత్యక్షముగా నతడు చూడలేదు. అత డున్నవైపు చూచి పలికినాడని భావము."అంతటి అంద

గాడు నాగరికపు లక్షణములుగలవా డాపురి నెట్లు సంచరించునో” అని చింతించినాడు. లావుపాటి శరీరముగల భీముడు ఉచితమనువట్లు వంటవాడ నగుదు ననినాడు. ఉదాత్తచిత్తుడగు భీభత్సుడు శరీరాంతర పరిగ్రహంబుచేసి నపుంసక వేషమున నుందునని పలికినాడు. ధర్మజునకు గల్గిన పై రెండు శంకలూ నిందువలన పోయినవి. కాని బహురూపవంతు డగు నకులు డాపురి నెట్లు సంచరింపగలడు అని విచారించినాడు. నకులుని విషయమైన ఈ ప్రసంగమందు పరుల గొల్చుట యెట్లు అని విచారింపక పురమం దెట్లు సంచరింపగలడు అని పలుకుట సారస్యమైన విషయము. నకులుడు తానుండురీతి వ్యక్త మొనరింపగా ధర్మజుడు “కడు లెస్స” అని పలికి మనమం దూఅడిల్లినాడు నకులు డశ్వపాలకుడై ప్రవేశింప నెంచినాడు గాన ఆతనిరూపమున కాపని తగియున్నదని ధర్మజుడు మనమం దూరడిల్లి పలికినాడని భావము. అకుటిలుడు...నీతినిర్మలాత్మ కుడు ... సధర్ముడు ... మెత్తనివాడు ఈమొదలగు సద్గుణములు గల్గిన సహదేవుడు ఎట్లుగా నొరు నాశ్రయించి బ్రతుకగలడు అని వగలు మిగిలి కొందలపడుపగా ధర్మరాజు పలికినాడు. ఆశ్రయమనునదే కిట్టని అమానుష తేజోధనుడగు సహదేవు డెట్లుగా నొరు నాశ్రయించి బ్రదుక గలడు అని ధర్మజుడు విచారించినాడు. సహదేవుడు తన నడవడితీరు నెఱిగించి మేలగు నడవడి గలిగియుండునని చెప్పినాడు. ధర్మజుడు “ఇది యుక్తం బగును” అని పలికినాడు. నకులుడు రూపవంతుడు గాన “కడు లెస్స” అని పలికినాడనియు, సహదేవుడు నీతివంతుడుగాన “యుక్తమని” పలికినాడనియు సారస్యము. “ఏమివిధంబున గొలుచువాడు, ఎమ్మెయి గొల్చువాడొకో, ఎట్లితం డప్పురి సంచరిందునొకో, ఎట్లుకో యొరు నాశ్రయించు” అని ధర్మజుడు భీమార్జున నకులసహదేవుల విషయమై వచించినట్లుగా తిక్కన రచించినాడు. ఇవి వారివారి అంతరములను (స్వభావస్వరూపములను) వ్యక్త మొనరించునవియై యున్నవి. మొదటి రెండుపదములు పద్యాంతమునను, తక్కిన రెండును పద్యము మధ్యభాగమునను రచించుటయు, “ఎట్లకో, ఎట్లకొ” అని దీర్ఘహ్రస్వ ములుగా పదముల నుపయోగించుటయు సారస్యమైన విషయము. భీమాదులవిషయమై ధర్మజుడు ప్రసంగించినది ప్రథమపురుషలో

నుండుట సారస్యమైన విషయము. తమ్ములను ప్రత్యక్షముగా నడుగ లేకపోయినాడని యిందున్న యభిప్రాయము. కావుననే పూజ్యుడగు ధౌమ్యునిమాత్ర మీమంత్రాలోచనమందు దిక్కున సేర్చినాడు.

ధర్మజుడు పాంచాలి నాలోకించి ఖన్నాంతఃకరణు డగుచు పలికినాడు. మనోబుద్ధి చిత్తాహంకారము లనునవే అంతఃకరణచతుష్టయము. తమ్ములు నలుగురివిషయ మెంత విచారించినానో అంత విచారము ధర్మజుడొక్కమాఱుగా ద్రౌపది నాలోకించినపుడు పొందినాడనిభావము. "ఒండుల గొలువగా నెరవెఱ్ఱియి గల్గు నక్కటా" అని విచారించినాడు. కావుననే ద్రౌపది వెరవుకలిమియొక్కను దెలియునట్లుగా దెల్పినది. అప్పుడు ధర్మరా జిట్లు పలికినాడు.

క. మనవంశంబును వృత్తం
బును బెంపును గావజాలు పుణ్యసతివి నీ
జనులగు తుబువలతలపులు
గనుగొని యేమఱక మెలగగా వలయు జుమీ. ౧౧౨

ద్రౌపది యిది విని "అనాదరసుందస్మిత సుందరవదనారవిందయై" "కులశీలగౌరవములు గాపాడుకొను సైరంధ్రిగా నుందును" అని పలికినది. మఱియు నిట్లు పలికినది.

క. కావున నుచితములగు నా
కా వెంటం గొలిచి తిరుగునప్పుడు మితభా
షా విరచనమును వ్రతసం
భావనమును గౌరవంబు బాపభయంబున్. ౧౧౩

పై రెండుకందపద్యములు సంబంధము గల్గియున్నవి. వంశము వృత్తము, పెంపు, ఏమఱకుండుట అను నాల్గువిషయములను ద్రౌపది గాపాడవలసి యున్నదని ధర్మజుడు పలికినాడు. ద్రౌపది దాని కిట్లు సమాధాన మొసంగినది. వంశమర్యాద ననుసరించి మితభాషావిరచనమును, వృత్తము ననుసరించి వ్రతసంభావనమును, పెంపుననుసరించి గౌరవమును, ఏమఱక మెలగువిషయమున పాపభయము గల్గియుందును" అని ద్రౌపది క్రమముగా సమాధాన మొసంగినది. ద్రౌపది యిట్లుపలుకగా ధర్మజుడు

"అగుబోష్ము" అనినాడు. ద్రౌపది ఆలోచించినది బహుసమంజసముగా నున్నదని యాతడు పలికినాడని భావము.

ఇట్లుగా పాండవులు మంత్రాలోచన మొనరించి తాముండువిధంబులు (సన్యాసి, వంటలవాడు, నాట్యాచారి, అశ్వపాలకుడు, గోపాలకుడు, సైరంధ్రిగా నుండుటకు) నిర్ణయించుకొని అభ్యంతరపరివారము నంతయు బంపివేసిరి. ధౌమ్యుడు పాండవులకు రాజసేవాధర్మంబు లెఱింగించినాడు.

పాండవులు తమ యాయుధంబులు ఒక శమీవృక్షమునకు గట్టిరి. ఈశమీవృక్షమును 'శమీతరుచక్రవర్తి' అని తిక్కన వర్ణించినాడు. చక్రవర్తి సొత్తుదాచుకొనుటకు చక్రవర్తియే జతపడినాడని సారస్యము. ఆయుధముల దాచువిషయముగాన మఱియు సందర్భించియున్నది. ధర్మదేవతానుగ్రహమున నున్నపాటున పాండవులకు సన్యాసాదిరూపము లలవడినవి. ముందుగా ధర్మరాజు విరాటుకొలువుకూటము చేరవచ్చెను. దైవయోగంబున విరాటుం డపుడు బయలికొలు విచ్చియుండెను.

ఉ. దవ్వులజూచి మత్స్యవసుధాపతి యీచను దెంచుచున్న వా
డెవ్వడొ నాదుచూడ్కులకు నెంతయు ప్రేగయితోచె నెట్లితం
డివ్విధిబొందెనో జగము లెల్లను నేలగజాలు తేజ మా
మువ్వురతోడి జోడి యగు మూర్తి యతీంద్రుని యొప్పు గంటిరే.

సీ. కరచరణాద్యంగకంబు లేలకొ రత్న
భూషణ ప్రకరంబుపొందు దొఱగె
నుభయపార్శ్వంబుల నిభఘట లేలకొ
చనుదేవు సముదాలిసమితిమొరయ
బాయు తొలంగు మంచాయతవేత్రహ
స్తులమొత్త మేలకొ తోడరాదు
ధవళాతపత్రముల్ దఱచుగా నేలకొ
పట్టరు మౌక్తికప్రభలు వెలుగ

తే. నితడు రాజగు రాజనినంతమాత్ర
గాదు మూర్ధాభిషిక్తవర్గంబు దనదు

చరణయుగ్మంబు గొలిపింపజాలు సార్వ
భౌమపదవికి దగియెడు భంగివాడు. ౧౮౮

విరాటుడు వచ్చుచున్న ధర్మజుని తేజము చూడ జాలకపోయెను. అత్యాశ్చర్యకరమైన యొప్పు ఆతనికి గనఁబడినది. ఏకచ్ఛత్రాధిపత్యము చేయునట్టి తేజ మాతనికి గనబడినది. అట్టిమహానుభావుడు యతీంద్రు డెట్లాయెను అని విరాటు డాశ్చర్యపడినాడు. ఇతని కరచరణాద్యంగకంబులు రత్నభూషణప్రకరంబు పొందుతో శోభించునట్టిది. అదియేల దొలంగియున్నది అని విరాటు డాశ్చర్యపడినాడు. శోభించియుండవలసినవి అనియు గాదు శోభించినట్టిది అని విరాటు తలంచినాడని సారస్యము. ఈ పద్యమంతయు నిట్టి భావముతోడనే వ్రాయబడినది. ఇతడు రాజగును. ఒట్టి రాజని తలంచుటయు బాగుండలేదు. మూర్ధాభిషిక్తులందఱు నితని సేవించియుండవలసినదనియు గాదు. వారందఱు గొలిచియున్నట్టి చరణయుగ్మముగల సార్వభౌముడుగ గానబడుచున్నాడు అని విరాటుడు తలంచి పలికినాడని సారస్యము. "తగియెడుభంగివాడు" అనునదియు సారస్యమైన పదమై యున్నది. సార్వభౌముడుగ నున్నవాడాలక్షణముల విడిచి యొంటరిగ నిట్లేల వచ్చుచున్నాడని విరాటు డాశ్చర్యపడినాడని సారస్యము.

వ. అని సమస్తజనంబులు దదభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దాను గద్దియడిగ్గి యెదురుసని నమస్కరించి యతని యాశీర్వాదంబులు గైకొని సగౌరంబుగా దోడ్కొని చనుదెంచి సముంచిత సమున్నతాసనంబున నునిచి వినియామనతుండయి. ౧౮౯

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నంతయును నేర్పడగా నెఱిఁగింపు డున్నరూ
పయ్యది నావుడుఁ నరవరాగ్రణి కయ్యతిముఖ్యు డిట్లనున్. ౧౯౦

సార్వభౌమపదమువాడు సన్యాసిగా వచ్చినాడు గాన విరాటు డందఱితోడను లేచి స్వాగత మొసంగినాడు. ఈ మర్యాద సార్వభౌమపదవికి సన్యాసికిగూడ సరిపోయియున్నది. ధర్మజుడు సన్యాసిగా నున్నాడుగాన ముందుగా జన్మభూమి నడిగినాడు. ఈ మహాత్మునిగన్న దేశ

మేది అని భావము. పిదప కులము నడిగినాడు. కులము నుద్ధరించినపైని సన్యాసివైయై ఎచ్చోట నివాసమని పిదప నడిగినాడు. నివాసాదులను ఉన్న రూపున నెఱిగింపుడని యడిగినాడు. అప్పుడు విరాటునిగూర్చి ధర్మజు డిట్లు పలికినాడు.

ఆ. ఉన్నరూప పలుకు నన్నరు లెక్కడ
గలరు తోంచి నట్లు పలుకు వలుక
నైనచందయయ్యె నంతియ కా కంత
పట్టి చూడగలరె యెట్టివారు. ౧౯౧

ధర్మజుడిట్లుగా మేలమాడినాడు. మేలమాడిన ధర్మజుడు పిదప మందహాసము సేయుచు మఱియు బలికినాడు. తాను పలికినదాని కాధారవిషయమును నిరూపించుచున్నాడు గాన సన్యాసియైన ధర్మజుడు మందహాస మొనరించినాడని సారస్యము.

క. నానావిధభూతమయము
మే నతిచంచలము మనము మెయికొని నిక్కం
బె నరునకు జెల్లింపం
గా నను సత్యంబు నడపు క్రమ మ ట్లుండెన్. ౧౯౩

ధర్మజు డిట్లుగా బలికి కొంత యథార్థమునే పలికెదనని సొగసుగ దేల్చినాడు.

వ. అనుచు మత్స్య మహీవల్లభు నవలోకించి. ౧౯౪

ధర్మజు డింతవఱకు విరాటునితోడ ముచ్చటించుచున్నను నతని నుద్దేశించి పలుకుచున్నాడేగాని ఆతనినే అవలోకించి పలుకలేదు కొలువునంతయు గనుంగొనుచు బ్రసంగించినాడని భావము. ఈ వేదాంత సంబంధమైనవిషయమును సభికులనందఱ నుద్దేశించి ప్రసంగించినాడని సారస్యము. ఇటుపైని విరాటునవలోకించి తనవిషయ మంతయు నెఱింగించినాడు. "ధర్మపరుల సంగతిం దగిలి మచ్చికనుండుదు" అని పలికినాడు. విరాటసభయందు కీచకునిచే పరిభవింపబడి ద్రౌపదివచ్చినపుడు ధర్మప్రసంగము ధర్మరాజు గావించును అనునది భావిసంఘటన మిచ్చటనే

సూచింపబడినది. "భూమిపతులలోన సాధుజనమిత్రుడు నా విని కొల్వ వచ్చితిన్", అనియు "ఒక్కవత్సరమే యిటనుందును" అనియు ధర్మజుడు పలికినాడు.

ధర్మజుని వచనములు విని సంప్రీతచేతస్కుండై విరాటుడు "రుచిరోన్నతాసనములు, వస్త్రములు వలయు భోగమునెల్ల నాకువలెనే మీకు నడపెదను" అని పలికినాడు. ఇట్లు పలుకుటలోగూడ నీచెప్పిన భోగసాధనములె కాక "మఱియెల్లవర్తనములును నాకువలెనే మీకు నడపువాడ" నని పలికినాడు. ఇట్లు పలికికాని విరాటుడు తుష్టినొందలేదు. ఇచ్చటనున్న "అట్లచేయుదు" అనునది విరాటునిఆదరమును గౌరవమును సంప్రీతిని వ్యక్తము చేయుచున్నది. విరాటు డింకను సంతుష్టి నొందలేదు "మిమ్ము నతిక్రమించినడుచువా డెంతటిప్రసిద్ధుడైనను దండింతును" అని పలికినాడు. విరాటు డింకను పరితుష్టినొందక మఱియు నిట్లు పలికినాడు. "రాజ్యమంతేయు సమర్పించెదను. నేనును నీయధీనమం దుండెదను" అని పలికినాడు. "అట్లుచేసి కృతకృత్యత బొందుదు మట్లుచేయవే" అని పలికినాడు. 'అట్లచేయవే' అను పదము సొగసైనది. తాను తన రాజ్య మామహాపురుషున కొక లెక్కయగునా అనుభావ మిందు స్ఫురించుచున్నది. ధర్మజుని తేజమునకు ముగ్ధుడగుచున్న విరాటుడు తనయభిలాషయొక్క పరిమాపధిని నిందుమూలముగా వ్యక్తమొనరించినాడు. యతీంద్రుని యొప్పు ఘనతరమైనదని తలంచినాడు.

ఈ ఆదరవచనములకు ధర్మజుడు దరహాసితవదనుడైనాడు. "నేను హవిస్సు తినువాడను, భూమిపై బండుకొనువాడను ఇది నావ్రతము. అట్టి నా కివన్నియు నేల" అని పలికినాడు. "మీకిష్టమైన తెఱగున వలసినన్ని దినము లిటనుండుడు. అదియ మాకు శోభనము" అని విరాటుడు పలికినాడు. ధర్మజుని నిట్లుగా సంభావించిన విరాటు డాతని నెట్లుగా గౌరవించునదియు నీ దిగువరీతిని తిక్కన వ్యక్తముచేసినాడు.

చ. పారిబొరి బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించు ద
త్పరమగు సద్వివేకమున భావనిరూపణ సేయుగౌతుక
స్ఫురణ గరంబు దత్కరము బొంద నయంబున జేర్చి వాక్య వి
స్తరచతురత్వ మేర్పడగ సల్లపనం బొసరించు సద్ధితోన్. ౨౦౫

ఈపద్యము తిక్కన కళాచాతుర్యమును వ్యక్తముచేయుచున్నది. ఇందు నాల్గవపాదము మఱియు చమత్కారముగ నున్నది. ఈపద్యభావము తిక్కన స్వతంత్రాభిప్రాయరత్నమై యున్నది. మఱియు "ఇట్లు మత్స్యమహీవల్లభుం డతని గలిపికొని" అని వ్రాసినాడు. ధర్మజుని తన స్వంతమనిషిగ విరాటుడు చేర్చుకొనినాడని భావము.

భీముడు ప్రవేశింపగా నంతంతం గనుంగొని సభాసదులందఱు నత్యంతము విస్మయము నొందిరి. "చూపరెల్లను" అను పదములో విరాటుడుగూడ సారస్యముగా నిముడ్చబడియున్నాడు. భీముడు వచ్చుచుండగా విరాటుడు అంతంతం గనుంగొనినాడు. అనగా నతడు సమీపించుచున్న కొలంది విరాటునకు సంభ్రమాశ్చర్యంబులు పెనగొనుచున్నవని యభిప్రాయము.

క. ఉలుకును వెక్కసపాటును
దలకొను నెమ్మనముతోడ ధాత్రీరమణుం
డలఘుభుజవిపులవక్ష
స్థ్సలరేఖాకాంతి బరవశత్వము బొందెన్. ౨౧౩

భీముని చూచి విరాటుడు పరవశత్వమొందినాడు. మఱియు నతని రూపాతిశయమున కొట్టువడి చూచుచున్నాడు. ఆ రూపాతిశయమును గాంచి విరాటుని హృదయ మతని యధీనమై పోయినదని భావము. విరాటు డిటుల నబ్బురపాటు నొందియుండగా "నేను వంటలవాడను. వంటలందు నన్ను మీఱువా రెందును లేరు" అని భీముడు పలికినాడు. దానితో విరాటునకు మఱియు నాశ్చర్యమైనది. అంతటివాడు వంటలవాడగుట యుచితము కాదని తలంచి గజవ్రజముపై నధికార మొసంగెదనని పలికినాడు. సమదవారణపతిగమనమున వచ్చిన భీమసేనుని గాంచి విరాటుడు సంభ్రమాశ్చర్యము లొందియున్నాడు. కాన దదనుగుణముగ నతనికి గజవ్రజముపై నధికార మొసంగవలెనని విరాటున కభిలాష గల్గినదని సారస్యము. భీముడు మోఱకుచందమున మొ మడ్డము గదల్చి "నాకవియెల్ల నేల ధర్మజుని గొల్చినయట్లు నిన్ను గొల్చెదను. నే నతిబలము గల్గినవాడను. క్రూరమృగములతోడను, మల్లులతోడను బోట్లాడగలను" అని పలికినాడు. జీమూతమల్లునితో

గల్గనున్న జెట్టిపోట్లాట భావిసంఘటన మీట సూచింపబడినది. "మత్స్య మనుజాధీశుం డనిలసుతు నేలె" అని తిక్కన వ్రాసినాడు. వంటవాడుగా భీముడు ప్రవేశించినాడు గాన "ఏలె" అనుపదము సందర్భముగానున్నది.

భీముడు ప్రవేశించినపైని అర్జునుడు ప్రవేశించినాడు. "మనుజాధీశునకు సభాజనులకు దను జూపినా" డర్జునుడు. అనగా చూడండి నావేషమునునట్లుగా మెలంగినాడని భావము. అట్లుగా సమీపించుచున్న అర్జునుని విరాటుడు చూచినాడు.

మ. వనితావేషము గల్గియున్న యది చెల్వాం బాడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వముం గాజసం
బును శోభిల్లెడు నెవ్వడే నొక జగత్పూజ్యుండు క్రీడార్థ మి
ట్లొనరం దాల్చినరూపు గావలయు మీ రూహింపుడా యట్లగున్.

"మీ రూహింపుడా యట్లగున్" అని పలికినాడు. 'జగత్పూజ్యుడు క్రీడార్థ మిట్టిరూపము ధరించియుండవలయునని తోచుచున్నది. సభాసదులారా మీరందఱు నూహింపుడు, అక్కఱలేదు. ఊహింపనక్కఱలేదు. ఒకానొక మహానుభావుడే యిట్లు వచ్చియున్నాడు. అట్లే యగును. నిస్సంశయము' అని పలికినాడని భావము. విరాటు డిట్లుగా దలంచుచుండగా నర్జునుడు "కన్నియలకు నాట గఱపగా నోపుదు. మన్నామంబు బృహన్నల యే బేడిని" అని పలికినాడు. అంతటి వర్చస్సు గల్గినవాడు పేడియగుటకు విరాటుడు మిగుల విచారించినాడు. ముందుగా నతడు పేడియైనందులకే విచారించినాడు. తన కట్టి పేడిరూపము గల్గినందులకు అర్జునుడు విచారమును వెలిబుచ్చినాడు. "ఒండువిధము వీలులేనందున శైశవమాదిగాగ నాట్యప్రసంగమునే యభ్యసించితిని" అనినాడు. ఇచ్చోట "ఇన్ని దెఱగుల శ్రమము సేయింతు జతురతావిహీనములైన పాత్రముల నైన" అని యర్జునుని చేత పలికించి తిక్కన ఉత్తరుని రణకోవిదుని గావించుట యను ఉత్తర గోగ్రహణ విషయమును ధ్వనింపజేసినాడు. 'నర్తనశిక్షణకుగాను బృహన్నల కప్పగింప నెంచి, ఉత్తరను రావించినాడు విరాటుడు. ఉత్తర బయలువెడలివచ్చినది.

సీ. అల్లదనంబున నసువు మైకొన జూచు
నడపు కాంతికి వింతతోడవు గాగ
వెడవెడ నూగారి వింతయై యేర్పడు
దేరనివళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవులకలమేర
లెల్లను బిగి యెక్క యేర్పడంగ
దెలుపును గప్పును వెలయంగ మెఱుగెక్క
తారకంబుల గల్కితనము దొడర
ఆ. చరణములును నడుము చన్నులు గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికి దెలుపుచుండ నుత్తర ననుదెంచె
నలరువిలుతు పువ్వుటమ్ము వోలె. ౨౪౫

ఆ. వచ్చి కొలువునొచ్చి నిచ్చలిపించు నం,తంత నిలువబనిచి యల్లనల్ల
గవిసి ప్రౌఢవనితకై వడి ముద్దియ, ముద్దువుట్టదనకు మ్రొక్కుటయును.
చ. తిగిచి కవుంగిలించి జగతీవిభు డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపు గరాంగుకులం గపోల మిం
పుగ బుడుకుం బొరింబొరి నపూర్వవిలోకన మాచరించు గ
ప్పుగు మృదునాళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్. ౨౪౬

ఇందు మొదటిపద్యమున మందగమనము, నూగారేర్పడుట, స్తనములు విరివియగుచుండుట, కనుగవ మెఱుగెక్కుచుండుట వర్ణింపబడినందున నుత్తరకు యౌవన మంకురించుచున్నదని సూచింపబడినది. చరణములందు గమలములును, రోమావళియందు భృంగములును, స్తనములయందు పద్మముకుళాకారమును, నేత్రములందు కలువలును ధ్వనితమైనందున నుత్తర అలరువిలుతు పువ్వుటమ్మువోలె విలసిల్లుచున్నదని సూచింపబడినది. అజ్ఞాతవాసము పూర్తియగు నవసరమున బృహన్నలను సారథ్యమునకు బిలువ వచ్చినపుడు అనగా నొక సంవత్సరము గడచిన కాలమం దుత్తర యెట్లున్నదియు దిక్కన యిట్లు వర్ణించినాడు.

సీ. అనుగుల ననుగాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కవణి నొప్ప

బాలిండ్లు దనువెడ వ్రాలింప జెన్నొందు
నసదుగౌదీగె యల్లాడుచుండ
దఱివేచి వెనువెంట దగులు కామాంధకా
రము లీల గ్రొవ్వెద గొమరుమిగుల
గర్ణభూషణ మౌక్తిక ప్రభాధోరిలన
మీక్షణదీప్తుల నిసుమడింప

గీ. నందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోది రాయంచ రయమునబోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమున దోన
చనగ నుత్తర నర్తనశాల కరిగె. ౪-౨౬

ఆ. మెఱుగు మొగిలునొచ్చు తెఱగున నాట్య మం
దిరము సొచ్చి తనదు గురువుకడకు
నరిగి నెమ్మి నిట్టులను నింతి ప్రార్థనా
వినయ సంభ్రమములు పెనగొనంగ. ౨౭

వత్సరము గడచునసరికి ఉత్తరకు నడకలో నొయ్యార మెచ్చి నది. నూగారేర్పడుచు స్తనములు వికసియగుచుండిన ఉత్తర కిపుడు పాలిండ్లుదనువెడ వ్రాలింపగా గౌదీగ యల్లాడుచున్నది. మొదటి సీసప ద్యములోని ౨ 3 పాదములలో దెల్పినవిషయ మీరెండవసీసమున నొక్క ౨ పాదమునసే రచించి తిక్కన యీ సొగసుగూర్చినాడు. సంవత్సరమునకు ముం దుత్తర తలకట్టు (మృదువమాళి) తండ్రి (విరా టుడు) నఖాంకురచేష్ట యొనర్చుటకుమాత్రమే యొప్పియున్నది. సంవ త్సరము గడచునరికి (అజ్ఞాతవాసము పూర్తియగునప్పటికి) దఱివేచి వెనువెంటదగులు కామాంధకారములీల నొప్పియున్నది. అప్పటి మృదు మౌళి నేడు గొవ్వెదయైనది. తారకంబుల గల్కితనము గల్గియున్న ఉత్తరదృష్టి కర్ణాభరణములచే దీప్తినొంది విలసిల్లినది. ఆదిని నెచ్చెలి పిండు నంతంత నిలిపి చనునట్టి ఉత్తర నేడు యౌవనాభివృద్ధిచే ప్రోది రాయంచను వెంటబెట్టుకొని యున్నది. వెనుక మనిషిలేనిది యువతి రాలేదని సారస్యము. ఆదిని రాజసభకు చనుదెంచిన ఉత్తర నేడు నర్తనశాల కరుగుచున్నది. పువ్వుటమ్మువలెనే సభకు వచ్చి బయలికొ

బువు సొచ్చిన ఉత్తర నేడు మెఱుగు మొగిలు సొచ్చు తెఱగున నాట్య మందిరము సొచ్చినది.

ఇచ్చట నింకొక్క విచిత్రమును గుర్తింపవలసియున్నది. ద్రౌపది సుదేష్ణ అంతఃపురమునకు వచ్చునపు డిట్లుగా దిక్కన రచించినాడు.

సీ. పదతలంబుల కెంపు పరగినతలము కుం
కుమలిప్తమైనచందము వహింప
నంగంబు నునుగాంతి యడరినగోడలు
వేదులు మణిమయవిధము నొంద
గనుగవ మెఱుగులు గదిరినముందఱ
బుష్పోపహారంబు పోలుపు దాల్ప
వేనవికప్పు పర్వినమీఁదు నీలదు
కూలంబు మేల్కట్టు కొమరువడయ

గీ. దాను జొచ్చినకతన మత్స్యక్షితీశు
నింట నిమ్మెయి గ్రొత్త యొప్పెసక మెసఁగ
నమ్మహాదేవియున్న డ కల్లనల్ల
బాండు రాజతనూభవపత్ని యరిగె. ౧౩౦౮

ఉత్తరకు అడుగులయందు నునుగాంతి కలదని వర్ణింపబడినది. ద్రౌపది నడుచుచుండగా నా ప్రదేశమంతయు గుంకుమ లిప్తమైన ట్లగుచున్నది. ఉత్తరకు బాలిండ్లకెనుపుచే నసదుగౌదిగె అల్లలనాడుచున్నది. ద్రౌపదికి అవయవసౌందర్యమేగాక అసౌందర్యముపైన నొకవిధమగు వింత చెలువము గల్గియున్నది. ఉత్తరను వర్ణించునపుడు అవయవసౌందర్యమును మాత్రమే వర్ణించి ద్రౌపదిని వర్ణించినపుడు అవయవసౌందర్యముతో బాటు కాంతివిశేషమునుగూడ తిక్కన వర్ణించుచుండును. ఉత్తరకు గసుగవదీప్తిమాత్రమే గలదు. కామాంధకారమోయనునట్లు గ్రొవ్వెద గలదు. ద్రౌపదికి కనుగవలలో మెఱుగులుగలవు. వేనలికప్పు పైకి వ్యాపించి నీలిదుకూలంపు మేల్కట్టుగా నొప్పినది. ఇట్లుగా ద్రౌపది నెచ్చట వర్ణించినను దిక్కన దేహసౌందర్యముపై నందగించు కాంతి విశేషమునుగూడ వర్ణించుచుండును. (౨.౩౩. ౪౫.౫౨)

విరాటుడు గాదిలికూతు నుపలాలించినాడు. కూతు నప్పగించు నాసమయమున విరాటుడు "సాదరదరహసిత రుచిరాననుడై నాడు. తగిన గురువు లభించినాడు గాన "సాదరదరహసితు డై నాడనియు, కూతురు కళాభిజ్ఞురాలుకానున్నది గాన రుచిరాననుడై నాడనియు సారస్యము. లేక మొత్తముగా నిది సమన్వయించినను అన్వయింపవచ్చును. "రుచి రాననుడు" అను పదము మిక్కిలి సందర్భముగా నున్నది. గాదిలికూతు నుపలాలించు విరాటుని మనోవికాసమునంతయు నాపదము స్పష్టము చేయుచున్నది. అర్జునుడు ముందుత్తరకు మామ కానున్నాడు గాన దైవయోగమున నిపుడే విరాటుడతనికి దనకూతు నప్పగించుచున్నాడని యిచ్చోట తిక్కన సారస్యముగ వ్యక్త మొనరించుచున్నాడు.

౧. బృహన్నల కప్పగించుటకై విరాటు డుత్తరను బిలిపించినాడు.

౨. విరాటుండు బృహన్నలదెసం గనుంగొని సాదరదరహసితరుచిరాననుడై యిమ్మగువ నీకు నాటగఱపందగు పాత్రం బగునే యని యడిగి తత్ప్రతివచనంబులయందలి నాగరికత్వంబునకు జిత్తంబు రంజిల్ల మధురసల్లాపంబు సేసి కర్పూరసహితం బగు తాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబరంబు లిచ్చి మణిమయంబులగు నాభరణంబు లొసంగి సంభావించెను. ౨౪౮

బృహన్నల నాగరికత్వంబున సమాధానమిచ్చినాడు గాన కన్యాగురుండగు నతనికి విరాటుండు చీనాంబరాదుల నిచ్చినాడని యొక సారస్యము. మామ కానున్న అర్జునుని సంభాషణ కుప్పొంగి మధుర సల్లాపంబు సేసి కన్య నప్పగించినాడని యింకొక సారస్యము.

౩. "దీని కేడుగడయు నీవకాదె" అని విరాటుడు పలికినాడు. ౨౫౧

౪. "అంగనహస్తముబట్టి తత్కరమున గదియించి కూతునకు బుద్ధిచెప్పి విరాటు డర్జునునకు గూతు నప్పగించినాడు. ౨౫౨

౫. ఆ. ఎల్లచుట్టములును దల్లియు దోడును
బెలియు బరిజనంబు జెలువ నీకు
గురువ యింక నొక్కకొఱతయులే దిందు
జేరి బ్రదుకు బుద్ధిగౌరవమున. ౨౫౩

క. మనయింట నిచ్చటచో్చి, టన కెచ్చటనైన నీబృహన్నల మెలగం
జనియెడు మానిసి దనమన,మున కిమ్మగునట్టిచరితమున వర్తించున్.

విరాటు డిందు "ఎల్లచుట్టములు బృహన్నలయే" అని పలికి కూతు నప్పగించినాడు. మఱియు సంబంధబంధువుగాన నాతని కెచ్చోట నడ్డుఁడ రాదని పలికినాడు. "ఇందు, మానిసి" అను పదము లిచ్చట మఱియు సారస్యమైనవి పై విషయములన్నియు బృహన్నలాదరమును వ్యక్తము చేయుచున్నవి. మఱియు కూతు నప్పగించుచున్నాడనువిష యమునుగూడ దైవికముగ బోధించుచున్నవి.

పిదప నకులుడు ప్రవేశించినాడు. నకులునకు దగుపదవియిచ్చెదనని విరాటుడు పలికినాడు. (౨౬౫) నకులు డశ్వశిక్షాకోవిదుడుగ గనబడి నందునను, అత డందు కుశలత్వము గలదని పలికినందునను అతనికి దగు పదవి నిచ్చెదనని విరాటుడు పలికినాడని సారస్యము. సహదేవునకు మండల సేనాపరిపాలనంబు నిచ్చెద ననినాడు. (౨౮౩) "బవరమైన నాకు బనియేమి యనజేతి బలిమి' లిమి నెఱపదలపుగలదు. (౨౬౩) అని నకులు నిచేత పలికించి దక్షిణగోగ్రహణవిషయమును, "తొఱగు వోకుండ మెక ములు గఱపకుండ" ౨౭౯. అని సహదేవునిచే బలికించి దక్షిణోత్తర గోగ్రహణవిషయమును దిక్కన యిచ్చట సూచించినాడు.

ధర్మజుడు గొల్వవచ్చుచుండగా దవ్వులజూచియే "చూడ్కికి ప్రేగయి తోచినాడు" అని విరాటుడు పలికినాడు. అతడు సభను ప్రవే శింపగనే సభాసదులును విరాటుడును నిలబడి గౌరవించిరి. విరాటుడే ముందు పలుకరించినాడు. రాజ్య మొసగి భృత్యుడుగ నుందు నని పలికి నాడు. భీముడు ప్రవేశించినపు డెవరును లేచి నిలబడలేదు. సభాసదుల కతని రూపు ప్రేగైన నత్యంత మాశ్చర్య మొందిరి. భీముడు సమీపించు చున్నప్పుడు అంతంతం గనుంగొని విరాటుడు "ఉలుకును వెక్కసపాటు నుగల్గి పరవశత్వ మొందినాడు. ఆతని రూపాతిశయమున కోటువడి చూచినాడు. "సూర్యచంద్రేంద్రులలో నిత డొకడై యుండును. కేవ లము మనుష్యమాత్రుడు గాడు. సభాసదులలో నితని నెఱింగినవా రెవరైన నున్నారా" అని పలికినాడు. సభాసదు లెవ్వరును సమాధాన మీయనేలేదు. "ఎవడే నొక జగత్పూజ్యుడు క్రీడార్థ మిట్టిరూపము

ధరించియుండును" అని విరాటుడు అర్జునప్రవేశమున బలికినాడు. అతని రూపము చూడ్కికి ప్రేగుకాలేదు. పరిజను లత్యంతవిస్మయ మొంద లేదు. విస్మయమొంది చూచుచుండిరి. నిశ్చయముచేసి యేమియు బలుక జాలక చూచుచుండిరి. నకులుడు ప్రవేశించినపుడు పరిజనులు నయనోత్సవముగా జూచిరి. అంతటిరూపాతిశయమున్నందులకు విరాటుడు మెచ్చుకొనినాడు. సహదేవుడు ప్రవేశించినపుడు రాజు, ప్రజలు అతనిని జూచి సంతోషించిరి. (౨౭౬) నకులప్రవేశములో పరిజనులవిషయ మొక పద్యము విరాటునివిషయ మొకపద్యము వ్రాసినతిక్కన సహదేవప్రవేశమున రాజునకు, పరిజనమునకు గలిపి ఒక్కటే పద్యము వ్రాసినాడు. సహదేవునిగూర్చి "సూర్యశశినిర్మలవంశజులైన రాజులం దొక్కమహానుభావుతనయుండవు" అని విరాటుడు పలికినాడు. నకులుని మానవాతీతరూపము గల్గినవాడని తలంచినాడని సారస్యము. ఈప్రకారము తిక్కన పాండవప్రవేశ విషయమున నాదరాశ్చర్యములందు గ్రమానుసరణము వ్యక్తముచేసినాడు. ధర్మజు డాశీర్వదించినాడు. భీముడు వినయంబున మ్రొక్కి నిభృతుడై విన్నవించినాడు. అర్జునుడు సవినయముగ మాటాడినాడు. నకులుడు వినతుడైనాడు. సహదేవుడు వినయావనతుడైనాడు. వినయవైభవము సతీతనువొందినచందమున ద్రౌపది సుదేష్ణను సమీపించినది. "వినయవైభవము సతీతనువొందిన" అను పదము మిగుల సాభిప్రాయమైనది. పాండవుల ప్రవర్తనమందంతయు నది ప్రతిఫలించుచున్నది.

మేఘము కప్పి కాంతిమాసిన చంద్రకళవలెను, మంచుపడి వికాసముచెడిన సరోజినివిధమునను, పొగక్రమ్మిన దీపకళికభంగి, ధూళిచే లావణ్యముబాసిన లతికమాడ్కి ద్రౌపది సైరంధ్రీవేషమును ధరించినదని తిక్కన ద్రౌపదీప్రవేశసందర్భమున వర్ణించినాడు. "మంచు మఱుగువడిన మార్తాండుడునుబోలె, నివురుగవిసియున్న నిప్పుబోలె" అర్జునుడు బృహన్నలావేషమున నున్నాడని అర్జునప్రవేశసందర్భమున వర్ణించినాడు. స్త్రీపురుషప్రకృతులనుగూర్చి తిక్కన యింతటి జాగరూకతను వ్యక్తీకరించుచు వర్ణించినాడు. పురజనులు ద్రౌపదిని గాంచి "ఈమె రోహిణిగాని, లేక అరుంధతిగాని అయియుండునేకాని మనుష్యజాతి

కానేరదు" అని తలంచిరని వ్రాసినాడు. కాంతిగలవానిలో శ్రేష్ఠమైనది రోహిణి. కనబడి కనబడనట్లుండునది అరుంధతి. అద్వితీయ సౌందర్య రాశియగు ద్రౌపదియొక్క అప్పటి సైరంధ్రీవేషమును ఈ రెండు ఉపమానములు చమత్కారముగా బోధించుచున్నవి. ద్రౌపది విరాటనగరమును బ్రవేశించి యిట్లు పలికినది.

ఆ. ఏనుగట్టువాలుడాన నాకెవ్వరు, గడుపుకూడు వెట్టి కట్ట జీర
యిచ్చి సాకతమున నేలుదు రట్టివా, రలకు బనులు నేసి మెలగుబుద్ధి.

క. వచ్చితి ననవుడు విని జను
లచ్చెరువును సందియంబు నడరెడు మదితో
నిచ్చెలువ కడుపుకూటికి
నెచ్చటనే నిలుచునట్టె యిది పలు కగునే. ౨౯౯

విరాటపౌరు లామెను దాసిగా నమ్మజాలకుండిరి. ఇట్లనుచుం గనుంగొనుచు పురజనులు ముసిరికొనుచుండిరి. సుదేష్ణ దీనినంతయు జూచి సౌధోపరిభాగమునకు రప్పించుకొనినది. ద్రౌపది అంతిపురము నలంకరించుటచే నది క్రొత్త యొప్పున వికసించినది. ఆమె పదతలంబుల కెంపు కుంకుమలిప్తముగను, అంగము నునుగాంతి యడరిన గోడలు వేదులు మణిమయవిధముగను, కనుగవ మెఱుగులు గదిరిన ముందటి భాగము పుష్పోపహారముపోలుపుగను, వేనలికప్పుపర్విన మీఁదిభాగము నీలదుకూలంపు మేల్కట్టుగను నొప్పి అందగించినది. "అంగము నును గాంతి మణిమయవిధము నొందినట్లుగా వర్ణింపబడినందున నామె హస్తములు, నఖములు, పెదవులు మొదలగువాని రక్తశ్వేతకాంతులచే పద్మరాగములు, వజ్రములు తాపినట్లు తోచెనని భావము. ఇచ్చట ద్రౌపదికి వాల్చూపు వర్ణింపబడక ముందుదృష్టి వర్ణింపబడినది. సైరంధ్రిగా బ్రవేశించిన ద్రౌపదియొక్క వినయవైభవమంతయు నిందు వ్యక్తమగుచున్నది. ఆమెయొక్క అపూర్వలావణ్యముచే విరటునిల్లు వింతకాంతి గల్గి శోభించినది. ఇట్టి సౌందర్యరాశిని సుదేష్ణ ఉచితస్థలముననే చూచినది.

క. ముద మొదవ రమ్యహర్మ్యము
తుదినిలుపున బ్రణయసఖులతోడ విహారా

స్పదనుగు నెలవున మెలగెడు
సుదేష్ణ తజ్జాలకముల జూచెం బ్రీతిన్. ౩౦౧

అసలు సుదేష్ణ ఆదినమున ముదమొప్పియున్నది. హర్మ్యము లోని రమ్యస్థలమునకు జనినది. అందున తుదినిలువున (ఆఖరు అంతస్థున) నిలిచినది. ప్రణయసఖులతోడగూడి విహారాస్పదమగు నన్నెలవున నిలిచి సుదేష్ణ ద్రౌపదిని గాంచినది. మఱియు నామెను గొనితెచ్చుట కిరువురు ప్రౌఢాంగనలను బంపినది. వారి వెనుకవచ్చి యల్లనల్లన సుదేష్ణను సైరంధ్రి సమీపించినది

చ. కనుగొని గారవంబును మొగంబున గేల బురఃప్రసారమున్
దనువున నమ్రభావమును దంతమరీచుల సామినిర్గమం
బును దనలో గడల్కొనగ భూరితరాదరరేఖ సిందు ర
మ్మనవుడు నంతనంత ద్రుపదాత్మజసేరి వినీతి నిల్చినన్. ౩౦౨

సుదేష్ణయొక్క ఆశ్చర్యాదరములు ఇందు వర్ణింపబడినవి సుదేష్ణ కాయాయంగములం దాయాభావములు తటాలున గట్టినవి. ఇది ద్రౌపదియొక్క సౌందర్యగరిమను, శీవిని దెల్పుచున్నది. ఇందు రమ్ము అనునది ముద్దుగా నున్నది. సైరంధ్రియు నంతనంత జేరి వినీతి నిల్చినది. ఆపాదమస్తకము తద్రూపము వీక్షించుచు కుతూహలమంది సుదేష్ణ సైరంధ్రిని బ్రశ్నింపగా నామె తనసంగతిని దెల్పినది. తన సంగతిని జెప్పుటలో ధర్మజుడెట్లు పలికినాడో (సార్వభౌము డెట్లు పలికినాడో) పట్టపుదేవి యగు ద్రౌపదియు నదేతీరున జెప్పినది. సుదేష్ణ సైరంధ్రిని దేవతాస్త్రీగా దలంచి పలికినది.

క. సురగరుడ ఖచర విద్యాధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలో నీ
వరయగ నొక్కతవగు దివ్పూరికిం జనుదేర గతము బొంకక చెపుమా.

పౌరులును, సుదేష్ణయుగూడ ద్రౌపదిని గాంచి సంభ్రమాశ్చర్యముల నొందిరి. దేవకాంత యని శంకించిరి. సుదేష్ణ యిట్లు పలుకగా ద్రౌపది యిట్లు పలికినది.

క. అనుటయు దరహాసితము మో
మునకు దోడవుగాగ బలుకు ముద్దియ యే గృ

ష్ణునిదేవి సత్యభామకు
బనిసేఁయుదు దొల్లి పిదప బాంచాలికడన్. ౩౧౫

తే. తగవుమై బరిచారికాధర్మములకు
నెల్ల జాలి వర్తించితి దల్లి వినుము
నాకు బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న
కాగ భావించి యాదేవి గారవించు. ౩౧౬

తన్నుఁ దేవతా స్త్రీగ భావించి పలికిన సుదేష్ణతో ద్రౌపది తాను దాసిగా నిదివఱ కుంటినని పలికినది. "నీవు దేవతాస్త్రీవలె గానబడుచున్నావు. ఈ పురమునకు వచ్చుటకుగల కారణమును బొంకక చెపుమా" అని సుదేష్ణ పలికినది తాను పలుకునది బొంకే కావున ద్రౌపది దరహాసితము మోమునకు దోడవుగా బలికినది. అద్వితీయసౌందర్యము గల్గియున్నయామె పరిచారికగా గనబడలేదు. ద్రౌపదియో వారనుకున్న దానికివిరుద్ధమును 'నిదివఱకు దాసినైయుంటి నని' పలుకనున్నది. అంతేకాదు. అందే తనకు నేర్పులవడియున్నదని పలుకనున్నది. అట్లు పలుకుటయే తనకు సహజ మనునట్లుగా నున్నది. కావుననే ద్రౌపది దరహాసితము మోమునకు దోడవుగాగ బలికినదని యింకొకచమత్కారము. అనగా దేవతాస్త్రీగ దలంచిన సుదేష్ణతో దానొకదాసినని పలుకనున్నది గాన దరహాసితమే తోడవుగాగ బలికినదని సారస్యము. దరహాసితమే మోమునకు దోడవుగాగ గల్గిన ద్రౌపదిని "ముద్దియ" యని తిక్కన యిచ్చట పేర్కొనుట మఱియు సారస్యమైనది సత్యభామయొద్ద, పాంచాలియొద్ద మెలంగితినని చెప్పిన ద్రౌపది (సైరంధ్రి) ద్రౌపది తన్నెక్కుడవగా, నాదరించి గౌరవించినదని పలుకుచు నీవును నన్నట్లే చూడవలయునని సుదేష్ణతో బలికినది.

క. నీచము లయ్యెడు పనులకు
నా చాలమి యెఱిగి మన్ననకు బాత్రముగా
నీచిత్తంబున గైకొని
యాచారము దప్పకుండ నరయుము నన్నున్. ౩౧౭

ఏపనులు తనకు చెప్పవలెనో ఏవిచెప్పరాదో అది సుదేష్ణయే నిర్ణయించుకొనుచు దన్ను గౌరవముగా జూచి ప్రవర్తించుచుండవలెనని

ద్రౌపది సుదేష్ణ కెఱిగించినది. ఇట్లు పలికి తాను దేవజాతి యను సందియము బాపినది. తనకలవడియున్న పనులను జెప్పినది. దేవజాతి యను సందియము పోగానే ఆమె రూపాతిశయమునుగాంచి విరాటు డామె వశమగునేమో యని సుదేష్ణ శంకించినది. ప్రభూతాశ్చర్యమైనది. సుదేష్ణకు గల్గిన యీసంశయము దొలగింపదలంచి ద్రౌపది తనకు బలవంతులగు గంధర్వులైదుగురుపతులు గలరని పలికినది.

క. బంధురతరంబులు శౌర్య మ,దాంధములై శక్తిసంపదాభీలతమై
సింధురసదృశత నున్నను, సంధులసంధులెడలించి చంపుదు రతనిన్.

ఇట్లుగా ద్రౌపదిచేత బలికించి తిక్కన భావి కీచకవధను సూచింప జేసినాడు. ద్రౌపది యింకను నిట్లు పలికినది.

వ. కావున బురుషులు నాకడం దేఱిచూడను వెఱతు రదియునుంగాక.

క. నాచిత్తము దాదృశులకు, గోచరమే యస్మదీయ కులజనసంశీ
లాచార మహిమ యట్టిది, యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్.

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము సన్ను నేలు మే
పనులు సుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే
ర్పును భయభక్తులుం మెఱయ రూపుగ జేసెద దజ్ఞులైన స
జ్జనులు నుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చ జల్పెదన్. ౩౨౭

క. నను గుచ్చితంపు బనులకు, బనుపక యెంగిలికి లోనుపఱుపక తగు మ
న్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి నడతు రస్మత్పతులున్.

ద్రౌపది యిందు తనయొక్క గంభీరమైనహృదయము సుదేష్ణాదుల కవగాహనయే కాదని తెల్పుటయేకాక తనయొక్క కులశీలము లతిగంభీరములని పలికినది. తన్నతిగౌరవముగ జూచినచో దనపతు లనురాగము జూపుదురని పలికినది. ద్రౌపదియు సుదేష్ణయుగూడ నొకరి నొకరు ఊరడిల్ల బలికికొనిరి. ద్రౌపది అజ్ఞాతమహారాజ్ఞి, సుదేష్ణ మహారాణి. కావున ఇరువురును నూరడిల్లబలికికొనుట చమత్కారముగ నున్నది. సుదేష్ణ ఊరడిల్లబలికి ద్రౌపది నిట్లు తలచికొనినది. పాండవు లిట్లుగా విరాటపురమును బ్రవేశించి ప్రమదమున నచట వసించిరి.

# తిక్కన విరాటపర్వము

## కీచకవధ

'పాండవులు పాంచాలీ సహితంబుగా విరాటనగరంబున వర్తించుచు గతిపయదినములు గొంతగా నేడు కాలంబు గడపినసమయమున గీచకుడు ద్రౌపదిని గాంచినాడు' అని తిక్కన రచించెను. కీచకోపకీచకుల మరణానంతరము ద్రౌపది యింక పదుమూడుదినములు మాత్రము విరాటనగరమున నుండెదనని సుదేష్ణతో బలికినది గాన దదనుగుణముగా నుండుటకై పదియేనుదినములు వ్యవధి గల్గిన కాలములో గీచకుడు ద్రౌపదిని గాంచినాడు అని తిక్కన రచించినాడు. సుదేష్ణకు మ్రొక్కంజని యామె కనతి దూరముననున్న ద్రౌపదిని గీచకుడు గాంచినాడు. 'అప్పకు మ్రొక్కంజనువాడు' అని వ్రాసి అంతవఱకు గీచకుడు పురమందు లేడు లేక అంతిపురమునకు రాలేదు అని వ్యక్తముచేసినాడు. మఱియు నప్పకు మ్రొక్కుట యను సదుద్దేశమున గీచకుడు వచ్చుచుండినను నది కారణముగ వానికి మరణము తటస్థించినదని నిరూపించినాడు. కీచకుడు బహుదుర్మార్గుడు గాన వానికట్టి పర్యవసానము గల్గినదని సారస్యము.

ఉ. అక్కజమైన చెల్వమున నాత్మకు వ్రేగయి పొల్చు పొల్తిపై
నెక్కొను చూడ్కి గ్రమ్మఱుపనేరక యూరక నిల్చె గాముచే
జిక్కిన నెమ్మనంబు గడు జేడ్పడు మానము జేష్టితంబులం
దక్కిన యంగముం దలకు ధైర్యమునై యత డప్పు డయ్యెడన్.

విరాటనగరము ప్రవేశించునపుడు విరాటునకును, పరివారమునకును ధర్మజ భీములు చూడ్కికి వ్రేగయి తోచిరి. అని తిక్కన రచించియున్నాడు. ఇప్పుడు ద్రౌపదిని జూచిన కీచకునకు ఆత్మ వ్రేగయినది అని రచించినాడు. అట్టిరూపమును గీచకు డెప్పుడును జూచియుండలేదు. మనోహారిణియై యున్న ఆమెయందు దగుల్కొనిన చూడ్కిని మఱి

త్రిప్పలేక ఆలాగున నిలబడిపోయినాడు. "పాల్రిపై నెక్కొనుచూడ్కి గ్రమ్మఱుపనేరక యారకనిల్చె" అను దానిలో ద్రౌపదియొక్క అపూర్వసౌందర్యము వ్యక్తమగుచున్నది. కీచకుడు ఆశ్చర్యచకితుడైనాడు. ద్రౌపదీ రూపమును నురిలో దగుల్కొనినాడు.

ఉ. ఎందును నిట్టిరూపు సరు లెవ్వరు గాంచిరె నాకకాదు సం
 క్రందన సూతికిం దగిలి కన్గొన జాలదె చీన నిందిరా
 నందను నాజ్ఞయేచి భువనంబుల బ్రబ్బదె యి త్తలోదరిం
 జెందగ గాన్పుగాదె ఫలసిద్ధి పురాతనపుణ్యబుద్ధికిన్. ౨౬

నేనెకాదు. ఇంకేనరున్నైన నిట్టిరూపు చూచినారా అని కీచకుడు తలంచలేదు. తనవంటి విలాసపురుషుడు భువిలోన లేడని తలంచువాడుగాన కీచకు డిట్లుగా దలంచలేదు. తానేకాదు. మూడులోకముల కధినాథుడగు దేవేంద్రుని కుమారుడైనను ఈ రూపమును జూడవలసినదే అని కీచకుడు తలంచినాడని సారస్యము. జయంతుడు త్రిలోకసామ్రాజ్యమునకు యువరాజుమాత్రమే కాక దేవతలందఱిలోన మిగుల నందగాడను బ్రసిద్ధి గూడ గలడు. మత్స్యరాజ్యమునకు బరోక్షప్రభువుగానున్న కీచకునకిది తగిన (అనురూపమగు) తలంపై యున్నది. దేవేంద్రుని గాక జయంతుని స్మరింపజేయుట మఱియు సారస్యమైనది. ఇది యౌవన సూచకమైనది. "దీనిమూలమున మన్మథుని యాజ్ఞ లోకమందు నిరాఘాటముగ సాగగలదు. దీనిబొందుట పూర్వపుణ్యఫలము" అని కీచకుడు తలంచినాడు. "ఏచి, ప్రబ్బదె" అను పదములు మిగుల రసవంతమైనవి. కీచకు డిటుపై నొకమెట్టు నెక్కి యిట్లు తలంచినాడు.

సీ. ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుడు పార్వ
 తీశునైనను దక్క నేలకున్నె
 యిన్నాతి చెలువంబు గన్న శచీప్రియుం
 డైనను గనుకలి నవయకున్నె
 యి త్తన్వి కెనలేమి కెదిరి పన్నిదము బా
 షావిభుతోనైన జఱపరాదె
 యి త్తలోదరి జీవితేశున కింద్రా
 పతి నైన మెచ్చక పలుకజనదె

గీ. కుసుమ బాణుని బాణముల్ గూడ నైదు
కరగి నేరిమి వాటించి కరువుగట్టి
పోసి చేసి చైతన్యసంపుటము దగ ఘ
టించెనో కాక యిట్టి చేడియలు గలరె. ౨౭

దీని నాధారముగా జేసుకొని మన్మథుడు లోకములను సాధించ డమే కాదు. తనకన్న ప్రబలశత్రువగు నీశ్వరునైనను సామంతునిగ జేసికొనగలడు. వేయికన్నులు గల దేవేంద్రుడైనను నీమెను జూడ జాలడు. "కనుకలి నవయకున్నె" అనునది మిగుల సారస్యమైనది. దీనికి సాటిలేదని బ్రహ్మతోనైన నెసిరి పందె మొడ్డవలసినదే. "భాషావిభుడ" ను పద మిచ్చుట మిగుల సారస్యమైనది. మాటల కధినాథుడుగూడ ఓడి తీరవలసినదే అని సారస్యము. దీనివల్లభుఁ డిందిరా పతియైన సాటి రాడు అని కీచకుడు తలంచినాడు. ఇట్లు తలంచుటలో నతిశయోక్తి లేదని వాని యభిప్రాయము. 'జీవితేశుడు' అనుపదము అనుపమాన ముగా నున్నది. ఆలోకైకసుందరి ఆతలోదరి జీవితమునకే అతి డీశుడు. వాని అదృష్టమే అదృష్టము. దానికి సాటి మఱి కాదు అని కీచకుని భావము. ఇందు త్రిమూర్తులను, త్రిలోకనాథుని తిక్కన పేర్కొనినాడు. అదియు వారిపేళ్లుగాక "పార్వతీశుడు, శచీప్రియుడు, భాషావిభుడు, ఇందిరాపతి" అని పేర్కొనినాడు. ఇట్లు రచించుటలో సారస్యము గలదు. పార్వత్యాదులకంటె సైరంధ్రి గొప్పదని యొకభావము. పార్వ త్యాదులున్నను గూడ వారిపతు లీమె రూపమును మెచ్చుకొనవలసినదే అని యొకభావము. "ఈశుడు, ప్రియుడు, విభుడు, పతి" అను పదములను గూడ సాభిప్రాయముగ కవి ప్రయోగించి యున్నాడు. ఇంతవఱకు దేవతాప్రముఖుల విషయము పడవి గీతపద్య భాగమందు మన్మథుని ఆయుధములనే నేర్పున జతచేసి చైతన్య మిచ్చునట్లుగా సైరంధ్రి యున్నదని కీచకుడు పలికికొనినాడు. ఇంతియకాదు తదధినాథుడగు మన్మథుడుగూడ నీ రూపమును జూచి విరహతాప మొందవలసినదే అని తలంచినాడు.

సీ. దీని జన్మంబున దేజంబు నొందిన, యింతియు జితియును నెవ్వరొక్కొ
దీని నాసాకృతిగా నోచి పడసిన, యింపగు వర్ణంబు లెవ్వి యొక్కొ

దీని వల్లభు డనగా నిల సొబగు సొం, పెసగ వర్తిల్లువా డెవ్వడొక్కొ
దీని వసించుట దా నొప్పి పెంపున, నేపాయ మందిరం బెద్ది యొక్కొ

ఆ. దీని బొంద గాంచు తెఱగు తా కెయ్యది
యొక్కొ యిట్టిపనికి నూఱడిల్లి
తోడుకొనగ నిచట నీడగు చుట్టంబు
దడవి యెట్టులొక్కొ పడయువాడ. ౩౦

ఇందు మొదటి రెండు పాదములలోను పుట్టినింటి సంబంధము, మూడు నాలుగు పాదములలో నత్తవారింటి సంబంధము చెప్పబడినది. ఇందలి పదములు క్రమక్రమముగా చవులూరించుచున్నవి. తలిదండ్రులని కాక 'ఇంతియు బతియు' అని కీచకుడు తలంచినాడు. ఇది యౌవనగరిమను వ్యక్తీకరించుచు కీచకుని హృదయమును వ్యక్తీకరించుచున్నది. 'వల్లభుడు' అనుపదము దసవంతము గానున్నది. ఆపదముతో జేరి 'అనగా' అనుదీర్ఘాంతమగుపదము ఉచ్చారణీయం బెంతయేని భావనను బుట్టించుచున్నది. వానివిహారము ఇలయందంతటను. అందెంతయేని సొబగుసొంపుగలదని భావము. ఇక్కడకు సీసపద్య భాగము పూర్తియైనది. కానిపద్యము పూర్తి కాలేదు. ఇచ్చట తిక్కన ఆటవెలదిని గూర్చినాడు. అది మొదలు సైరంధ్రి తనకు గృహస్థాసము గావలెనని కీచకు డాశించినాడని చమత్కారము. "చుట్టం[redacted] అను పద మునుయోగించి తిక్కన యీయభిప్రాయమును (ఈనూతనసంబంధమును) వేల్కొనినాడు. ఈపద్యముతో గీచకుని ఆలోచనముయొక్క పరమావధిని వ్యక్తముచేసినాడు. సైరంధ్రి అది మొదలు ఆమరణాంతము తన్ను బొందియుండవలెనని కీచకు డభిలషించినాడని తిక్కన యిందు బరద్యవసానము దేల్చినాడు.

చ. అని అని యుగ్గడించు ధృతి యల్లల నాడిన దల్లడించు బై
కొను తలపోత నించు మది గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు సచటల్ జనులం బరికించు బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుడై. ౩౧

కీచకుడు మిగుల సొద నొందుచున్నాడు. ధైర్యము లేనివాడై తల్లడించినాడు. తలంపులు ముంచుకొని వచ్చుచున్నవి. కోరికలు. మెం

ఁయినవి. సహింపజాలక సైరంధ్రిని బట్టి దమకించినాడు. తన యీ
మాలోచనము కార్యరూపముగ బెట్టుసరికి వానికి బాహ్యజ్ఞానము గల్గి
ది. జనులుండుటను బరికించినాడు. దానితో వానికి మతిపోయినది.
ంగుల కళవళించినాడు. సైరంధ్రి తన్ను వలచినదీ లేనిదీ వాని కింత
ఱకు స్పష్టము కాలేదు. అందువలన మనోజవికారమగ్నుడైనాడు.
'అని అని తెగన్'' అను పదము లిందు సారస్యమైనవి. అప్పుడు ద్రౌపది
యెట్లున్నదియు తిక్కన యిట్లు రచించినాడు.

సీ. వెఱవక నను జూచె వీడని యెద గలు
ఁషించిన నొండొండ చెమట వొడమ
ననుచితకృత్యంబు లాచరించు విధాతృ
బలిమికి నెవ్వారలపాటు దోప
నిచ్చుటు దిక్కు లే రెవ్వరు నా కను
భయమున మేన గంపంబు పుట్టి
జేయంగ నేమి యుపాయంబు లేమి నా
ననమున వెల్లదనంబు గదుర
గీ. నున్న పాంచాలి గనుగొని యన్నరాధ
ముడు వివేకవిహీనుడై ముదితు డగుచు
మదనవికృతియకా దనమది దలంచి
రాగసాగరపూర నిర్మగ్నుడయ్యె. 33

కీచకుడు చూచుచున్నందున ద్రౌపదిపరిస్థితి యెట్లున్నదియు నీ
పద్యమున తిక్కన వ్యక్త మొనరించియున్నాడు. ద్రౌపదియొక్కయు,
కీచకునియొక్కయు మనస్సులు, చేష్ట లెట్లున్నవియు, నాచేష్టలు ఒక
రిపై నొకరి కెట్టి మార్పులను కల్గించుచున్నవియు దిక్కన ఈ
పద్యమున, ముందుపద్యమున వ్యక్త మొనరించి యున్నాడు. "నీ
రూపము సూచి మానృపతియువ్విళ్లూరు" నని సుదేష్ణ శంకించి
పలుకగా ద్రౌపది "నాపతులు గంధర్వులు నన్ను సదా సంరక్షించు
చుందురు కావున బురుషులు నాకడం బేఱిచూడను వెఱతురు" అని
పలికినది. అట్లుగనే ఇంతవఱకు నెవరును సైరంధ్రిని కన్నెత్తి చూడలే
దని యీపద్యమున వ్యక్తము చేయబడినది. అట్టి స్థితిలో గీచకుడు

వెలువకుండ నంతసేపు ద్రౌపదివైపు అదే చూచుచున్నాడు. అక్కడనే నిలబడియున్నాడు. (చూడ్కి క్రమ్మఱ నేరక యూరక నిల్చినాడు. ౨౩) అందుచేత నామెమనసు కలత నొందినది. చెమటపట్టినది. పదునొకండు నెలల పదియేను దినములు గడవబెట్టిన విధి మిగిలిన పదియేనుదినములు చల్లగ గడప నీయకూడదా. అట్లుగాక యీయిబ్బందిని దెచ్చిపెట్టినది. అందువలన నామె నెవ్వెఱపాటునొందినది. తనపతులు తన్ను సదా సంరక్షించుచుందురని పలికి ద్రౌపది సుదేష్ణాదులను బెదరించి యున్నది. కాని కీచకుడు అప్పుడే తమకించిన నంతయు వ్యర్థమగునుగదా. అందువలన నామెకు మేన గంపము పుట్టినది. పాండవులప్పుడే చేయిచేసుకొన వలసివచ్చిన అజ్ఞాతవాసదీక్షకు భంగముకలుగును. నేర్పుమై తప్పికొనుట కుపాయ మేదియు గనబడలేదు. అందువలన నామె కాననమున వెల్లదనము వచ్చినది. స్వేదము మొదలైన లక్షణము లామెయందు గాంచి కీచకుడు తన్నుచూచి యామె మదనవికృతినొందుచున్నటుల దలంచినాడు. నరాధముడు, వివేకవిహీనుడు గాన గీచకు డిట్లు దలంచి ముదితు డైనాడు. తాను వాంఛించిన యువతి తన్ను వాంఛించుట వ్యక్తపడినది. అందువలన మనోజవికారమగ్నుడై యున్న కీచకు డిప్పుడు రాగసాగరపూరనిర్మగ్ను డైనాడు.

కీచకునింటికి వెడలవలసివచ్చినపుడు ద్రౌపదిస్థితి యెట్లున్నదయు దిక్కన యిట్లు వర్ణించినాడు.

సీ. దైన్యంబు తలపోత దలకొన్న జెలువ కా
ననమున వెల్లదనంబు గదిరె
భయరసవేగంబు పైకొని ముట్టిన
గాంతకు దనులత గంపమడరె
బెగ డంత కంతకు మిగిలిన నింతికి
బదముల నట దొట్రుపాటు బెరసె
దల్లడం బొందిన దన్వికి నవయవం
బులనెల్ల ఘర్మాంబుకళిక లెసగె
ఆ. దలకు పుట్టె గొంకు గొలదికి మీఱె వె
న్నాటు దోచె ముట్టుపాటు దొడరె

వెఱగుపాటు దనికె నెఱి నాడె నొవ్వ నె
వ్వగలు వగల నీనె దిగులు వొదివె. ౨-౧౦౬

పై రెండు సీసపద్యములలోను తిక్కన యొక్క చమత్కారమును వ్యక్తము చేసినాడు. మొదటిపద్యములోని నాల్గవపాద మిందు మొదటి పాదమై యొప్పియున్నది. అట్లే 3 పా. ౨ పాదముగాను, ౨ పా. మూడవపాదముగాను, ౧ పా. ౪ పాదముగాను యొప్పియున్నవి. పలు వురు మసలుచున్నచోట కీచకుడు చూచుట తటస్థించినది గాన ద్రౌపదికి అచ్చోట క్రమముగా భయము సడలినది అని మొదటి పద్యములో నిరూపింపబడినది. ఇప్పుడు కీచకు నింటికి పోవకతప్పదు గాన క్రమముగా భయము హెచ్చుచున్నదని రెండవపద్యమున నిరూపింపబడినది. ఈవిష యమునే పాదములయొక్క వ్యుత్క్రమముచేత తిక్కన చక్కగ వ్యక్త ము చేసినాడు. కీచకుడు గాంచినపుడు ద్రౌపదికి చేయంగ నేమి యుపా యము లేక ఆననమున వెల్లదనము గదిరినది. అట్లే కీచకునింటికి బోవు నపుడు దైన్యంబు తలపోతచే నాననమున వెల్లదనము గదిరినది. దిక్కు లేదని మేన గంపము పుట్టిన ద్రౌపది కిపుడు పోకతప్పదే యని భయరస వేగము పైకొని తనులత కంపమొందినది. అనుచితకృత్యంబు లాచరించు విధాత్రుబలిమికి విహ్వలత నొందిన ద్రౌపది యిప్పుడు బెగ డంత కంతకు హెచ్చి (విహ్వలయై) తొట్రుపాటు నొందుచున్నది. ఇందు విహ్వలత్వ మొందుట యనునది సమానధర్మము. ఎదకలుషించిన నొండొండ చెమట వొడమిన ద్రౌపదికిపుడు తల్లడమొందిన ఘర్మాంబుకళిక లెసగినవి. ఘర్మాంబు కళికలగుటచేత ఒండొండ చెమట వొడముటకంటె భావయుక్తమై భయాధిక్యము వ్యక్తమగుచున్నది. ఈ రెండవపద్యమున ఒకపాద ముకంటె నొకపాదమున భయము హెచ్చుచున్నటుల సూచింపబడినది. ఆటవెలది భాగములో నెనిమిది అవస్థలు చెప్పబడినవి. అంతకంతకు భయము హెచ్చి పోయినదని దానిభావము. కావుననే సీసపద్యములో నాలుగవస్థలు ఆటవెలదిలో నెనిమిదవస్థలు చెప్పబడినవి.

దృష్టిసారించి కీచకుడు ద్రౌపదిని జూచుచున్నాడు. తక్కుంగల యింద్రియవర్గము పనిచేయుటకు వీలులేదు. సర్వేంద్రియప్రధానమైన నయనములుమాత్రము నిశ్చలతగడంగి పొలతుక కాంతిని గ్రోలుచున్నవి.

(3౫) ఇంతవఱకు గీచకు డచ్చటనే నిలబడి చూచుచున్నాడు. మఱియు వెఱ్ఱిలో బడిపోవుచున్నాడని లిక్కన వ్యక్తపఱచినాడు.

క. అప్పయు బరిజనములు దను
దప్పక కనుగొనుచు నుండ దగవేది కరం
బొప్పని తమకము చిత్తము
గప్పికొనుట నుత్తలంబు గదురుగ నచ్చోన్. 3౬

ఇంతకుముందు పరిజనులనుజూచి జంకిన కీచకుడు అప్పయు బరిజనము దన్ను జూచుచుండినను దమకించియున్నాడు. ఆ దృష్టితో గీచకుడు ద్రౌపది నిప్పుడు కనుగొనుచున్నాడు.

సీ. తన్వంగి మవ్వంపు దనులత నెసగెడు
నునుగాంతి వెల్లువ మునుగబాఱ
గిసలయహస్త కెంగేల నేపారు క్రొ
మ్మించను లేయెండ మిగుల బర్వ
గమలాస్య ముద్దుమొగంబు లేమెఱుగుల
మొత్తంబుపరి చుట్టు ముట్టికొనగ
ధవళాక్షి తొంగలి తఱచు ఱెప్పల చెన్ను
కప్పను చీకటి గవియు చేర

గీ. బెగ్గలం బంత కంతకు నగ్గలింప
నొదవు చెమటతో జిత్తంబు సెదరి యొందు
మెలగ దలవేది యూసింహబలు డనంగు
పట్టియాడెడు జంత్రంబు పగిదినుండె. 3౭

గంభీరమైనభావము. అందుకు దగిన చక్కని పదప్రయోగ మిందుత్కృష్టముగా నున్నవి. గొప్ప వర్షా(మేఘా) డంబర మిందు వర్ణింపబడినది. నునుగాంతి వెల్లువ ముంచుకొనివచ్చినది. క్రొమ్మించు (మెఱుపు) గలుగుచున్నది. మెఱుపుమెఱసినపుడు మెఱుగులు కలుగుచున్నవి. అది గానపుడు గాఢాంధకార మల్లుకొనుచున్నది. "నునుగాంతి, లేయెండ, లేమెఱుగులమొత్తము, చీకటి" ఈపదములు సాభిప్రాయములు. నునుగాంతినుండి చీకటివఱకు నిందు చేర్కొనబడినవి. కీచకుడట్లు క్రమక్రమముగా ననంగ పరతంత్రు డగుచున్నాడని వ్యక్తముచేయబడినది. ప్రవా

హాము ముంచుకొని వచ్చినందున భయముగల్గినది. ఎండవచ్చినందున చెమట గల్గినది. సేన ముట్టికొనినందున చిత్తము సెదరినది. అంధకారబంధుర మైనందున నెచ్చట నిలుచుటకును వశముగాకున్నది. ఇట్లు వర్షాతపములచే మిగుల బాధనొందిన కీచకు డింక నిలువజాలక సుదేష్ణను జేర దలచినాడు. ఇందు "తనులత, కెంగేలు, ముద్దుమొగము, తొంగలి తెప్పలు" అనునవి పేర్కొనబడినవి. బాహిర అంగము లిందు పేర్కొనబడినవి. ఇంతవఱకు ద్రౌపదియొక్క అక్కజమైన చెల్వమున నాకర్షింపబడిన కీచకు డిప్పు డామె అవయవములను దిలకించుచు ముగ్ధు డగుచున్నాడని భావము. ఇచ్చటకూడ నా అవయవములనుండి ప్రసరించుచున్న "కాంతి" మొదలగునవియే వర్ణింపబడుట సారస్యమైన విషయము. అకోమలికలరూపు దెలియదలంచి దానిదెసందగిలిన దృష్టి యొట్టకేలకు దిగిచికొని చని కీచకు డప్పుడు బ్రణమిల్లినాడు. అప్పుడు మ్రొక్కవచ్చిన గీచకు డెట్టకేలకు బ్రణమిల్లినాడు. చిత్తమంతయు సైరంధ్రిపై హత్తికొనినది. కాయమున మాత్రము అప్పుడు బ్రణమిల్లినాడు. అసన్మార్గుని వ్యాపార మిట్లే యుండునని సూచింపబడినది. సుదేష్ణ కాంచనపీఠము వేయించినది. ప్రియముచూడ్కి మునుగు వడ సంభావించినది. కీచకు డప్పుడు పాంచాలిం జూపి వేగపడి ప్రశ్నించినాడు. అప్పయొద్దకు వచ్చుట ప్రణమిల్లుటకుగాక పాంచాలి నెఱుంగుటకు వచ్చినాడను పర్యవసానము తేలినది.

ఉ. ఇయ్యరవిందగంధి కుల మేమి చరిత్రముచంద మెట్లు పే
రెయ్యది నాథు డెవ్వ డిది యెచ్చట నెప్పుడు నుండు నిప్డు దా
నియ్యెడ కేగుదేవలయు టేపనిసేయగ బూని దీనిపై
నెయ్యము కల్మి యేకొలది నీమది కింతయు నాకు జెప్పుమా. ౪౦

ఇన్నివిధములగు ప్రశ్నలు చేసినను దనయభిలాషనుమాత్రము కీచకు డిందు వ్యక్తముచేయలేదు. అప్పటి కింకను గీచకుడు మర్యాద మీఱి యుండలేదని భావము. గీచకు డనంగశరదళితహృదయు డగుటను సుదేష్ణ విచారించినది. వాని చిత్తవృత్తి మరల్పజూచినది. కీచకుని మాటలు గీటునంబుచ్చి యొండుపలుకులు జరిపినది. కీచకుడు సత్వహీనుడు గాన, సత్వరుండై క్రమ్మఱి ద్రౌపదియున్నయెడకు వచ్చినాడు. ఆ సమీ

పమున నక్తాడుచు నమ్మానవతితో ని ట్లనినాడు. "మానవతి" అను పద మిచ్చుట సాభిప్రాయ మైనది.

క. ఇవ్వసుమతి నేపాలతుల, కివ్విధమున జెలువు గలదె యెన్నండును నీ వెవ్వరితనయవు నీపతి, యెవ్వడు వేరేమి సెప్పు మిందునిభాస్యా. ౮౩

కుశలప్రశ్నకంటె ముందుగా గీచకు డామె చెలువమును బ్రశం సించి పలికినాడు. అదిచూచి ద్రౌపది వినియు విననట్లుగా నిర్వికారయై యూరకున్నది. సమాధాన మేమియు నీయలేదు. రాజబావమఱది మాటాడించినను మఱుమాట పలుకుట అనవసర మనునట్లుగా నున్నది. ధీరగావున నిర్వికారయై యున్నది. అప్పుడు కీచకుడు మఱియు నిట్లు పలికినాడు. ఇచ్చట కీచకుని గూర్చి "చలుడు" అనుపద ముపయోగింప బడినది. అది సాభిప్రాయమైనపదము.

సీ. తెలిగన్నుగవకాంతి పొలుపార నించుక
గనువిచ్చి చూచిన గాదెయబల
చెలువంపు నెమ్మోము నెలమి సొం పినుమడి
గా నల్లనవ్విన గాదె యింతి
దంతమౌక్తికరుచి దలకొన మఱుమాట
వలికిన గాదె యుత్పలదళాక్షి
యుల్లంబు సరసత దెల్లంబుగా లీల
నై కొన్నగాదె పంకరుహవదన

ఆ. యనుచు జూచు జేరు నమ్ముగ్ధపలుకులు
వినగగోరు గేలు దనదుకేల
గీలుకొలుపదలచు గీచకాధముడు ని
జానురక్తి దెలుప నప్పళించు. ౮౪

సైరంధ్రి చూచునేమోయని కీచకుడు చూచుచున్నాడు. నవ్వు నేమోయని సమీపించుచున్నాడు. మఱుమాట పలుకునేమోయని విన దలచినాడు. సరసత్వము వెల్లడించునేమోయని చేయి పట్టుకొన దలచి నాడు. కాని సైరంధ్రి అందు కనుగుణముగా లేదు. అయ్యింగన యింగిత మూహింప వెరవమాలి యిటు పలికినాడు.

సీ. సుదతి నీమై చక్కఁ జూచుట కోడెద
గనుబాటు వారయనో యని తలంచి
మది బొనర్చినమాట మగువ నీపెంపున
గుదిసి నానాలుక తుదికి రాదు
పడతి నీకరములు పట్టంగ దివిరి శం
కించి వడంకెడు గేలు సూడు
నెఱి నిట్టి దని యింతి నీ నెమ్మనం బెన్ని
భంగుల నరసిన బట్టువడదు

గీ. చెలువ యింక నొక్కించుక సేపు నీవ
నాదరంబున నెప్పటి యట్ల యున్న
మన్మథుడు సమయించిన మగుడ నన్ను
బడయవచ్చునె యెన్ని యుపాయములను. ౮౭

పై రెండు సీసపద్యములలోను జెప్పిన విషయ మించుమించుగా నంతయు నొక్కటే గైయున్నది. మొదటిపద్యము ప్రార్థనారూపముగా నున్నది. సైరంధ్రిని ప్రార్థించిన గీచకు డెట్టి అవస్థ నొందు చుండినది రెండవపద్యము వ్యక్తము చేయుచున్నది. "కనువిచ్చి చూడరాదా" అని మొదటిపద్యములోను "కనుబాటు వారయునని చూడలేకు న్నాను" అని రెండవపద్యములోను గలదు. "చెలువంపు నెమ్మోము నెలమి సొంపినుమడిగా నవ్వరాదా" అని మొదటిపద్యములో గలదు. కీచకుడు నవ్వుచునే యీమాటలన్నియు బలుకుచున్నాడు గాన రెండవ పద్యమున చిఱునగవుమాట యెత్తుకొన బడలేదని సారస్యము. దంత కాంతి విలసిల్లగా మఱుమాట పలుకరాదా అని ఎదురు వినగోరుచుం డిన కీచకుడు మదిలోని మాట పైకిరాకుండ నున్నదని రెండవపద్య మున వెల్లడించినాడు. ఉల్లము సరసత్వము దెల్లమగునటుల గైకొన రాదా అని కేలుపట్ట నుంకించినవాడు కరములు వడకుచున్నవని పలికి నాడు. నిజానురక్తి దెలుప నవ్వళించు కీచకుడు ఆలసించిన మన్మథుడు సమయించునని పలికినాడు. కీచకు డిట్లుగా దనయభిలాష తేటపడ బలికి నాడు. మొదటిపద్యములో సైరంధ్రియొక్క ముఖలక్షణములే ఎత్తు

ములోను గీచకుని ఇంద్రియవ్యాపారమంతయు జెప్ప బడినది. "పొలుపార, సొంపినుమడిగా, తలకొన, తెల్లంబుగా, కనుబాటువారయునో, కుదిసి, శంకించి, అరసిన" అనుపదము లాయాభావములను చక్కగ బోధించుచున్నవి. ఈ రెండు సీసపద్యములలోగల ప్రార్థనమంతయు గ్రుచ్చి యెత్తి చెప్పినట్లుగా సైరంధ్రి యింటికి వచ్చినపుడు గీచకునినోట కవి యిట్లు పలికించినాడు.

సీ. కాంతి దళ్కొత్తు నీకడిగంటిచూపుల తో
బొంద గానని మేను పొగులుటయును
దీపారు నీపల్కు తెల్లంబుగా విన
గానని వీనులు గందుటయును
నింపగు నీచెయ్వు లెలమిమై గొనియాడ
గానని కోర్కులు గలగుటయును
సొగయించు నీకేళి దగిలి యానందంబు
బొందగానని మది గుందుటయును

గీ. బాయ నాదగు జన్మంబు ఫలము నొంద
భావజన్ముని పూనిక పారమెద్ద
నన్ను బంటుగా నేలుము నలినవదన
యింక నీ సిగ్గుదెరయోల మేల నీకు. ౧౧౮

ఇందు "మేనుపొగులుట, వీనులుకందుట, కోర్కులు కలగుట, మది కుందుట" క్రమముగా బాహిరమునుండి అంతరంగమువఱకు జెప్పబడినవి. నిజానురక్తి దెలుప నప్పళించుకీచకుడు ఆలసించిన మన్మథుడు సమయించునని పలికియున్నాడు. ఇప్పుడు భావజన్ముని పూనిక పారమెద్దు బంటుగా నేలుమని పలికినాడు. ఇదివఱకు చూచుట, పలుకుట మొదలగునవి సైరంధ్రినుండి యాశించి తన కవి మందగించియున్నవని పలికినాడు గాన నిపుడు తనివితీరచూచెదను, పలికెదను అని ఇత్యాదిగా గీచకుడు పలికి సిగ్గుపడవలదని కోరినాడని సారస్యము. మొత్తముపైని ఈ మూడు పద్యములు గీచకుని వ్యాపారమునే వ్యక్తము చేయుచున్నవి.

కీచకుడు తనయభిలాష తేటపడబలుకగా ద్రౌపది కలుషించియు

దుర్వారంబైన పరిభవవికారంబు దోపకుండ దన్నుదాన యుపశమించు కొని యిట్లు పలికినది.

క. నాయున్నబాము దలపవ, యీయెడ లీచీర యిట్టి యేవపు జందం
బో యన్న మదనవికృతిం, జేయు ననుట యెంతయును నిషిద్ధముగాదే.

"అన్న" యని ద్రౌపది యిందు గీచకుని సంబోధించినది. అన్న వంటివాడవుగాన నీవిట్లనరాదని భావము. "అన్న" అను పదమిచ్చట పూజ్యవాచకము. రాజవంశమువాడవు దానీయందు మనముంచుట నిషిద్ధము అని పలికినదని భావము. సజ్జనుడగువాడు, ఆడుబుట్టువులతోడ బుట్టినవాడు ఇట్టిమాట పలుకనే పలుకరాదని తెల్పినది. సుదేష్ణయింట నిది జరుగుచున్నది గాన ద్రౌపది యిట్లు పలికినదని భావము. మఱియు హీనవంశాభిజాతయు, పతివ్రతయు నగు యువతి నిట్లుగా నడుగ నేరాదని తెల్పినది. అందుకు గీచకుడు మదనోన్మాదంబున దన్ను నెదిరి నెఱుగక యిట్లు పలికినాడు. ఇచ్చట కీచకునిగూర్చి "మనుజాధముడు" అను పద ముపయోగింపబడుట సార్థకమైనది.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తదనము దెచ్చి
యచ్చున బెట్టిన ట్లుంద మొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలుసేసిన ట్లొప్పు మెఱసి
చందురు నునుగాంతి కందేర్చి కూర్చి బా
గునకు దెచ్చినయట్లు గోమరుమిగిలి
యళికులంబులకప్పు గలయంతయును దెచ్చి
నారు వోసినభంగి నవకమెక్కి
గీ. యంఘ్రితలములు గుచములు నాననంబు
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యీత్రిప్పు లేటికి గమలవదన. ౫౭

ఇందు నెత్తమ్మిరేకులు మొదలగువానితో ద్రౌపదియంగములు సరిపోల్చబడలేదు. వాటియొక్క మెత్తదనము మొదలగునవి చేర్చి కూర్చినట్లున్నవని వర్ణింపబడినవి. మఱియు నిందు సైరంధ్రిని ప్రత్యక్ష

ముగా వర్ణించినట్లుగాక పరోక్షముగా వర్ణించినట్లున్నది. "ఇట్లున్న రుచిరమూర్తి యనుపమానభోగములకు నాస్పదంబు కాదె" అని పలుకుట సారస్యమైనది. అట్టి స్త్రీ తోబుట్టువైనను, హీనవంశాభిజాతయైనను, పతివ్రతయైనను నపేక్షించితీరవలసినదే యని యభిప్రాయము. ఒడలు, చీర యెట్లున్నను నవయవస్ఫూర్తి గల్గియున్న రుచిరమూర్తి అనుపమానభోగములకు నాస్పదము కాదె అని కీచకుడు పలికినాడని భావము. అనగా "నీవు భోగమునకే తగుదవుకాని యిట్లుండతగవు" అని పలికినాడని భావము. కావుననే "ఈ త్రిప్పులేటికి కమలవదన" అని పలికినాడని సారస్యము. ఇచ్చట అంగనావర్ణనలో కుచములుగూడ పేర్కొనబడుటచే గీచకు డింకను వధము డగుచున్నాడని సూచింపబడినది. "నీవు దుర్జాతిగామికి నీవెసాక్షీ, పరసతీసంఘమునవచ్చు పాపమునకు నోరుతునుగాని యీవిరహమును సహింపజాలను" అని కీచకుడు పలికినాడు. దానికి కోపమంది ద్రౌపది నీచుడుగాన కీచకుని జంకింపదలచి యిట్లు పలికినది.

శా. దుర్వారోద్యమబాహువిక్రమ రసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానము బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా.

"అన్న" యని సంబోధనతో బ్రారంభించిన ద్రౌపది యిప్పుడు "కీచకా" అని సంబోధించినది. ద్రౌపది యిట్లు పలుకగా గీచకు డించుకంతయు జంకక యిట్లు పలికినాడు.

గీ. అనుడు నత డిట్టు లనియె నా యతులబాహు
బలము జెనయంగ భవదీయపతుల కారు
మూడులోకంబులందు నెవ్వాడులేమి
నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి. ౫౬

ద్రౌపది పలికినది శార్దూలవృత్తమున దీర్ఘసమాసముగా నున్నందున నది యామెయొక్క రోషమును వ్యక్తీకరించుచున్నది. 'ర' కార పూరితముగా బద్య ముండుటయు, విసురును వ్యక్తీకరించుచు 'ప్రస్ఫురద్గర్వాంధ, మత్పతుల్గీర్వాణ, దోర్లీలన్' అని ప్రయోగింపబడుటయు

గమనింపదగినది. విద్యాపారగుల్, మత్పతుల్, అనుపదములు ద్రౌపది జంకించుటను బూర్తిగా వ్యక్తీకరించుచున్నవి. 'ఇప్డు' అనుపదము కీచకునిమీద దెబ్బపడునట్లుగా ధ్వనించుచున్నది. బాహుబలధీబలసమేతులగు గంధర్వులు మానము ప్రాణము గొనియెదరు అని పలుకుట విచిత్రముగా నున్నది. ఎమ్మెయిన్' అనుపదము రసవంతముగా నున్నది. కీచకుని వచనము తేటగీతలోనుండుటచే వాని బలగర్వము వ్యక్తమగుచున్నది. "అనుడు నత డిట్టు లనియె" అని పద్యము ప్రారంభింపబడినది. సైరంధ్రి అంతగా జంకించినను కొంచమైన జంకక కీచకుడు వెంటనే యిట్లు పలికినాడు అని భావము. ద్రౌపదిమాట దీర్ఘసమాసముతో గూడిన శార్దూలవిక్రీడితముగాను, కీచకునిమాట చిన్నపదములతో గూడిన తేటగీతగాను రచింపబడుట రసవంతముగానున్నది. ఇటుపైని ద్రౌపది సైరణ దక్కి ధిక్కరించి పలికినది. "వివేకవిహీనా" అని సంబోధించినది. కీచకుడు మఱిసహింపజాలక సిగ్గువిడిచిఅక్కయొద్దకు మగుడవచ్చి ద్రౌపదివిషయమై యడిగినాడు. దానికి చింతించి సుదేష్ణ కీచకుని వారింపనెంచి యిట్లుపలికినది.

సీ. లలితంబులగు మట్టియలచప్పుడింపార
  నంచకైవడి నడ నల్లవచ్చి
యొడమేని నెత్తావి సుడియంగ బయ్యెద
  సగము దూలించి పై మగుడ దిగిచి
సోలెడు నెలవీగె లీల గ్రాలుచు వింత
  చెలువంబు దలకొన జేరి నిలిచి
కెలగన్నుగవకు నెచ్చెలియైన లేతన
  వ్వొలయంగ సరసంపుబలుకు పలికి
గీ. మెఱయురాగంపు జెయ్వుల మెయికొనంగ
నెడద సొగయించు మాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తి గొలుచు నన్నెత లుండ
నీరసాకార సైరంధ్రి గోర దగునె. ౬౪

ఈపలుకుల నవాదరమొనరించి "సైరంధ్రి కీడగు సుదతులు నాకలోకమునగూడ లేరు" అని పలికి కీచకుడు మఱియు నప్పంగూర్చి యిట్లు పలికినాడు:

సీ. గండుమీలకుబుట్టి కాముబాణములతో
గలసి యాడెడునట్టి కన్నుగవయు
బిసకాండములశిక్ష బెరిగి లేదీగల
మెచ్చకయున్నట్టి మృదుకరములు
చిగురులతో సంధి సేసి యంబుజముల
పైనెత్తి చనునట్టి పదతలములు
గలకంఠములచేత గఱచిన విద్య వీ
ణల కిచ్చునట్టి తిన్ననియెలుంగు

గీ. నత్తెఱంగున రేఖయు నవ్విధంబు
గరువచందంబు నమ్మెయి కలికితనము
నట్టిచెన్నును సైరంధ్రియంద కాక
కలవె యొరులకు నెఱుగక పలికితబల. ౬౭

అనురక్తి గొలుచుకాంత లలితంబులగు పుట్టియలచప్పు డింపార హంసవలెనే మెల్లగ నడిచివచ్చును. ఎడమేని నెత్తావి సుడియగ పయ్యెద సగముజార్చి మరల సర్దుకొనును. వ్రాలిన లేదీగ చలించునటుల వింత చెలువమొప్పునట్లు దఱిజేరి నిలుచును. తెల్లనికనుదోయి. అందుకు దగినట్లు లేతనవ్వు గల్గినదై సరసమైన పలుకు పలుకును. విలాసచేష్ట లొనర్చుచు మనసుగూర్చు మాటల దనియించుచుండును. ఇట్లుగా నను రక్తి గొల్చుచున్న నెలతలు నీకుండగా నీరసాకారగ్గెన సైరంధ్రిని గోరవచ్చునా అని సుదేష్ణ కీచకుని వారింపజూచినది. ఈ పలుకుల ననా దరమొనర్చుచు కీచకు డిట్లు పలికినాడు. గండుమీలకు బుట్టి కాముబాణ ములలో గలసి యాడెడు నట్టి కన్నుగవ సైరంధ్రికి గలదు. మంచి వంశములోబుట్టి మంచిపిల్లలతో మెలంగిన వీకళ్లని సారస్యము. గండు మీలకు కాముబాణములలో గలసియాడుటయను విశేషములేదు. అట్లే కాముబాణములకట్టి ఉత్కృష్టజన్మములేదు. అందువలన నీమె కళ్లా రెంటినిగూడ మించియున్నవని సారస్యము. బిసకాండముల శిక్ష బెరిగి లేదీగలమెచ్చకయున్నవి ఆమె మృదుకరములు. మంచిగురుకులవాస మబ్బినది. ఇతరశిష్యులగు లేదీగలు స్వతంత్రించి నిలుచునవికావు. (ఈ శిష్యుడు) ఈమె మృదుకరములు అట్లుగాక స్వతంత్రించి

నిలుపగలవు. అనగా పాత క్రమమున లేదీగలను మించి వృద్ధి నొందిన వామృదుకరములని సారస్యము. గురువులైన బిసకాండ ముల శిక్ష చెరిగినవిగాన గురువులను మించిన పాండిత్యము గూడ నలవడినదని చమత్కారము. బాల్యక్రీడలైనపిదప విద్యాభ్యాస మట్లుగా నున్నదని భావము. చిగురులతో సంధిచేసికొని అంబు జములపై నెత్తిచనునట్టి పదతలము లామెకు గలవు. రాజులు ఒక రాజుతో సంధిచేసికొని ఇంకొక రాజును సాధింపబోయెదరు. కడకు వీ రుభయులును ఆ రాజునకు దీపిపోవు వా రగుదురు. అట్లే ఈమె పద ములు చిగురులను, అంబుజములనుగూడ దిరస్కరించుచున్నవని సార స్యము. పై నెత్తిచనునట్టి పదతలములు అనునది సారస్యమైనది. ఆ పదములు ఎత్తిచనునట్టివై యున్నవి. విద్యాబుద్ధు లలవరించుకొనిన పిదప నిట్టి ప్రఖ్యాతి గల్గినదని భావము. కోయిలలయొద్ద నేర్చినవిద్య వీణల కిచ్చునట్టి తిన్నని యెలుం గీమెకు గలదు. బాల్యగురువులగు బిసకాండ ములయొద్ద విద్యగఱచిన పిదప వరిష్ఠగురువులగు కోయిలలయొద్ద విద్య నేర్చి పరిపూర్ణ ప్రజ్ఞగలిగి యిప్పుడు శిష్యుల కది బోధపఱచునంతటిదైన దని సారస్యము. బిసకాండములు బిసములలో నొకభాగ మగుటచే అల్పవిద్యగల గురువు అని అచ్చట నున్న భావము. కోయిలవిద్యాపూర్ణ మైన గురువని భావము. ఈగురువులు 'కలకంఠములు.' కోయిలకు వీణల వంటిశిష్యులు లేరు. వీణలకు కోయిలలవంటి గురువులు లేరు. కావున నీ రెంటినిగూడ నతిశయించి యీ యామెకంఠధ్వని యున్నదని సారస్యము. 'కవయు, మృదు, తలములు, తిన్నని' అనుపదములు రసవత్తరముగా నిండున్నవి. ఈ రెండు సీసపద్యములలోను ప్రతిపాదమునకు క్రమమైన సంబంధముగూడగలదు. అనురక్తి గొలుచు నెలతలు అందముగా నంచల వలెనే తతిజేరుదురేగాని అది అందగించుటకు సైరంధ్రికున్నట్టి కనుగవ శోభ వారికి లేదు. సుగంధయుక్తమైన మేనులు గల్గి ఒయ్యారముగా పైట సవరించుకుందురేగాని ఆపైటసవరింపు అందగించుట కీమెకున్నట్టి మృదుకరములు వారికి లేవు. సోలెడు లేదీగలవలెనే అందగించుచు దతి జేరి నిలిచెదరేగాని అట్లు దతిజేరుట అందగించుట కిట్టిపదములు వారికి లేవు. కనుగవశోభ, చిఱునగవు సొంపు, సరసంపుబలుకు నేర్పు

గల్గియుండినను నిట్టిమనోజ్ఞమైన కంఠధ్వని వారికిలేదు. "అత్తైఅంగున రేఖ, అవ్విధమైన గరువచందము, నమ్మెయికలికితనము, నట్టిచెన్నును సైరంధ్రియందేగాని యితరులకులేవు అని కీచకుడు సుదేష్ణకు బదులు పలికినాడు. అసురక్తి గొలుచు నెలతలకు చెయ్యులరాగము ండినను నత్తె అగున రేఖ వారికిలేదు. ఎవదనొగయించుమాట లేమి మిగులుట కవ్విధమగు గరువచందము వారికి లేదు అసురక్తిగొలుచు నెలతల కమ్మెయి కలికితనములేదు. సైరంధ్రికున్న చెన్ను ఈనెలతలకు లేనేలేదు. కావున నీనెలతలే నీరసాకారలు అనికీచకుడు పర్యవసానము తెల్పినాడని సారస్యము. పై రెండు సీసపద్యములకును తేటగీతలకునుగూడ నిట్టిక్రమసంబంధమును గవిబ్రహ్మ కల్పించి కవి పోషణ మొనరించియున్నాడు.

ఆయొలనాగ నేమియుపాయముననైన జేర్పవలయునని కీచకుడప్పను గోరినాడు. సుదేష్ణ "పరసతీసంగమము అనర్థహేతు వగునని" చెప్పి అది సుఖకరముగూడ కాదని తెల్పినది. "అదిగాక సైరంధ్రికి బలవిక్రమ సంపన్నులగు గంధర్వ లేప్రొపుతులుగలరు గాన దానివిషయమై దడవవలదు" అని చెప్పినది. ఆమాటలు సహింపజాలక పరితపించుచు కీచకు డిట్లు పలికినాడు.

మ. వనితా యేనొక పల్కు పల్కెద జతుర్వారాశి మధ్యంబునన్
ఘనబాహాబల మొప్ప నన్ను నెదురంగా నొక్కడున్ లేమి యె
వ్వనికిం దెల్లము గాదె దానిమగలన్ వజ్రాహతిం గూలు శై
లనికాయం బన మద్భుజాసమదలీలన్ గీటడంగించెదన్. ౭౫

ఆడుదానా. నేనొకమాటచెప్పెదను వినుము అని కీచకుం డిందు ప్రారంభించినాడు. నాతో సమానబలనుగల్గినవా డీభువిలోన లేడన్న సంగతి నీకు దెలియదా అని కీచకు డనినట్లుగా నీపద్యమున లేదు."ఎవ్వనికిన్ దెల్లముగాదె" అని పలికినట్లు గలదు. కీచకు డద్వితీయుడు అనునది లోకమెల్ల దెలిసియున్నదికదా అని పలికినట్లు నిందున్నది. ఇది కీచకుని బలగర్వమునువ్యక్త మొనరించుచున్నది. "అవివేకివి నీవు"అని ఇట్లుగా నసంబద్ధములైనమాటల గాలము వృథపుచ్చక వేవేగ నాకోమలిని బిలిపింపుము" అని పలుకుచు కీచకుడు దిగ్గనలేచి సుదేష్ణ చరణపీఠమునకు మ్రొక్కి అట్లే యుండిపోయినాడు. "మ్రొక్కియున్న"అనుపద మీాయభి

ప్రాయమునే వ్యక్తము చేయుచున్నది. నాపరాక్రమము లోకప్రఖ్యాతమై యుండగా అక్కవగు నీవు అసంబద్ధములైన మాటలు పలికి వృథ గావించుచున్నావు అని కీచకుడు పలికినాడని సారస్యము. సుదేష్ణ చిన్నబోయినది. లతాంగిని గూర్చిన గాని కీచకు డూరకోనువాడు (సహించువాడు) కాడని గ్రహించి దుఃఖముచే వచ్చుచున్న కంటినీరు నాపుకొనుచు "ఎట్లయినను దాని నలవరించి పంపెదను. నీవింక నిచట మసలవలదు. ఆసవమున కని నీదివములో నీయింటికి బంపెదను" అని సుదేష్ణ పలికినది. "కనుగవలో మ్రింగికొనుచు" అను పదము మిగుల సారస్యమైనది. బహుమానపాత్రముగ సైరంధ్రి తనయొద్ద మెలగుచున్నది. ఆమె సుశీలమునే పలువురియెదుట నామె మెచ్చుటించు చుండెడిది. ఇప్పుడు బలవంతుడు, దుర్మార్గుడు, కామోద్రేకము గలవాడు నగు తమ్ముని బలవంతము మిక్కుటముగా నున్నది. కావున సుదేష్ణకు మిక్కిలిగా నేడ్పువచ్చినది. రాజమహిషియగుసుదేష్ణ దానినాపుకొని (మ్రింగికొని) రాజబంధు డగుకీచకుని వాంఛితమును నెరవేర్ప దాసియగు సైరంధ్రిని వానియింటికి బంప నిశ్చయించినది. "వచ్చుచున్నకన్నీరు మ్రింగికొనుచు కొమ్మనలవరించి పంపెదను" అని పలికినది. కీచకు డింటికివచ్చి ద్రౌపదిని గాంక్షించుచున్నవాడై సొదపడుచుండెను.

సుదేష్ణ పాంచాలిని రావించి తృష్ణ భావించుచు "మదిరారస మానగ నాకు వేడుక గల్గినది. కీచకునింటిలో బలువిధములగు వారుణి యెల్లప్పుడును సిద్ధముగానుండును. కావున నీ వచ్చటకు బోయి కడువేగ నాసవమును దెచ్చియిమ్ము. ఇందులో నీ గమనవేగమును జూచెదను" అని పలికినది. తనకు సురను సేవింపవలెనని కోరికగల్గినది. అది వెనువెంటనే జరిగిపోవలయును కావున "సుర సిద్ధముగానున్న చోటికి బోయి అతిత్వరితముగ దెచ్చి యీయవలయును" అని ఇట్లుగా గనిపించుకొనుచు సుదేష్ణ పలికినదనిభావము. 'నీగమనవేగమునుజూచెదను' అనుటలోగూడ నామె యొక్కవాంఛయందలి ఆత్రము వ్యక్తమగుచున్నది. ఈమాటలు వినిన ద్రౌపదికి బెంగవేసినది. (ఉల్లము తల్లడిల్లినది. చెమటపోసినది.) "ఈపనికి వేఱొక తెను బంపుము. సత్పథవృత్తినై బహుమానపాత్రముగ నీయొద్ద

నుండి యుచితమైన పనులనే చేయుదానను. నీచ (అల్ప) పరిచారిక గా వింపవలసిన యీపనిని నేను చేయవచ్చునా? నీ గృహ మతినిర్మలచరిత భరితమని చెప్పి మత్పతుల యసన్నిధినైనను నిం దున్నదానను కదా. అట్టి యీమన్నన తప్పుట తగునా! అతివ, తగునమ్మా" అని పలికినది. "ఒక్క సంవత్సరము వ్రతాచారము మైయున్నదానను" అని మొదట బల్కి యున్నది గాన కొలదిదినములుమాత్రము వ్యవధిగల్గిన యీకాలములో సైరంధ్రి యిట్లు పలుకుట సమంజసముగనే యున్నది. నమ్మి యింట జేరినపుడు తుదిలో నున్నన చెడజూచుట పాడిగాదని సూచించినది.

ఉ. సాధులు చేరి నెమ్మిగ నిజస్థితవృత్తము దుష్టకోటిచే
బాధల బొందకుండ సముపాల నసించిన పెద్దవారు ది
క్కై ధరియించి వారి కొకయాపద పుట్టక యుండ గాచు టొ
ప్పై ధర గీర్తి కెక్కెడె యపాయము సేసిన నింద పుట్టదే. ౯౫

ఇందు "సాధులు" అని చెప్పుటచే సాధువ్రతములో దాసుంటినని యు. కేవలము దాసిపనికిగాను అచ్చట చేరలేదనియు ద్రౌపది జ్ఞప్తిపఱి చినదని సారస్యము. అమర్యాద నతిక్రమించిన నిందగల్గునని చెప్పుచునే కీచకు నింటికి బోయిన నాపదగల్గగలదని చమత్కారముగ సూచించినది. "ఏదే నొకపనికిగాను నెవ్వరో యొకరింటికి నన్ను బంపుట న్యాయమా? నిన్ను గొలువవచ్చినపుడే నీచములగుపనులవెంట బోజాలను అని చెప్పితిని కదా" అని ద్రౌపది పలికినది. కీచకునిల్లు రాచనగరుతో సమానమైనదే కాని బహుమానపాత్రమైయున్న దాసిగాన తన్నా యుత్కృష్టగృహము నకు బంపుట మర్యాదకాదని చమత్కారముగ సూచించినది. గొప్పయిం టిపడుచులు కాలగాంతరమున నొక తక్కువ పరిస్థితిలో దగుల్కొనినను ఉదారులగు నాయజమానులు వారిగౌరవమును రక్షించుచు నేలుకొం దురు. వారును వారియందను మర్యాద గాపాడుకొనుచుందురు. అట్లు గనే మర్యాదగా గాలముగడపుచున్న తన్ను రాజబంధువై ప్రసిద్ధికెక్కి యున్న కీచకునింటికి బంపుట మర్యాదకాదని సూచించినది. అదియు గౌరవ ప్రదమైన పనుపుకాదు. సురనిమిత్తము పోవలసియున్నది. కావున తన్ను డిగి యితర పనికత్తెల నిందుకై నియోగింపుమని పలికినది. ద్రౌపది యిట్లు

పలుకగా విని అనుచితమునకు శంకించియు దమ్ముని వలవంత దలంచుకొని సుదేష్ణ సాదరముగ దిరుగ నిట్లు పలికినది.

ఉ. అక్కట యేను వేడ్కపడి యానెపు నాసవ మర్థిదేరగా
నొక్క నికృష్ట బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో
సెక్కగ జేసి నిన్ను నతిహీనవిధాననియుక్త జేతగా
నిక్కమ యుమ్మలించి తివి నెయ్యము తియ్యము కల్మియే సఖీ. ౯౨

"సఖీ" అని సంబోధించి గౌరవమును సఖిత్వమును (చనువును) బ్రకటించినది. 'నాకు వేడుకపుట్టి కోరిననాసవమును దెచ్చియిచ్చుట కొక్కనికృష్టను బంపుటకు నొల్లక నీకిది చెప్పగా నీవు గోసెక్కగజేసి యీ పనుపు చులకనగా దలంచితివి. ఇది నెయ్యముతియ్యము కల్మి యగునా" అని పలికినది. నీవిట్లుగా బలుకుట యేమియు మర్యాదగా నిలేద సూచించినది. ఈపద్యములో 'నీవు' అనికాక 'నిన్ను' అని సుదేష్ణ పలుకుట భావగర్భితముగా నున్నది. తన పనుపు నీచముకాదని యిందు వలన సమర్థించునదివోలె పలికినదని యభిప్రాయము. ఇట్లు గ్రహింప కుండుట గొప్పలోపమే అని తిరిగి సైరంధ్రి పైననే మాట వేసినది.

కీచకునియిల్లు లాతియిల్లు కాదని పలికినది. "అదిపరగృహము కాదు. స్వంతముగునిల్లే కావున నీవచ్చుటకుబోవుట కెట్టియభ్యంతరము లేనిదికదా యీయిల్లు అనిసమర్థించినది. "నీసంగతి నెపరెఱుగరుకదా. నిన్ను గన్నది మొదలుగ నీమెప్పునే గొల్లవారియెదుట పలుకుచున్నానుకదా" అనిపలికి నది. ఇట్లుగా సైరంధ్రియందెంతో గౌరవము గల్గినదానివలెనే పలుకజొచ్చి నది. పెక్కుభంగుల సైరంధ్రిని బ్రార్థింప జొచ్చినది. చెప్పవలసినంతవఱకు జెప్పి కీచకు డప్పకాళ్లమీదిపడి సైరంధ్రిని గూర్పుమని ప్రార్థించినాడు. కీచ కుడు బలవంతుడే అయినను లోకమర్యాదయొక్క బలమును బట్టి అప్పుడు మ్రొక్కి కార్యమును సాధింపనెంచినాడు. అట్లే సుదేష్ణయు జెప్పదగినన్ని యుక్తులు పలికి పిదప సైరంధ్రిని బ్రార్థింపజొచ్చినది. అనగా నామె గౌ రవప్రదమైనసేవకురాలుగాన వేడికొని మెల్లగా గౌరవముగా నాపని చేయింపనెంచినదనిసారస్యము. అక్క తమ్ముడు వీరియొక్కస్వభావసాదృశ్య మును వ్యక్తమొనరించుటతోబాటు సైరంధ్రీ గౌరవప్రవర్తనమునుగూడ తిక్కన యిట్లుగా వ్యక్తమొనరించియున్నాడు. ద్రౌపదికి ఇంక నామె

తో వివాదపడరాదను బుద్ధిపుట్టినది. ఎన్నిపలికినను ప్రయోజన మిసుమంతయు నుండనేరదుకదా. ఎట్లయిన నామె కీచకునింటికి బంపవలెననియే నిశ్చయించుకొనినదని గ్రహించినది. "ఇట్టువోచిన తలంపునం జేసి" అని తిక్కన యిచ్చట వ్రాసినాడు. సుదేష్ణయొక్క మనోగతమును నప్పటిపరిస్థితిని అవగాహన మొనర్చుకొనినదై ద్రౌపది కీచకునింటికి వెడలుటకే నిశ్చయించుకొనినది. ఆమెమనోగతమెఱిగిన సైరంధ్రి మనసు గనిపెట్టి మెలగునదిగాన నింక పెనగుట గౌరవముగాదని తలంచినదని భావము. రాజులచిత్తవృత్తి గనిపెట్టి సేవకులు ప్రవర్తించుట తగునని తలచి సైరంధ్రి వివాదపడలేదని భావము. మఱియొక భావమిందుగలదు. ఇంకను వాదించుట తనకు ఉచితముకాదను భావము ద్రౌపదికి గల్గినదనియు దిక్కన యిచ్చట వ్యక్తమొనరించినాడు. అనగా సైరంధ్రిపరిస్థితి వేఱు. ద్రౌపది పరిస్థితి వేఱు అని కవి సూచించినాడు. సైరంధ్రికే యింక వాదాడ తాహతుకానపుడు ద్రౌపదికి సుతరాం కూడదు అని తిక్కన వ్యక్తమొనరించినాడు.

చ. మన మురియాడుచుండ నవమానముతోన సుదేష్ణ జూచి నీ
వనయము గోరినట్టిపని యర్థిమెయిం జని చేయుదాన గా
కను తనమాట కప్పొలతి హర్షము బొందుచు నందియిచ్చు కాం
చనచషకంబు పుచ్చికొని చాయవిలోచన యార్తమూర్తియై. ౧౦౨

నిన్ను నతిహీనపనిధాన నియుక్త జేతగా నిక్కమ యుస్సలించితి' అనిపలికి సుదేష్ణ తనపనుపును సమర్థించుకొనినది. అనుపు కూడదని పలికియు వీలుకానిపరిస్థితియందు దగుల్కొనియున్న సైరంధ్రి 'నీవనయము గోరినట్టిపని యర్థిమెయిం జని చేయుదాన గాక' అని పలికినది. అప్పటి కది అనుచితము పిదప తీర్పరాని అనర్థహేతువు కాగలదని ధ్వని. అనంతరము జరిగినసంగతి నంతయు సైరంధ్రి సుదేష్ణా వ్యాపారమంతయు నొక్కటే పద్యములో వ్రాసి తిక్కన సంక్షేపరచనాచమత్కృతిని వ్యక్తమొనరించినాడు. సైరంధ్రి గౌరవము దక్కించుకొనినదనియు, సుదేష్ణయు గౌరవముగనే కార్యసాధనమైనందులకు హర్షమొందినదనియు నిందున్న భావము. దైవవైపరీత్యమునకు మిగుల దుఃఖించుచు ద్రౌపది మహాపదలకు బరిహారణము హరిస్మరణమని హృద

యపుండరీకమున బుండరీకాక్షుని నిక్షేపించుకొని మందిరంబు వెలువడి వచ్చి సూర్యునిగూర్చి "భర్తలదప్పని మనంబు గల్గువాననేని కీచకునివలన నెట్టికీడును గల్గకుండ రక్షింపుము." అని ప్రార్థించినది హృదయము పుండరీకము. అదు పుండరీకాక్షుని దలంచినది. తలంచుటమాత్రమే కాదు నిక్షేపించుకొనినది ద్రౌపది అని సారస్యము. సూర్యు డొక్క రక్కసుని బంపగా వాడంబరంబున నదృశ్యాకారుడై వచ్చి నిలిచెను. కీచకుడు పయింబడి పట్టుకొనిన ద్రౌపది రాక్షసుని బలము తనయందు బ్రవేశించుటం జేసి వానిచే విదిల్చి భయభ్రాంతర్గమై దైవయోగంబున విరాటుండప్పుడు బయలికొలువునకిం జేసి యటు పరుగున రాజొచ్చినది. కీచకుడు గొంకు కొసరించుకయును లేక సభాసమీపముననే ద్రౌపదని దన్నినాడు అట్టియెడ పాంచాలీరక్షకుండైన రాక్షసుం డొల్లవేసిన వాడాచికొని తన భంగపాటొరు లెఱుగకుండునట్లుగా లేచి నిట్టూర్పునిగుడ నిట్టలంబగు కోపంబు పెల్లున మల్లడిగొనుచుండెను. భీమసేను డిదియంతయు జూచినాడు.

చ. కనుగొని కోపవేగమున గన్నుల నిప్పులు రాల నంగము
 ల్దనరగ సాంద్ర ఘర్మసలిలంబులు గ్రమ్మ నితాంతదంతపీ
 డన రటదాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
 ర్తన ఘటనాప్రకార భయదస్ఫురణాపరిణద్ధమూర్తియై. ౧౩౩

ఉపకీచక సంరంభసమయమున వృక్షధరుండగు భీమునిగూర్చి తిక్కన యిట్లుగా వర్ణించినాడు.

మ. వికటభ్రూకుటిఘోరఫాల కలిత స్వేదోద్భటుండుం జల
 ద్వికృతోష్ఠద్వయుడుం బ్రమర్దన దశావిర్భావ సంభావితాం
 గకుడుం జిత్తవిదాహదోహల సముగ్రక్రోధ వేగుండునై
 బకవిధ్వంసకుడయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తితోన్. 3-౨౫

పై రెండు పద్యములలో నించుమించుగా వర్ణింపబడిన విషయమంతయు నొక్కటే యైయున్నవి. కోపవేగము, చెమటపట్టుట, పండ్లు కొఱుకుట, భ్రూకుటికలుగుట మొదలగునవివర్ణింపబడినవి. "కోపవేగము కల్గినది. కన్నుల నిప్పులు రాలుచున్నవి. అంగములు తనరుచున్నవి. చెమటపట్టినది. పండ్లుకొఱుకుటచే ధ్వనియగుచున్నది. అట్టిముఖమును

నాట్యరంగమందు వికటభ్రుకుటి నర్తనమొనర్చుచున్నదో యనునట్లున్నది." ఇట్లుగా భీముడు భయంకరమూర్తియై యున్నాడని మొదటి పద్యమున జెప్పబడినది ఈసందర్భమున భీమునకు గోపము వచ్చినదేగాని అది కార్యకారి కాలేదు. వచ్చినకోపమట్లే అణగారజొచ్చినది. కావుననే అది ఒక రంగస్థలమైనట్లును, అందు (ఆముఖమందు) భ్రుకుటి నాట్యమొనర్చుచున్నటుల మాత్రమే వర్ణింపబడినది. అది నటనకు సరిపోల్చదగినదే కాని యథార్థముగా గార్యకారియగుకోపము కాలేదని చమత్కారము. పట్టరానికోపమున విజృంభింపనున్న భీమునినొసట భ్రుకుటీచలనముమాత్రము మిగిలినదని భావము. రెండవ పద్యములో నీభ్రూకుటియే ముందుగా నెత్తుకొనబడినది. భ్రూకుటిచేత భయంకరమైన ఫాలమందు జెమటపట్టినది. పెదవులు కదలుచున్నవి. దేహము ప్పొంగుచున్నది. మనస్సు దహించుచున్నటుల గొప్పగా కోపము గల్గినది. అట్టిమూర్తిమంతయు గల్గినవాడై భీముడున్నటుల వర్ణింపబడినది. మొదటిపద్యములోని విషయములనట్లు వ్యుత్క్రమమున జెప్పి తిక్కన గొప్పసొగసు నిట గూర్చియున్నాడు. ఆసమయమున కోపము వచ్చినను భీము డూరకొనవలసివచ్చినది అనునది మొదటిపద్యములో వ్యక్తమగుచున్నది. ఇప్పుడు విజృంభించి ఉపకీచకులనందఱ జిందఱవందఱగ జంపనున్నాడుగాన నంతకంతకు భీముని యాకారము భయంకరమగుచున్నదని తిక్కన వ్యక్తమొనర్చినాడు. నాట్యరంగముగా మొదటిపద్యములో వర్ణనగలదుగాన నది చంపకమాలగను, కార్యమే (విజృంభణమే) వర్ణింపబడినదిగాన రెండవపద్యము మత్తేభముగను రచింపబడుట మిగుల సారస్యముగ నున్నది. "భ్రుకుటి, భ్రూకుటి" అని ఒకటే పదము హ్రస్వముగను, దీర్ఘముగను నుపయోగింపబడి ఈరెండుపద్యములలోని భావమునకు గొప్ప ప్రోద్బల మొసంగబడినది. బకుని పురజనులకు దెలియకుండ భీముడు చంపినాడు. అట్లే అని సారస్యము. అట్లే ౩౪౪ పద్యములో 'హిడింబరిపు' అనుకొంత సాదృశ్యముగల పదమునే తిక్కన యుపయోగించియున్నాడు.

భీము డతిభయంకరాకారుడై కీచకుని గీటడగింప జూచి తత్సంబంధబద్ధుండును నాజ్ఞాపరిపాలకుండును గావున మత్స్యపతి దన యలుక

లోనివాసింగా దలంచి చేరువనున్న వృక్షము నిరీక్షించి ధర్మతనయుని గనుగొనినాడు. ధర్మజుడు తన నయనకారంబున వారించి "ఫలితంబై వర శాఖ లొప్పగ ననల్పప్రీతి సంధించుచున్ విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపగా గల యీభూజము వంటకట్టియలకై ఖండింపగా నేటికిన్, అసేవ్యక్ష్మాజముల్ పుట్టవే" అని నిగూఢభాషణముల ననిలజుకోపరసము పేర్మి సెఱిచినాడు. "అసేవ్య క్ష్మాజముల్" అనుటచే గీచకుని వేఱొకచోట దండింపవచ్చుననియు, ఆశ్రితప్రతతికిన్ విశ్రాంతి" అని పలుకుటచే తమకాశ్రయుడైయున్న విరాటుని కపకారము చింతింపరాదనియు ధర్మజుడు సూచించినాడని భావము.

భీముని కోపరసము పేర్మిని ధర్మజుడు సెఱిచినాడు. అదిగాంచి రోషము, దైన్యమునొందియున్న ద్రౌపది పడినచోటునుండి లేచి విరాటుని సభను జేరి నిలిచినది.

సీ. ఎలదీగ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీ రేణువొప్ప
జంపకంబున నవసౌరభం బెసగెడు
కరణి నాసిక వేడిగాడ్పు నిగుడ
దోయజదళములతుది మంచు దొరగెడు
గతి గన్నుగవ నశ్రుకణము లురుల
నిందుబింబముమీది కందుచందంబున
గురులు నెమ్మొగమున నెరసియుండ
తే. సర్వజనవంద్యయైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకు వచ్చిన నెంతయు దైన్యమొంది
యవ్విరాటుని సభ జేర నరిగి నిలిచి. ౧౩౮

మేన మేదినీరేణువు, నాసిక వేడిగాడ్పు, కన్నుగవ నశ్రుకణములు, నెమ్మొగమున నెరసిన కురులు కల్గి ద్రౌపది విరాటుని సభను జేరి నిలిచినది. ద్రౌపది యిచ్చటనుండి (విరాటునిసభనుండి) వెడలి సుదేష్ణను జేరు నపుడుగూడ తిక్కన యిట్టివర్ణననే చేసియున్నాడు.

సీ. ధరణిపరాగంబు వారసి ధూసరితమై
చేడియ నీమేను చెన్ను దఱిగె
జిత్తంబు తలపోతచే వాడు పొడవిన
చెలువ నీనెమ్మోము చిన్నబోయె
బ్రస్వేదమున దోగి ఫాలంబుతో నంటి
యుగ్నలి నీకురు లొప్పు గందె
గన్నీరు వఱ్ఱోడి కాంతి యెంతయు గొన్న
వెలది నీకనుగవ విన్నదయ్యె



ఆ. నేది కారణమున నెవ్వ రెచ్చోట నీ
కేమి కీడొనర్చి రెట్టిపాటి
సాహసికులొ వారి జంపుదు నొంపుదు
భంగపఱుతు నిడుమపఱుతు జెఱుతు. ౧౫౬

సర్వజనవంద్యయైన పాంచాలి సింహబలునిచే భంగపాటు నొంది విరాటసభనుండి సుదేష్ణను జేరినది. ఆమె మేను చెన్ను దఱిగి మోము చిన్నబోయినది. కురు లొప్పుగంది యున్నవి. కనుగవ విన్ననైనది. సుదేష్ణవద్దనుండి బయలువెడలునపుడు మామూలుగానున్న సైరంధ్రి సురనిమిత్తము వెడలి వచ్చుసరికి బహుదైన్యావస్థలోనికి వచ్చినది. సుదేష్ణచే నీపలుకులు పలికించుచు సభనుండి సుదేష్ణను జేరుసరికి సైరంధ్రి దేహపరిస్థితి యెట్లు మాఱినదియు గూడ దిక్కన వ్యక్తమొనరించినాడు. నాసిక వేడిగాడ్పుకు బదులుగా జిత్తంబు తలపోతచే చిన్నబోయిన మోమీ రెండవపద్యమున గ్రహింపబడినది. ఆర్తయై కన్నులబాష్పపూరములు గ్రమ్మగ, మోమున దైన్యమొందగా దొట్రిలుచు సైరంధ్రి అంగముదూల సుదేష్ణపాలికి వచ్చినది గాన వేడిగాడ్పుకు బదులుగా చిన్నబోయినమోము గ్రహింపబడినది. "ఏదికారణమున నెవ్వరెచ్చోట నీకేమి కీడొనర్చిరి" అని సుదేష్ణ పలికినది. ఇంతటిఆపద(ప్రమాదము) తటస్థించునని ఊహింపనైనలేదు అనుభావము నిందామె వ్యక్త మొనరించినది. బహుమానపాత్రముగ నున్నదాని కిట్టి భంగపాటా. సురనిమిత్తము పంపుటే ఆపదకు గారణమైనదే. నేరకపోయి పంపితినే. అయ్యో! అనుభావము నామె వ్యక్తమొనరించినది. కావుననే "కీడొనర్చినవా రెట్టి

పాటి సాహసికులొ" అని పలికినది. తానెంతో బహుమానముగ జూచు చున్న సైరంధ్రి నిట్టిపాటు గావించు వా రారాజ్యమున నున్నారా అని దానిభావము. అట్టివారుండ రాదు. వారిని జంపుదును అని పలికినది. అంతియకాదు. నొంపుదు భంగపఱుతు నిడుమపఱుతు జెఱుతు అని పలికినది. [illegible]ములుగా వానిని దండింపవలసియున్నది అని వ్యక్త మొనరించినది. సుదేష్ణ సంభ్రమము దెచ్చికొని, ఏమియు నెఱుగని దాని వలెనే పలికిన యీ పలుకులువిని ద్రౌపది గౌరవమును సడలించి పలుక జొచ్చినది. "నాచిత్తము దాదృశులకు గోచరమే" (౧-౩౨౭) అని లోగడ నామె పలికియున్నది. కీచకునివలన గొప్పపరాభవము జరిగిపోయినది గాన మఱిసహింపనిదై గౌరవము నిలబెట్టుకొను దలంపు గల్గియున్నది. కావుననే యిదియంతయు నీవలననే వచ్చినది అని పలికినది. "నీవెఱింగియు నెఱుంగమి భావించిన నింక నేమని పలుకం గలదాననైనను వినుము" అని యిట్లు పలికినది.

మ. నను నీ వప్పుడు సూతసుందిరమున న్మద్యంబు దెమ్మన్న బో
యిన నాతం డవినీతి నేసినను జే యీ కేను మత్స్యావనీ
శునియాస్థానముదిక్కు వే చనిన నచ్చో దీవ్రకోపంబున
న్వెనుకం గూడగ ముట్టి పట్టికొని తన్నెం బల్కు లిం కేటికిన్. ౧౫౮

జరిగినదంతయు నొక్కపద్యములో దిక్కన వ్యక్త మొనరించి నాడు. పలుమాటలాడుటకిష్టములేని ద్రౌపది యిట్లు పలికినదని సారస్యము. సైరంధ్రి యిట్లు పలుకగా "కీచకుని దండించి నీకు నాహ్లాద మొనర్తును" అని యామె పలికినది. అయ్యసత్యసంవాదినిపూన్కి యాలమునేసి ద్రౌపది యిట్లు పలికినది.

కం. నీ వింత యలుగ నేటికి
నావంతయు బౌరజనమనఃఖేదము నొ
క్కావంత ద్రిక్కకుండ గ
లావంతులు మత్పతులు గలరు పగ దీర్పన్. ౧౫౯

వ్రతాచరణముమై కాలాంతరమున విరాటనగరము నాశ్ర యించియున్న తనవంటి ఘనమైన వ్యక్తి కింతటి భంగపాటు గల్గినదిగాన నట్లు గావించినవాడు ఎంతటివాడైనను దండింపబడవలసినదే. "సురను

దెమ్ము" అను నీచమైన పనుపు సుదేష్ణ చేసినది. వలదని చెప్పినను విని నది కాదు. భంగపాటుకలిగినది. కావున గంధర్వపతులు పగదీర్పనిది యుండనేరరు. "కార్య మిపుడు నీచేతులనుండి నాచేతులనుండి దాటి పోయినది.ఉత్తములగు గంధర్వపతు లింక నెటులగూడ నోర్చియుం డరు. పగదీర్చుకొందురు. సుదేష్ణా! నీకేల నీ వృథాయగు నలుక" అను భావమున ద్రౌపది పలికినది. ఎలుగు వేటొకభంగిగా బలుకుచున్న సుదేష్ణతో "చాలు నిక నూరకొనుము" అని ద్రౌపది పలికిన దని భావము. ప్రతిక్రియ జరిగిన పిదపగాని సైరంధ్ర తేలుకొనదు అను నది వ్యక్తమగునటుల ద్రౌపదియున్నది. అది జూచి సుదేష్ణ పరిజనములు వెఱబొందిరి. ఎన్ని సాంత్వనములు చెప్పినను వేఱదు. మజ్జనభోజనములకు జొరదు. కీచకునంతవానియింటికి బోయిగూడ తప్పుకొనివచ్చిన సాహసి కురా లా సైరంధ్ర. ఇంక నామె భర్తలు అంబరచారులగు గంధర్వులు. వా రెప్పుడేమి చేయుదురో అని సుదేష్ణాదులు భయమొందిరి.

పాంచాలి నిజశయన స్థానంబునకు జని తల్పంబుపై మేను వైచి యసాంగంబులం బొరగు కన్నీరు చెవులకొలంకులునిండ నెవ్వగలు నివ్వ టిల్ల గార్యగతిని దలపోసినది.

క. ప్రబలుం డాతయు నాసింహబలుం డాతని జయింప ననిలతనయు బా
హుబలంబ గూడ దగు దైవబలంబును నాతనికి నవశ్యము గల్గున్.

ఆయుధవ్యాపార మేమి లేకుండ కీచకుని సంహారింపవలసి యున్నది. అజ్ఞాతచర్యకు భంగము రాకుండ కార్యము సాధింప నెంచినది గాన బాహుబలసమగ్రుడగు భీముని దలంచినది. భీమునియొద్దకు బోయి నపుడు గూడ నామె సాభిప్రాయముగ నాతని బాహుబలమునే యిట్లు ప్రశంసించినది.

తే. బక హిడింబ కిమ్మీరుల బాహుబలము
నా జరాసంధు సుగ్రదర్పాతిశయము
లోకభీకరములు విజయాకరములు
నైన నీకరములకు లోనయ్యె గాదె. ౧౯౪

రాత్రి అయినది. సమస్తజనంబులు గ్రమంబున నిద్రింప దొడంగిరి. ద్రౌపది శయ్యాతలంబు విడిచి మేసిధూళి గడిగి ధౌతపరిధానపరీతగా

మహానసగృహమున సుప్తుడైయున్న వృకోదరుకడకు జనినది. "క్రమంబున నిద్రింప దొడంగిన" అనుపదము సాభిప్రాయమైనది. సైరంధ్రి పడ్డదే పాటు మఱిలేవలేదు కావున నామెనుగూర్చిన శంకను క్రమముగా విడిచి ఒక్కొక్కరు నిద్రపోయిరని యభిప్రాయము. అంతవఱకు నొంటిమీద నున్న ధూళికూడ నామె కడిగికొనలేదు. అప్పుడులేచి కడిగికొని బురద బట్టవిడిచి మంచిబట్ట కట్టుకొనినది. శుచిశుభ్రముగా నుండవలసినది గాన ద్రౌపది యిట్లొనర్చినది. కీచకుడు ద్రౌపదిని జూచిన సందర్భములోగూడ "మాసిన చందము" (౨-౭౨) అని మాత్రమే తిక్కన రచించియున్నాడు. వేషము మాసినచందముగా నున్నదేగాని ఆమె శుచిశుభ్రముగనే యున్నదని భావము. ధౌతపరిధానపరీతయై భీముని జేరి పలుకరించినది.

ఉ. నన్ను బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగుదప్పక సుఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్ను మొగుడ్చు నూఱటకు గారణ మెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా. ౧౬౬

ఈపద్యములో "నన్ను" అనుపదము మొదలుకొని "అక్కటా" అనుపదమువఱకు నున్న పదములన్నియు అంతరువులుగా నుపయోగింపబడినవి. మఱియు మొదటినుండి కొనవఱకు, కొననుండి మొదటి వఱకు చూచినను ఇవి క్రమత్రైష్ణమును వ్యక్త మొనర్చునవి యై యున్నవి. తిక్కనార్యుని రచనలో నున్న పద్యములు ప్రతిపదసారస్యము గల్గినవియై, భావానుకూల్య మగు నర్థగాంభీర్యమును స్పష్టీకరించుచుండును. ౧ అక్కటా దయమాలితివే, మీయన్న వలదన్నందుననా, నీకన్ను మొగుడ్చు నూఱటకు గారణ మదియా. కీచకుడు మున్నున్న తెఱంగు దప్పక సుఖనిద్ర సేయుచున్నాడే, స్వగృహమును జేరుకొనినాడే, నన్ను పరాభవించియున్నాడే అనునది వ్యుత్క్రమమైనభావము. ౨ నన్ను బరాభవించినాడే, సదనమునకు జనినాడే, సుఖనిద్ర సేయుచున్నాడే, అటులకాగా నీవు పండుకొనుటకు హేతువేల దెల్పుము. మీయన్న వలదన్న మానితివా, దయమాలితివా, అక్కటా అనునది ఇంకొకభావము. "మున్నున్న తెఱంగు, ఊఱటకు, భీమసేన" అనుపదములు

మిగుల నభిప్రాయముగల్గినవై యున్నవి. "నన్ను బరాభవించి" అనగా పాండవప్రియపత్నియని గర్భితము. అట్టినన్ను బరాభవించి వాడు స్వగృహమున సుఖనిద్ర సేయదగునా. (పోనీగాని మునపటివలెనే వాడుండ వచ్చునా,సుఖముగా బంధుకొనవచ్చునా) అట్లయినపుడుగూడ నీవు నిద్ర పోవచ్చునా, కన్నుమూసుకొనునంతటి ఊఱట నీకెట్లు కలిగినది. నీవుభీరు సేనుడవుగదా" అని ద్రౌపది పలికినది. ఇంతవఱకు భీము నుపేక్షించి యున్నందులకు శోకముకు వెలిబుచ్చి ఈదోష మాతనిదని తెల్పక "ధర్మజుడు వలదన్న దయమాలితివా" అని పర్యవసించుచున్నది. ఇందు నను గుణముగనే ద్రౌపది భీముని పొగడుచున్నది. "మహోగ్రకోపరేఖావిభవంబు వైరులకు గాలము చేరువగావె పావనీ" అని పలికినది. నీయెదుట నిట్టి భంగపాటు గల్గినది గాన గీచకు డింక బ్రతుకువాడు కాడు అని వ్యక్తమొనరించినది. సభలో గీచకుడు బ్రతికిపోవుట ధర్మజుని యడ్డంకి వలననే యని తేల్చినది. "అట్లయినను నీయందు దోషము లేకపోలేదు. నీ వుపేక్షించి యూరకొనుట నా దురదృష్టమే గాని యున్నది. "అక్కటా" అనుపద మీయభిప్రాయమునే సువ్యక్తము సేయుచున్నది. గట్టిగా మాటాడుటకు వీలులేని దాసమయము. మామూలుగా గూడ భాషించుటకు రాలేదు. మందమంద సంభాషణ సంభాషించినది. మంద మంద సంభాషణయే పై పద్యమున వ్యక్తీకరింపబడియున్నది. కాని యా మాటలుమాత్రము పిడుగులకంటె నెక్కుడుగ భీమునిహృదయమునకు దట్టుచున్నవి. ఆమె పాణిస్పర్శమున లేచి కూర్చొనినాడు ఆమెవచ్చినపని నూహించియు నామె చెప్పగా వినదలచి యిట్లుపలికి నాడు.

తే. ఇంతప్రొద్దేల యిచ్చోటి కేగుదేర
గారణం బేమి యెవ్వరు గానకుండ
నట్లుగా జనుదెంచితె యంబుజాక్షి
యనిన నయ్యింతి యిట్లను నతనితోడ. ౧౬౮

పంబినకోపము, సమయభంగభయముగల్గి ద్రౌపది విరాటసభలో మాటాడినది. తనకువచ్చిన కోపరసము పేర్మిని ధర్మజుడు సెఱచిన సమయములో నజ్ఞాతవాసమును ద్రౌపది జ్ఞప్తియుంచుచుకొని ప్రవర్తించినది. అర్ధరాత్రి యగువఱకు వేచినది. ఎవ్వరును జూడకుండ వచ్చినది. ఆమె

యంతగా సమయమును గాపాడుచు తన్నుమాత్ర మేల దెప్పిపొడవ వలయు ననుభావ మిందు భీముడు వ్యక్తమొనరించియున్నాడు. "ఎందుకు వచ్చితివి. ఎవ్వరును జూడకుండవచ్చితివా" అనునవి రెండును ద్రౌపది సత్త్వభావమందే ప్రతిఫలించు నట్లుగా భీముడు ప్రసంగించినాడు. ఈ మాటలు ద్రౌపది నెత్తిపొడుచుట కనినవి కావు. తమకందఱకు గల్గియున్న సంకటపరిస్థితిని వ్యక్తమొనరించుటకే యిట్లు పలికియున్నాడని పర్యవసానము.

ద్రౌపది తనకును గీచకునకు నడచిన వ్యాపారమంతయు వ్యక్త మొనరించినది. రోష మొందియున్న ద్రౌపదికి గోప మతిశయించుచున్నది. ఆపరిస్థితిలోనే ద్రౌపది మాటాడుచున్నది. కావుననే యిట్లు పలికినది. "నన్నెవ్వరికి నేమి సేయవచ్చునని మీరాలాపువచ్చి సూతునింటికి సురకు బోయితిని. వాడు చెట్టపట్టవచ్చిన ద్రోచితిని. వెంటనంటగా మీరున్న కడకు సంభ్రమముగా బాఱుచెంచితిని. ఆకులపాంసనుడు వెనుకనకూడ ముట్టెను. అంతపని జరిగినను (అంతయినను గూడ) మీ రూరకుంటిరి. మీరుభయులు (భీముడు, ధర్మరాజు) నా సమయములో నూరకొనుట పెద్దతనముగా గనబడ లేదు." అని పలికినది మిమ్ము నమ్ముకొనియున్న నా కిట్టి పర్యవసానము- ఇట్లు మీరు గారుట ఎంతమాత్రము సమంజసముగ గనబడ లేదని తెల్పినది. "నేనిందఱకు నగల నొందియున్నాను గావున వగనాకు వింతగాదు." అని పలికినది. దీని కంతకు గారణము నీవు కాదు, నేను కాదు, మన ముభయులము కాము అని తెల్పునదియై ధర్మరాజు నిట్లుగా నుపాలంభించినది.

ఆ. అకట యాడుకూయు నాలకూయును లాతి
వారికైన సరయవలయు ననిన
నన్ను గీచకుండు దన్నంగ నెట్టులు
చూడనేర్చె ధర్మసూను డపుడు. ౧౭౭

వ. అనిన విని యతం డిట్లనియె. ౧౭౮

ఉ. కీచకు డట్లు మీదు పరికింపక తన్ను బరాభవింపగా
జూచి మహోగ్రకోపవివశుం డగు నన్నును జూచి ధైర్యహా

మాచలుడైన ధర్మసుతుఁ డమ్మెయి వారణ సేయకున్న నే
నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గుసేసినన్. ౧౭౯

'ఆసమయములో గీచకుని మీఁదు పరికింపక అకృత్యమాచరించుచున్నాడు. ఇంక మనసంగతిని దెల్పెద వినుము' అనునట్లుగా భీముడు ప్రారంభించినాడు. 'తన్ను బరాభవింపగా' అని భీముడు పల్కినట్లుగా దిక్కన యిందురచించినాడు. 'నిన్ను బరాభవింపగా' అనికాక 'నన్ను బరాభవింపగా' అని కాక 'తన్ను బరాభవింపగా' అని వ్రాసి ఈపరిస్థితినంతయు నొక్కమాటుగా ధర్మజుని ఉత్తమునివానముపైకి పర్యవసించుచున్నాడు. 'ఈపరాభవము నీదని నీవనుకొనుచున్నావు. ఉపాలంభించితివి. నాదని అనుకొని నేను విజృంభింప జూచితిని. కాని మనయుభయులకుకంటెకూడ నిది ఆతనినే (ధర్మజునే) సంబంధించియున్నదని ఆతడు తలంచినాడు చూడుము. ఉత్తమవంశసంజాతుఁడగు నాధర్మమూర్తి (ధర్మసుతుడు) ఈపరాభవమునకు దోడుగా నన్ను నిన్నుగూడ వారింపవలసివచ్చినది. చూడు నూతడెంత ధైర్యవంతుడో నిక్కముగ నాతడు ధైర్యహీనాచలుడే ఆత డమ్మెయి వారణచేయకున్నచో నెంతటి వైపరీత్య మేర్పడియుండును' అని భీముడు పలికినాడు. ఈసందర్భములో దనవిషయమై 'నీచత' అనుపదమును వేసికొనినాడు. ఈపద మిప్పటివ నెంతయేని శాంతపరిస్థితిని గుర్తింపజేయునదిగా యున్నది. ద్రౌపదికి పరిస్థితిని గుర్తింపజేయునదిగా యున్నది. కీచకుని నప్పటిలో సంహరించుట యనగా నెట్లుగా బరిణమించునో అం దెంతటి నీచత్వము గలదో భీముడు వ్యక్తపఱచినాడు. 'నే నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గుసేసినన్' అని సందర్భమునంతయు దలకెక్కించినాడు. "ధర్మజు డాసమయములో నట్లు వారింపకున్న నంతయు జెడిపోయియే యుండును. అట్లు జరుగకుండ కాపాడిన సత్యవ్రతనిష్ఠుం డగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం దగువాడుగాని దూఱుపడ నర్హుండు గాడు" అని భీముడు పలికినాడు. కీచకునిజంపుట ఒకలెక్కలోనిదికాదు. రహస్యభంగముకాని తెలుగు నఁయవలయును గదా" అని పలికినాడు. భీము డిటుల కార్యమందున్న చిక్కును దెల్పగా ద్రౌపదియు విచారిం

చినది. తాను బడుచున్న కష్టము నిట్లు చెప్పుకొనినది. ఇచ్చట "మానిని యిట్లనియె" అని రచింపబడుట సాభిప్రాయముగా నున్నది.

క. గొంతికి నంత వెఱవ మీఁ
కంత వెఱవ దైవమునకు నంత వెఱవ న
త్యంతకలుషాత్మ విరటుని
కాంతకు నే వెఱతు బనులు గానించునెడన్. ౧౮౫

"ఒక మూర్ఖునిచే నిట్లయితినిగదా యని తగవెల్ల నెఱింగి యుండియు నిట్లు పలికితిని. అట్టిదకాని సమస్త జనస్తవనీయుండగు పాండవాగ్రజు నిక్కంబ నింపించిన దానగాను అని ద్రౌపది పలికినది. సభలో దనపాటు గాంచియు మిన్నకున్నందున ధర్మజ భీములమీద నామెకు గోపము వచ్చినది. కావున వారి నుభయులను నుపాలంభించి నది. అదివిని భీము డుచితరీతిని బలికినాడు. అప్పుడు ద్రౌపది తనకును గీచకునకును నడచిన వ్యాపారము దెల్పి తిరుగ వారి నుపాలంభించినది. దీని కంతకు ప్రధానకారణము ధర్మరాజు అని పలికినది. దానికి భీముడు ధర్మజుని యందున్న ఘనతను వ్యక్తమొనరించి అది తమ కెంతగా నుపకరించినదియు వ్యక్తమొనరించినాడు. కీచకుని జంపివేయుట కిప్పుడు మించిపోయినదేమి అని పలుకుచు సమయమెట్లులవడునో అని అనినాడు. ద్రౌపది అప్పటికి బరిస్థితిని గ్రహించి అందువలన ధర్మజునియందున్న ఘనతను గుర్తింపగల్గినది. ఆఘనత నెఱింగియుండియు నిట్లుగా దాను పలికిన దానికి గల కారణము దెల్పి యధిష్ఠిరు నిట్లని స్తుతించినది.

క. ధర్మతనూభవు సంతతె
ధర్మనిరతి మనము బ్రదుక దలచుట యరుదే
నిర్మలుడగు నాతని స
త్కర్మంబున గాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్. ౧౮౮

అని పలికినది. భీమునిగూర్చి యామె యిట్లు పలికియున్నది.

ఉ. నీవలమూపులావు మును నేల వహించిన నాగకూర్మ గో
త్రావనిభృద్దిశాకరుల కారయ నూఱటపట్టుగాదె సం
భావన భూజనంబులకు బందువు గాదె మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకు గాలముచేరువ గాదె పావనీ. ౧౯౩

అంతటి బలపరాక్రమములు గల్గిన భీమునకు గీచకసంరంభమును గాంచినందున నెంతటి కోపము వచ్చినదో కవి యిట్లు వ్యక్త మొనరించినాడు.

సీ. నేలయు నింగియు దాళములుగా జేసి
యేపున రేగి వాయించి యాడ
గులపర్వతంబులు గూల్చి యొండొంటితో
దాకంగ వీకమై దన్ని యాడ
నేడు సాగరములు నిక్కడక్కడ బెట్టి
పలుచని ింపి మై నలదికొనగ
దిక్కులునాలుగు నొక్కచోటికి దెచ్చి
పిసికి పిండలి సేసి పిడుచగొనగ
తే. మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ
నప్పళించుచు బ్రళయకాలానలమున
గండరించినరూపంబు కరణి భీము
డతిభయంకరాకారత నతిశయిల్లె. ౧౩౮

వేటిని నెట్లు గావించుటకు వీలుండదో అది సాధించువాడు భీముడని యీ పద్యమున దెల్పబడినది. "చేసి, వాయించియాడ" మొదలగు పదములు లా యా యర్థములను మఱియు బోధించుచున్నవి. ఆసమయమున భీమసేనుడు హద్దు దాటునటుల నున్నాడు. అటులయిన గీచకుని మాత్రమే గాక సపరివారముగ విరాటుని, బ్రహ్మాండమును గూడ హింసించువాడువలెనే యున్నాడు. అట్లుగా విజృంభింపనున్న భీమసేనుని గోపరసము పేర్మిని జెఱచి కార్యగతిని యెఱుకపఱచిన ధర్మజుడు సిక్కముగా ధైర్యహేమాచలుడే యని ద్రౌపది భీమునితో నేకీభవించుచున్నది. ఆతని సత్కర్మముననే మనకును ధాత్రికంతటికి గూడ బ్రతుకు దెరవు అని యొప్పుకొనినది. ఇచ్చట ధర్మజప్రశంసాపరముగా నమూల్యములగు నాలుగు పద్యములను దిక్కన రచించియున్నాడు. అందిది యొకపద్యము.

సీ. చనునె వేఱొకని కజాతశత్రుం డను
పేర దిగ్విజయంబు పెంపు దాల్ప

రాజసూయమహాధ్వరముగోరి చేయంగ
దీటునే పెఱధరిత్రీపతులకు
ధర్మైకనిరతు డాతం డొక్కరుడ చూవె
యన జన నొరులకు నలవి యగునె
నిత్యవ్రతంబుగా సత్యంబు పాటింప
వచ్చునె యొరుల కెవ్వరికి నైన
తే. నయ్యుధిష్ఠిరు గాంభీర్య మతని ధైర్య
మరయ నొండెడ గలుగునె యతడు కీర్తి
ధరుడు కరుణోత్తరుడు మహీసురసమృద్ధి
కరుడు నిజవంశకరు డుపకారపరుడు. ౧౮౯

అజాతశత్రుడు అని విఖ్యాతినొందినవాడు దిగ్విజయ మొనర్చినాడు. అట్టి పెంపుదాల్ప వేఱొకనికి జనునా. అజాతశత్రుత్వము, దిగ్విజయము ఈ రెండును ఉత్తరదక్షిణధ్రువములవంటివి. ఎప్పుడును కలియునవి కావు. ఆ రెంటిని కలిపినట్టి సార్వభౌము డీ ధర్మరాజు అని ద్రౌపది పలికినది. ఈపద్యమంతయు నిట్టి గంభీరవర్ణనముతో గూడియే యున్నది. చనునె, తీరునె, అలవియగునె, వచ్చునె, కలుగునె అను నయిదుపదములా యా పాదములందు వర్ణింపబడిన విషయములకు రెట్టింపు పోషకములుగా శోభించుచున్నవి. "కీర్తిధరుడు" అను నయిదుపదములు క్రమముగా పైని జెప్పబడిన నయిదువిషయములకు (అయిదు పాదములకు) అన్వయించుచున్నవి.

ధర్మజునిగూర్చి రచింపబడిన పద్యములవంటివే భీమాదుల విషయమున గూడ రత్నములవంటి పద్యములను దిక్కన రచించియున్నాడు. అవి వారివారి స్వభావస్వరూపములను వ్యక్తీకరించునట్టివై యొప్పియున్నవి.

భీముని ప్రశంసించునపుడు ద్రౌపది ఒకవిశేషము నిట్లుగా దెల్పినది. "వివేకవిహీనుడగు విరాటుడు నిన్ను క్రూరమృగములతో బోరించునపుడు అంతఃపురకాంతలవెంబడి వారి వినోదము కొఱకు నేనును రావలసివచ్చుచుండెడిది. అప్పుడు భరమున నీవు పోరునపుడు పరమవిషాదము, నీజయమున సంతోషము పొందు నన్నుజూచి సుదేష్ణాదులు నీ

యందు నన్ను శంకించి యున్నారు. అందువలన మన్నిమిత్తము నీ పుద్రే కించిన జనులు తప్పక మనల భేదింతురు. కావున రహస్యము నవశ్యము కాపాడుము" అని పలికినది. జగన్మాన్యశరీరుడైనభీమునిగూర్చి ఒకపిసరైన వితర్కింపకుండుట (ఇంతటి మహానుభావుడుగ గనబడుచున్నాడే. ఇతని నిట్టి చులుకని పనియందు ప్రవేశపెట్టి వినోదింపవచ్చునా అని యాలోచింపకుండుట) వివేకవిహీనమని ద్రౌపది యెంచినదని భావము. భీమునితో ప్రసంగించునపు డిట్లుగా బలికినదిగాన ఆపదము సంక్షోభమును బోధించునదిగా నున్నది. ఇందువలన నామె విరాటుని నిందించిన దని మాత్రము భావింపరాదు. భీముని యాకారసౌష్ఠవమును వ్యక్తపఱచుటకే (వేరొకానుటకుమాత్రమే) ద్రౌపది యిట్లు పలికినదని భావము

మహాభావులగు ధర్మరాజాదులందున్న ఘనతను బేరొకొని తన విషయ మామె చెప్పికొనినది. "మిగుల శ్రమపడుచుంటిని" అని పలికినది.

ఉ. ఒల్లరు రాజు దేవులును సడ్డులు రాచిన చందనంబు మే
నెల్ల జెమర్పగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య
ల్లల్లన మార్దవం బొనరునట్లుగ నెట్టకు నేని రాచి మీ
తల్లికి భక్తి బెట్టెడు విధంబున బెట్టుదు బ్రహ్మ బెట్టుమున్. ౨౨౦

ఉ. నున్నదనంబుగా నలుగు నూరియు జందన మట్లు రాచియుం
బన్నుగ గ్రొత్తలైన కలపంబులు గూర్చియు నాసు దేష్ణకుం
గన్నులసన్నలం బనులు గైకొని వారక చేయుచుండుటం
ము న్నటు లున్న పాణితలములు బలుగాయలు గాచె జూచితే. ౨౨౧

ఉత్తములగు పాండవు లిడుముల బడుచుండిరి. సగవా రెట్లో ఓర్చుకొనియుండిరి గాని ద్రౌపది ఓర్వలేక యున్నది. పనులుచేయుట యనున దే యెఱుంగని ద్రౌపది దాసిగా బనిచేయవలసి వచ్చినందున నామె చేతులు కాయలు కాచినవి. చందనమువీయ మొదలిడగానే పాప మామెకు శరీరమునిండ చెమట పట్టెడిది. దానిని సహించుకొని (అలయక) ఎంతో శ్రమపడి చందనము రాయవలసి వచ్చెడిది. "నిల్చి నిల్చి" అనుపదము ద్రౌపదియొక్క నిండుకష్టమును వ్యక్త మొనర్చుచున్నది. భరించుటకు రాని శ్రమ గలుగగా నొకమాఱు నిలిచి మరల పనిచేయవలసివచ్చె

డిది. అట్లనొన్నె పూలులు నిలిచి నిలిచి పనిచేయుచుండెడిది. అందువలన కాయలు కాచియున్న రెండుచేతులను భీమునకు జూపినది.

క. అనుచుం దొరఁగెడు నశ్రుల
మునిగిన మో మతనివక్షమున జేర్చిన న
వ్వనిత యవస్థయ తాల్పుచు
ననిలసుతుం డడలె రెండ మలమట బొందన్. ౨౨౨

కాయలు కాచియున్న చేతుల నాతనికి జూపుటతోడనే యామెకు దుఃఖము హెచ్చిపోయినది. ఏడ్పు వచ్చినది. కన్నీరు మొగమెల్ల నిండిపోయినది. భరింపరానంత దుఃఖ మామెకు గల్గినదని భావము. అశ్రుల మునిగిన మో మతని వక్షమున జేర్చినది. అది చూచుసరికి భీమునకు మతి పోయినది. అంతవఱకు ధైర్యమును జిక్కబట్టియున్న భీమున కిక దుఃఖ మాగినదికాదు. తానును ఆమెయవస్థలోనికి వచ్చివేసినాడు. అడలిపోయినాడు.

తే. అట్టియెడ దన్ను దాన యూరార్చికొనుచు
నంబుజానన నెమ్మొగ మల్ల దుడిచి
యనునయించి తత్కరములు దనమొగంబు
గదియజేర్చుచు నిట్టూర్పుగాడ్పు నిగుడ. ౨౨౩

వ. చింతాక్రాంతుడైన కౌంతేయునకు నయ్యింతి యిట్లనియె. ౨౨౪

మగవాడు గాన లేక సత్తముడు గాన భీముడు తన్నుదాన యూరార్చుకొనినాడు. ఆమెముఖమును దుడిచి అనునయించినాడు. ఆమె రెండుచేతులు పట్టుకొని తన ముఖముమీద నుంచికొనినాడు. "గదియ జేర్చుచు" అనునది అర్థసౌష్ఠవము గల్గిన పదమైయున్నది. ముఖముపై చేతుల బెట్టుకొనిన పిమ్మట దుఃఖ మింకను హెచ్చిపోయినది. అప్పుడా చేతులను గట్టిగా నదిమికొనినాడు. అప్పు డాతనికి పెద్దనిట్టూర్పు వచ్చినది. చింతాక్రాంతుడైనాడు. (చింత అతనిని ముంచివేసినది) మాటాడ జాలకపోయినాడు. అనగా నేమియు పలుకజాలకపోయినాడు. తన్నుదా నూరార్చికొనినాడే గాని ద్రౌపదిని నూరార్పజాలకపోయినా డని భావము. అప్పుడు ద్రౌపది యిట్లు పలికినది.

తే. ఇందఱకు నిన్ని భంగుల నిడుమ గుడవ
వలసె ధర్మతనూభవు వలన జేసి
దాయ లొడ్డిన మాయజూదంపు టుసుల
బడి కులంబున కాత డిప్పాటు దెచ్చె ౨౨౪

ఇందు తనకష్టమునే కాక భీమాదుల కష్టమును గూడ జతచేసినది. అంతటికష్టము లొక్కమాఱుగా భీముని మనసున కెక్కునట్లుగా జేసినది. "చూడు! ధర్మజు డెంతపనిచేసినాడో" అని పలికినది. "ఇంతటి కష్టములు సంభవించుట నా పాపఫలము. సమర్థులగుభర్తలు గల్గియుండియు నిట్టిపాట్లు పడుటయు, నందుకు బ్రతిక్రియయను లేకుండుటయు దైవవైపరీత్యమే. మీర లభ్యుదయగౌరవమొందగోరి యే నేవిధినైన నాపదలకెల్ల నోర్చెద. దానికేమి. కీచకుడు కాముకుడై నన్ను పట్ట నుంకించుచున్నందున మిమ్ముల దూఱవలసివచ్చినది" అని పలికినది. "అలంతులం బోవక యేచి పట్టుకొనబోయిన" అనునది కీచకుని వలనిబాధ ప్రమాద పరిస్థితిలో నున్నదని వ్యక్తము చేయుచున్నది. పాండవుల గౌరవ మింక నిలువదు. కీచకునిబాధ సహింపలేక ఆత్మత్యాగ మొనర్చుకొనిన పాండవుల యశంబునకే హాని. తనకట్టిమృతి గలుగరాదు. అందువలన పాండవులు భార్యను సంరక్షింపలేకపోయిరి అను నయశము కలకాల మిలయందు నిలిచిపోవును అని ద్రౌపది వ్యక్త మొనర్చినది. ప్రాణత్యాగ మొనర్చి మానము కాపాడుకొనుటకు నోర్చియుంటిని. ఇప్పుడు మఱివీలులేదు. అజ్ఞాతచర్యకు భంగము వాటిల్లును అని సమాధానమిచ్చుటకు వీలులేని పరిస్థితి యిది యని గ్రహింపుము అని ద్రౌపది వివరించినదని భావము.

తే. వాని దెగజూడ వైతేని వాయుపుత్ర
నీవు గనుగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబునసైన నేను
మేను దొఱగుదు నెట్టు నీయాన సుమ్ము. ౨౨౫

రహస్యముగ గీచకుని బరిమార్చు నుపాయ మాలోచింపుము. లేనిచో గీచకునిబాధ తొలగదు గాన మానరక్షణార్థము నేను ప్రాణ

త్యాగ మొనర్చెదను. అజ్ఞాతవాసమని, రహస్య మెటుల గాపాడబడు నని భీముడు పలికియున్నాడు గాన నదిసాకుగా గార్యవిలంబన మాచ రింప వీలులేదు. ఇతరమైన ఉపాయములు గావు. కీచకుని వధించియే యీకార్యము చక్కబఱుపవలయును అని ద్రౌపది స్పష్టపఱచినది. ద్రౌపది యిట్లు పలుకగా భీముడు చిఱునవ్వు నవ్వుచు నిట్లనినాడు. అనగా నవ్వుచునే యీపై మాట లనినాడని భావము.

చ. జలజదళాక్షి కీచకుని జంపుట కిమ్మెయి ముట్ట బల్కగా
వలయునె యేను జూడ ననివారణ నిన్ను బరాభవించి వా
డిల మన నింక నాండ్రకును నెవ్వరు భంగము నీగజాలువా
రలఘు గుణీయ భావాలుబల మప్పుడ చూపని తప్పు సాలదే.

తే. ఎల్ల యెల్లవిధంబుల నెదు జొచ్చె
నేని నాధర్మతనయుండు దానవచ్చి
యడ్డపడ నేని నీన పెంపాగునకరణ
గాచి తేని నా చే బడు గీచకుండు. ౨౩౨

వ. వానిదేహం బింత యావంత వలవ దమ్మాటలు విడువు మని యూఱ డిల్లం బలికి దుర్దశలన లందురు నవ్వోలంది డెందంబు కుందు వాపం దలంచి యిట్లనియె. ౨౩౩

ధర్మజుడు వారించుట లెస్స అయినది అని యిదివఱకు పలికి యున్న భీము డిపుడు ద్రౌపదిమనసు ననుసరించువాడై “కీచకుని సభా తలంబుననే దండింపవలసినది. అట్లుచేయని తప్పుచాలదా” అని పలికి నాడు. తేపెట్లయిన జంపితీరుదును అని ప్రతినజేసినాడు భారతకథా నాయికానాయకులు ద్రౌపదీధర్మరాజులు గాపాడ జూచినను గీచకుని సంహరించెదనని స్పష్టపఱచినాడు. ఇందువలన ద్రౌపదీధర్మరాజులస్వభా వము పోషింపబడిన ట్లయినది. అంతటి యపకార మొనర్చినను గీచకుని సంరక్షింప నెంచునట్టి ఉదారులు వారని చెప్పినట్లయినది. వాడెక్కడి కేగి నను నెల్లవిధముల బ్రయత్నించి తుదముట్టించెదను అనునట్టి నిశ్చయ మాతడు దెల్పినాడు. ‘అడ్డపడెనేని’ అనునది గంభీరమైనపదము. భీమ కీచకులకు మధ్యగావచ్చి ధర్మజుడు నిలిచినను గీచకుని సంహరింప నిశ్చ

యించినా డతడని భావము. మఱియు "నీవ పెంపారు కరుణ గాచితేని" అనునది రసవంతమైనది. ద్రౌపది కరుణగల్గి గాచినను సంహరించు వాడని భావము. దుర్యోధనాదులకు జిలోదక పిండదానములు గావించు టకుగాను ధనము నపేక్షించినాడు ధృతరాష్ట్రుడు. రాష్ట్రమునుండి తీసి ఖర్చుపెట్టుటకు వీలులేదని యువరాజగు భీముడు అడ్డుపెట్టినాడు. అప్పుడు సార్వభౌముడగు ధర్మరాజు, ప్రియసహోదరుడగు అర్జునుడు వారి స్వంతధనము నొసంగిరే కాని రాజ్యమునుండి ధనము తీయు టకు వలనుపడలేదు. భీమనిశ్చయ మటువంటిది. అట్టి నిశ్చయ మిప్ప ట్టున గూడ గనబఱచి కీచకుని సంహరించెద నని ప్రతిన బట్టి నాడు. తిక్కనరచనలో ఒకేపర్వములో బూర్వాపరసంబంధ ముండుట యనునదే కాకుండ అన్నిపర్వములకు నిట్టి పూర్వాపరసంబంధ మేర్ప ఱచుకొనియే భారత మాంధ్రీకరించి యున్నాడు. ద్రౌపది సుదేష్ణా మందిరమున నలుకమై పండుకొనినపుడు "భీముని కవశ్యము దైవబలము గల్గును" అని నిశ్చయించుకొని లేచి భీమునిదరికి వచ్చినది. అట్లే దైవ బలోపేతు డగుచు భీము డీనిశ్చయము గావించినాడని చమత్కారము. ప్రసిద్ధులగు పతివ్రతల చరిత్రములను జేర్కొనుట యీవిషయమును మఱియు బోషించుచున్నది. "ఆ పతివ్రత లిడుమలు పడినను కొసకు సౌఖ్యమే యందియున్నారు. అట్లుగనే నీవును ఆపదల దాటి సౌఖ్య మందగలవు" అని ఓదార్చి పలికినాడు. "చ్యవనునివాంఛను" అను నిచ్చటి సీసపద్యములోనున్న "వాంఛను, కుడువదె" మొదలగుపదములు సాభిప్రాయముగా బ్రయోగింపబడియున్నవి. అవి ఆయాపతివ్రతల చరితముల కనుగుణమగు భావమున నిమిడిపోయినవై రసవంతములై యున్నవి. "అజ్ఞాతవాసదుఃఖమే కాక దుఃఖములన్నియుబోయి సౌఖ్య మందెదవు. నర్తనశాల సంకేతముగ దెల్పి ఒంటిమెయి జనుదెంచులాగున నీవొనరింపుము. ఆసాబగుని నట తుదముట్టించెదను" అనిపలికి భీముడు ద్రౌపదిని బంపివేసినాడు. "తఱిమి కొన్నియడుగులనిచి" అని రచించుట లో ద్రౌపదియొక్క భరింపరాని విషమపరిస్థితి (భీముని సమక్షమునుండి వెడలలేకుండుట) వ్యక్తమగుచున్నది. భీమునియొద్దకు వచ్చువఱకు తల్పం

బుపై మేనువైచి యపాంగంబులం దొరఁగు కన్నీరు చెవుల కొలంకులు నిండ నెవ్వగలు నివ్వటిల్ల దలపోయుచుండినదనియు, భీమునితో బ్రసంగించి వచ్చినపైని "పర్యంకభాగంబునం దనువు వైచి యంకిలిదేఱ నిండె దంబు గొందలంబుతోఁడి నిశ్చయంబు బొరయ నిద్రం బొరయని కన్ను దోయి మొగిడ్చి యుండినదనియు దిక్కన రచియించి యున్నాడు. ద్రౌపది యప్పుడు నిప్పుడు నెట్లున్నదియు (పరిస్థితి లోనిమార్పు) నివి వ్యక్తము చేయుచున్నవి.

మఱునాడు కీచకుడు సుదేష్ణమందిరమున కతిత్వరితముగ నరుగుచు నంతరంగమున నిట్లు దలంచినాడు.

చ. చయ్యన నేఁగి యంబుజవిశాలవిలోచన గాంచి ప్రీతిమై
నయ్యెడ నేకతంబ హృదయం బలరం దగ బల్కి యొక్కమై
నియ్యకొనంగ జేసి యొలయించెద నిక్కకు దార్చి నేర్పునన్
శయ్యకు దెచ్చెదం గుసుమసాయకు పూనికి నేడ తీర్చెదన్. ౨౭౫

ఆనాడే కోర్కె నెఱవేర్చుకొనునిశ్చయముతో గీచకుడు వచ్చినాడు. నాడే వానిని దుదముట్టింప దలపెట్టియున్నది ద్రౌపది. "ఏకతంబ హృదయం బలరం దగబల్కి" అనునది సొగసైనది. అది వాని యభిలాషను, సైరంధ్రి తప్పక వశపడునను నమ్మకమును, గృహామందు బైన (సభాసమీపమున) తగిలిన దెబ్బను సూచించుచున్నది. ద్రౌపదిని డాయం బోయి సామభేద దానదండంబులు సూపి పలికినాడు. తిక్కన యిచ్చట సామాదిస్వరూపము లుట్టిపడునటుల సారస్యమైనవి నాలుగుపద్యములు రచించియున్నాడు. చివరకు దన నిశ్చితాభిప్రాయ మిటుల దెల్పినాడు.

చ. విరటుడు సూచుచుండ నిను వేవుర ముందట నట్లు ద్రోవ నొ
క్కరుడును గాదు కూడ దనగల్గెనె పోటరులైన భర్త లే
వురు గల రంటి వారి యలవుం జలముం గడగంటి నింక నె
వ్వరు గల రెట్లు దప్పె దనివారణ బట్టెద నెందు జొచ్చినన్. ౨౭౬

ఇంటికి వచ్చినది తప్పుకొని వచ్చివేసినది. సభయెదుటనే వాడామెను బట్టుకొని తన్నినాడు. అది నిన్నటి పరిస్థితి. ఈనాడు వానికి

గొంప మునుగునంత మోహము గల్గినది. కీచకు డెట్లయిన ద్రౌపదిని బట్ట తమకించినాడు. కావుననే "నిన్నటిసంగతి చూడు. విరాటాదుల నిస్సహాయస్థితి చూడు. భర్తలపని తెల్లమైనదిలే. నేడు నీవెందు జొచ్చి నను బట్టెదను" అని పలికినాడు. ద్రౌపది "వీడు దమకించియున్నవాడు. నా యంత్రించు మాటలకు మున్న కవియంబడిన గర్జంబు దప్పునని" విచారించి మెత్తబడినయట్లు మెయివడి చూపుగా జూచి హృదయ మెఱింగించు తెఱగున "రహస్యము పాటింపుమా" అని పలికినది. ద్రౌపది యిచ్చట కీచకునితో సంకేత మేర్పఱచు... ...కార్యము సాధింప బడినది. భర్తలను వంచించుట కను... ...యని ద్రౌపది యపేక్షించినది. కీచకు డుపా...గవా...య "ఏయనువు... డెయ్యెడ నిజాభిమతం బొడగూర్తు ...ర" అని పలికినాడు. ...యురులం గీచకుడు దగులుట దెలి... ...రాగా... ...యిట్లు పలికినది



ఉ. ఉత్తర లోనుగాగల పయోజముఖుల్ ...
నృత్తము జేసి పోవ గమసీయరహస్య...నిశీథినీ
వృత్తము గోరువారలకు వేడ్కకు బట్టగు...రదు నాగృహం
బుత్తమ మిత్తెఱంగునకు నొంటిమెయిం దగ నీవు వచ్చినన్. ౨౬౫

"రహస్యము గోరువారల కది ఉత్తమము" అని పలుకుటలో సైరంధ్రి ననుభవించుట కనువైన దది యని కీచకున కర్థ మగుచున్నది. వానిని దుద ముట్టించుట కది తగినదని ద్రౌపది యభిప్రాయము. కావుననే "ఆగృహం బుత్తమ మిత్తెఱంగునకు" అని ద్రౌపది సారస్యముగా బలికినది. "ఒంటిమెయిం దగ నీవు వచ్చినన్" అని పద్యము ముగించుట మఱియు సారస్యముగా నున్నది. అక్కడకు వచ్చినచో సంగతి (మజా) యున్నది అని యుభయులయొక్క వాంఛాపరమావధి అందులో నిమిడినట్లయినది. తనహృదయ మెఱింగించు నెపమున గూడ ద్రౌపది యిట్లే చమత్కారముగ బలికినది.

ఆ. ఇట్లు లగుట యెఱిగి యెల్లభంగుల రహ
స్యంబు గోలుపోనియట్లు గాగ

నడరు నీదుకోర్కి కనురూప మెట్టిది
యట్టి భోగభంగి ననుభవింపు. ౨౬౨

ఇట్టి కోర్కె కనురూపమైన అనుభవమే యచ్చట తిటస్థింపగల దని యిందున్న సారస్యము.

నర్తనశాల కొక్కడ నరుగుదెంచెదనని కీచకుడు పలికినాడు. "నీవాక్కరుండ వరుగుదేరవలయు లేకున్న నయ్యెడ నిలుచుదానగాను జూ నిక్కవంబు" అని వ్రాని పలికినది. ఇంటను, సభయెదుటనుగూడ కీచకుడు త్రుళ్లిపోవునట్లుగా జేసిన ద్రౌపది ముదలకించి యిట్లు పలికినది. ఇచ్చటనున్న "నిక్కవము" అను పదము మిగుల సారస్యమైనది. అందు వలన నెట్లయిన వెడలిపోయెదనేగాని నిలువనుసుమా జాగ్రత్త యని యామె బెదరించిన ట్లయినది. ఇది రసికత్వమును వెల్లడించునదియే యైనను గీచకున కీయపనమ్మకము గలదు. ఇట్టి యపనమ్మకము వానికున్న టుల దిక్కన యిట్లు వ్యక్తమొనరించియున్నాడు.

సీ. పడతి నన్నాఁడ బలికిన భంగిన
నిచ్చమై నిక్కకు వచ్చునొక్కొ
వచ్చి తొల్లిటియట్ల వడి ద్రోచి పోవక
పొలతి యింపెసలార బొందునొక్కొ
తలపోత గలిగి యక్కైలత వచ్చుటకు నొం
డొకవింత పుట్టక యుండునొక్కొ
గంధర్వు లేవురు గల రని చెప్పి న
న్నేలతుక మాటలు నిక్కమొక్కొ
గీ. తెఱవ చిడిముడిపాటు సుదేష్ణ యెఱిగి
వేడ్క బని పంచు టుడిగి రా విడుచునొక్కొ
మదను డింతికి నొజ్జయై మతకములను
నదపు నెఱిగించి నాకడ కనుచునొక్కొ. ౨౬౩

సైరంధ్రినిగూర్చువిషయమై కొంతవఱకు బ్రయత్నించియున్న అక్క సుదేష్ణకుగూడ తెలియకుండు నంతటి రహస్యవ్యాపారమునకు సమ్మతించువాడైనాడు కీచకుడని యిందువలన వ్యక్తమగుచున్నది. ఈ

సందర్భములో ద్రౌపది "ఈవును బొమ్మేనను నాదగుపని చేసెదనని పలు కుట సొగసైన విషయము.

ద్రౌపది తనకును గీచకునకును నడచిన ప్రసంగమంతయు భీము నకు దెల్పినది. దుస్సాధ్యమైన విరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘ టించినందుల కాత డామెను మెచ్చుకొని ధర్మజుడు మెచ్చుకొనునట్లు గా బగ దీర్చెదను అనినాడు. కాని కీచకు డొం ం మెయి రాక కొందఱ దెచ్చిన రహస్యము బయల్పడునుగదా యని విచారించినాడు. అట్లు వాడు చేయడని మరల నిశ్చయించుకొనినాడు. వాని క త్తేజిం బుట్టిన సంతసమును బరికించి భీము డిట్లు నిశ్చయించుకొనినాడు. కోపవేగ మెంత బలవత్తరముగ నున్నను కూ : నసుయ మెలుగక భీముడు విజృం భించడు అనున చేకాక నారభసనుయమును కూడ నుచితానుచితములను, కార్యము లెఱుంగును విచారించును అని తెక్కన యిక్కడ వ్యక్తమొన రించినాడు. కీచకుని దుదముట్టించెదనని పలుకుచున్న యాసమయమున భీమున కుద్రేకము లావైనది. ఉత్సాహపూరితమైన పలుకులు పలుకు టలో హద్దుమీఱి పలుకజొచ్చినాడు. అది గుప్తసాధనమునకు బాధకం బగునని బోధింపదలచి సంచలితస్వాంతయైన ద్రౌపది యిట్లు పలికినది.

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీనికి నెవ్వగ బొంద భూజనులు నింద యొనర్పగ నే నొనర్చు నీ చివ్వకు నీవు నల్కమెయి జేసిన యాపని గూఢవృత్తికిన్ దవ్వగు నేని నియ్యభిమతం బొడగూడియు నిష్ఫలం బగున్. ౨౭౬

పాండవులు చక్కగా గార్యము చేసికొన లేకపోయిరని కిట్టని వారు నవ్వెదరు. నగుబాటు గావించెదరు. ధర్మముకొఱకై పాటుపడు వాడు ధర్మరాజు ధర్మమూర్తి యని పేరొందినవాడు. ఆమ్మహిమోదధికి మనసు గుందించు (మనసును బట్టివేయు) వగ దీనివలన గల్గిపోవును. పుడమిలోగల జనులందఱు మనల నిందుకై నిందింతురు. ధర్మజుని దీక్షను వమ్ముచేసినవారు వీరని నిందింతురు. నేనై తెచ్చిన యీకల హము గూఢవృత్తికి దవ్వగు నేని నిష్ఫల మగును గాన నట్టియిన నీకా ర్యమునే నీవు తలపెట్టకుమా అని ద్రౌపది పలికినది. వృకోదరుని తీవ్ర క్రోధ ముపశమింప జేయుట కనురూపవగు మాటలను చక్కగ నాతని

మనసున కామె యెక్కించినది. "కీచకుని దలపడునపుడు ప్రకాశరహస్య విభేదబుద్ధి నాకొదవునా. అయినను బ్రయత్నించి రహస్యమన్నివిధముల గాపాడుచు దిన్నని యుపాయమున వాని దెగ జూతును" అని భీముడు పలికినాడు. కీచకుని జంపుట లెక్కలోనిది కాదు. రహస్య మెటుల గాపాడబడును అని మొదట పలికినాడు. (౧౮౪) రహస్యమని యుపేక్షించుటే పొరపాటు. ఇక వాని నెట్లయిన తేపు సంహరించితీరుదును అని తరువాత పలికినాడు. (౨౩౨) కీచకవధంబునకుం బూనిన నామనో రథంబు దుదముట్టవలయునని దృఢనిశ్చయమును అటుతరువాత పలికి నాడు (౨౩౫) ద్రౌపది కీచకునితో సంకేత మేర్పఱచుకొనునపుడు చూచి యు దొందరపడక ఓర్చి నేర్పుమై కార్యము సాధింపదలంచియున్నవాడై ఆమెతో నుత్సాహపూరిత వచనములు పలికినాడు. ఈమాటలలో గీచకు డిక బ్రదుకువాడుకాడు. ఎట్లయినను జంపబడును అని తెల్లమైనది. కీచ కుని సంహరించినగాని బ్రదుకుదానను గానని పలికిన ద్రౌపది అట్లయిన నిది నిష్ఫలమగునని పలికినది. ఇట్లుగా ద్రౌపదీభీము లుభయులును ఒకరి వగ మిగులునపు డొక రుచితమును వ్యక్తమొనర్చుచు గార్యము తెలి గుసు నిశ్చయించుకొనిరి. కీచకుని దలపడినపుడు ప్రకాశరహస్యవిభేద బుద్ధి నాకొదవదు. కాని సాధ్యమైనంతవఱకు రహస్యము గాపాడజూచె దను అని భీము డాఖరున తన నిశ్చయమును దెల్పినాడు. అనవసర ముగ దొందరపడువాడుకాడు అను భీముని స్వభావము చక్కగ నెఱిగి యుండిన ద్రౌపది ఇప్పటి భీముని ప్రవర్తనము హద్దు మీఱునది కాదని అతని మాటలవలన, బ్రవర్తనలవలన గ్రహించినది. తిక్కన ఈయభిప్రా యమును వ్యక్తపఱచుటకే చక్కని క్రమము నిట్లుగా నేర్పఱచుకొని కడ కిచ్చోట దానిని సాధించినాడు. "ఎట్లయిన గార్యము నెఱవేర్చె దను. రహస్యమును దైవమే గాపాడును" అను భీముని నిశ్చయమును గ్రహించిన ద్రౌపది "జయలక్ష్మిం జేకొను"మని దీవించినది.

ద్రౌపదితో భాషించి వెడలిపోయిన గీచకుని నవస్థను వ్యక్త మొన ర్చుచు దిక్కన యిక్కడ నాలుగు సీసపద్యములు రచించియున్నాడు. (౧ పొడసూపినట్లయిన ౨ ఇంపైన ప్రియకు ౩ కెంగేలుగేలితో ౪ తని కెడునారటంబున) ఈపద్యము లందొక పాదముకంటె నొకపాదమందు

హెచ్చువిషయములను వ్యక్తమొనరించినాడు. మొదటి సీసపద్యములో సైరంధ్రి "పాదసూపుట, మెలగుట, కదియుట, ఒడబడ్డ నట్టగుట, లలిత వివిధవిహారముల కెలసి పాలయుట అనునవి భావింపబడినవి. ఇది గృహాముందు వర్తించుచున్న కీచకుని వ్యాపారము. మనోవేదన నింక భరింప జాలక మందిరారామభూమికి జనినాడు. అందు వానికి మఱియు తాపము హెచ్చినది. రెండవ సీసపద్యమున నిట్లు వర్ణింపబడినది.

సీ. ఇంపైన ప్రియ కాన నిచ్చి నిల్చిన మధు
వానట నానుమత్తాలివిభుని
జెట్టుల పచరించి చుట్టు గ్రుమ్మరి మనో
రమ నియ్యకొలుపు మరాళవిభుని
ఫలరస మొండొంటి కెలమి జంచుల నిచ్చు
మెయిన జొక్కెడుశుకమిథునములను
గమిబాసి తలిరుజొంపమునకు మెయిమెయి
దాకంగ జను పికదంపతులను
తే. జూచి చూచి యుల్లంబున నేచి కోర్కు
లడర జిడిముడిపడు మ్రానుపడు వెడంగు
పడు వెనుంబడు దల్లడపడు దురింత
చింతబారికి నగపడు సింహబలుడు. ౩౨౬

ఇందు మత్తాలివిభుని, మరాళవిభుని మొదటి రెండుపాదములందు గవి వర్ణించియున్నాడు. మత్తాలివిభుడు ప్రియురాలియెదుట నిలిచియున్నాడు. మరాళవిభుడు చుట్టు గ్రుమ్మరుచున్నాడు. మొదటి పాదములో నున్న "ప్రియకాన నిచ్చు" అనుదానికన్న రెండవపాదమున నున్న "మనోరమ నియ్యకొలుపు" అనునది రసికత్వము నింకను వెల్లడించుచున్నది. మూడు నాలుగు పాదములందు శుకమిథునములు, పికదంపతులు చెప్పబడినవి. అందువలన రసికత్వ మింకను వెల్లడి యగుచున్నది. ఫలరస మొండొంటి కెలమి జంచుల నిచ్చుచున్నవి శుకమిథునములు. అంతకన్న రసికత్వమును వెల్లడించుచు మెయిమెయిదాకంగ జనుచున్నవి పికదంపతులు. ఇవన్నియు గ్రమక్రమముగా గీచకునకు మన్మథోద్రేకమును గల్గించుచున్నవి. గీతపద్యములో గీచకుని యవస్థలన్నియు

వర్ణింపబడినవి. కీచకు డింక నిలువజాలకపోయినాడు. పొదరిల్లు చేరి నాడు సైరంధ్రిని (ఇందీవరనయనను) ఆత్మ నిడికొనినాడు. వాని గుండెలలో నామె నిలిచిపోయినది. మనసు కగ్గములు విడిచినది. కందర్పుడు వెఱ్ఱి చేసినాడు. సైరంధ్రితోడిపొందునే (అందలి ప్రతివిషయమును) భావించుకొని ఉవ్విళ్లూరిపోవుచున్నాడు. కేవలము తలంపులతో వాని కింక సరిపడిపదికాదు. కార్యరూపమున ఫలించిన గాని నిలువజాలడు. అందుల కడ్డుదగిలియున్న కాలమును నిందింప మొదలిడినాడు.

క. మాయురవి యేల క్రుంకడొ
కో యను నిట్టేల తడసెనో యను గ్రుంకం
బోయెడుజా యిప్పుడ యను
దాయపఱిచె నను మనోజతాపము పేర్మిన్. ౩౧౨

క్రుంకడొకో, తడసెనో, పోయెడు జా అను దీర్ఘాంతమైన పదములు కీచకుని విసుగుదలనంతయు వ్యక్తము చేయుచున్నవి.

తే. అనుచు గ్రుంకింపరాని ప్రొద్దరసి యరసి
శిశిరపర్యంకమున మేను సేర్చి చేర్చి
వంత దలపోసి తలపోసి వనరి వనరి
మిగుల వందురి వందురి పొగిలి పొగిలి. ౩౧౪

ఇందు ప్రతివిషయము రెండుపర్యాయములు చెప్పబడినది. అనగా గీచకుడు రెట్టింపు నవస్థలోబడి యింకను నవస్థ నొందుచున్నాడని సూచింపబడినది. 'గ్రుంకింపరాని ప్రొద్దు' అనుదానిలోని 'రాని' అను పదము అనుపమానముగా నున్నది. చేతనైయుండుచో గీచకుడు ప్రొద్దును గ్రుంకింపజేసియే యుండును. అసాధ్యమైన ఆప్రొద్దు వాని నెంతగా బాధించుచున్నదియు నాపదము వ్యక్త మొనరించుచున్నది. పద్యముకొనకు హ్రస్వాక్షరములతో గూడినపదములు రెండేసిపర్యాయములు ప్రయోగింపబడియుండుటచే గీచకుని మదనావస్థనంతయు నవి వ్యక్తీకరించుచున్నవి. "తనికెడు" అను ఈ పైసీసపద్యములో తనవు నింద్రియములు మనము ధృతివశములేనివాడై తల్లడించు చున్నాడని వ్యక్తము చేయబడినది.

గాఢాంధకారము నలుదిసల నల్లుకొనినపైని కృశోదరి (ద్రౌపది)

వృకోదరుకడకు జని సమయమైన దనగానే భీముడు పెండ్లికి పిలిచి నట్లుగా వికచహృదయుడై తలచీర యాయితము సేసికొని బయలు దేరినాడు. ద్రౌపదిని వెంట రప్పించినాడు. నర్తనాగారము సమీపించినాడు. కెలకులు పిఱిందిదెస గలయ బరికించినాడు. తన యఖండిత బాహుబల గర్వమే ముంగలిగా గల్గి భీముడు నిశ్చింతుడై, సతికేలు పట్టుకొని అంధకార బంధురమైయున్న నర్తనశాల మధ్యభాగమును బ్రవేశించినాడు. పెండ్లికి వచ్చినట్లుగా లేచి వచ్చిన భీముడు సతికేలు పట్టుకొని లోన బ్రవేశించినవాడై ఆమెను ఓసరిల నునిచి తా నచ్చట నున్న తల్పంబు జేరినాడు

సింగంబున్న గుహానికేతనమునకు శీఘ్రముగావచ్చు మాతంగము లాగున గీచకుడు పవనపుత్ర స్వీకృతమైన రంగాగారము సేరవచ్చినాడు. భీమసింహ మందు జొచ్చి యున్నందునను, చీకటిమయమైనందునను ఆరంగాగారము గుహవలె నున్నది. "శీఘ్రింబునన్" అని యిచ్చట ప్రయోగింపబడుట సారస్యమైనది. భీముడు నలుప్రక్కలు ఆటునిటు చూచి లోన బ్రవేశించినాడు. రహస్యము బయల్పడునేమో యని శంకించియున్న భీముడు జను లెవ్వరు లేకుండ చూచికొనవలసియున్నది కదా! కావున నాలుగుమూలలు పరికించి పిదప లోన బ్రవేశించినాడు. కీచకున కట్టి భయములేదు. "ఇంతిం గాముం డిటు తేడె" అని తలంచు చున్నాడు కావున శంక యొక్కింతయు లేక లోన బ్రవేశించినాడు. భీమునకు గీచకునకుగూడ బాహుబలము గలదు. భీము డాబాహుబల గర్వమే యిచ్చట ముంగలిగా (దారిచూపునదిగాగ) నొప్పియున్నాడు. బాహుగర్వము స్వాంతము నంధకార మొనరింపగా గీచకు డహంకృతి ముంగలిగా లోన బ్రవేశించినాడు. తిన్నగా "మండపాభ్యంతరభూమిని" జొచ్చినాడు. సెజ్జగాంచి యత్యంత ముదావహాంబగుడు నందు రయంబున గేలుసాచినాడు. సెజ్జ గనుగొనగానే శూన్యముగ లేసికార ణమున వానికి బట్టరానంత మోదము గల్గినది. కావుననే "రయంబున గేలు సాచినాడు." "కేలుసాచినన్" అని ఈపద్య మంత మొందుట సారస్యమైనది. వాడట్లుగా గబీలున చేయి సాచగా భీమునకు ఘనతరమైన కోపముగల్గినది. దానివలన శరీరమంతయు గంపమునొందినది.

విరాటసభలో భీమునకు కీచకునిపై పట్టరానంతకోపము వచ్చినది. కాని అడచికొనినాడు. దాని కాధార మపుడు ధర్మజునివారణ. ఇప్పు డట్లుగా నివారించువా రెవరును లేరు. ద్రౌపదియుండినను ముందునకు రాజాలదు. కాని భీముడు ధైర్య మవలంభించి ఓర్చికొనినాడు. "తనధృతి పెంపు సొం పచలితంబులజేయ" అనుపదము భీముని నుత్తమనాయకత్వమునకు నిదర్శనమై యున్నది అనవసరముగా దొందరపడక నిదానము గల్గి కార్య మనుకూలముగా గొనసాగించుము అని ద్రౌపదికి మొదటిలోనే నమ్మకము గల్గించినాడని సారస్యము.

కీచకాధముడు కిమ్మీరవైరిపై కేలుసాచినాడు. అచ్చటనున్న భీముని సైరంధ్రిగా దలంచినాడు. వానికి మేను గరుపాఱినది. "మనోహరములగు వస్తువులెల్ల వేడ్క నేఁటి నీకని నియమించి తెచ్చితిని. ప్రియమున గైకొనుము. ఎల్లప్పుడు స్త్రీలు నన్నుజూచి వలచి తమచిత్తవృత్తు లేచిన విశిష్టధనములు గొనివచ్చి నాకు లంచము లిచ్చెదరు". అని పలికినాడు. కీచకుడు నర్తనశాల ప్రవేశించినపుడే "ఇంతిం గాముం డిట చేరె" అని తలంచి లోనబ్రవేశించినాడు. వాడు తలంచినట్లుగా ముందుగనే సైరంధ్రి ప్రవేశించియున్నది. పర్యంకమునను న్న భీముని సైరంధ్రిగా దలంచిన కీచకున కప్పు డత్యంతము సంతోషమైనది. కాని రూపాభిమానియగు కీచకుడు సైరంధ్రియే తన్ను నెదురుకొని రసికత్వము వెల్లడించునని తలంచినాడు. కాని యట్లు జరిగినది కాదు. నానాభరణధరణశీలుండగు కీచకు డామె యొసంగిన కానుకను ధరింప నువ్విళ్లూరియుండెను. కాని యట్లును జరిగియుండలేదు. సైరంధ్రి మెదలకుండ పర్యంకమున నుండిపోయినదని కీచకుడు తలంచినాడు. అది తన పరిస్థితికి తగిన సంఘటన గాదు. "నేనై నీకు కానుకలు దెచ్చితిని గాన నన్ను నీవే జయించితివి. లంచము లివిగో ప్రియమున నందికొమ్ము" అని పలికినాడు. తనవంటి సొగసుకాడు, విలాసపురుషు డెంతగా నామెను వాంఛించుచున్నదియు వ్యక్తము చేసినాడు. తానై యింతటిప్రయత్నమేవనిత విషయమున గావించియుండలేదు. ఆవిషయము నే గర్వభూయిష్ఠముగ కీచకు డిట్లు వ్యక్తమొనరించినాడు.

సీ. నాదురూపంబు మనంబున జిక్కిన
    తరుణి దక్కొరు నేల సరకు సేయు
  నాదు లావణ్యంబునకు నిచ్చ మెచ్చిన
    యెలనాగ పైబడ కేల నిలుచు
  నా విలాసంబులు భావింప బడసిన
    యింతి పుష్పాస్త్రుచే నెట్లు బ్రదుకు
  నావివేకమున కానందింప గనినయం
    గన యెట్లు నిలువున గ్రాగకుండు
తే. మెఱయ నాయాడుమాటలు దెఱవపిండు
  నుల్లములకు నింపారెడు నురులు గావె
  యిట్లు నీ వాక్కృతవె నన్ను నేలుకొంటి
  గాక మాట లింకేటికి కమలవదన ౩౩౫

భర్తలను త్యజించకుండ రహస్యము బయల్పడని పొందును సైరంధ్రి కోరినది. తనవంటివానిపొందు దక్కించు కొర్కెలోగూడ నామె యట్లుగా రహస్యమునపేక్షించుట బాగులేదు. కాని రహస్యమున కెట్లో సమ్మతించి వచ్చినాడు. వచ్చినప్పటికిని సైరంధ్రి మెదలలేదు. వానిపై బడవలసియుండెను. కాని అట్లును జరుగకుండుట యేమియు బాగులేదు. పైబడ లేదుసరి. తాను కేలుసాచినపుడే లేచి అనురూపముగు చేష్ట గావింపవలసినది. అందలి విలాసమునైన భావింపకుండుట మఱియు బాగులేదు. విలాసమును భావింపకున్నను తాను పలుకరించినపుడే యంతలి వివేకమును గ్రహించి నిలువున గ్రాగవలసినది. ఆమె లేకపోయినను తానే కానుకను దెచ్చినాడు. గైకొనుమని పలికినను దిరిగిచూడ లేదు. వానిని పుచ్చుకొనలేదు. పోనీ తానన్నివిధముల మాటలాడినను లేవలేదు. ఇది పిసరంతయు బాగులేదు. తనమాటలు దెఱవపిండు నుల్లములకు నింపారెడు నురులు. వానికిగూడ చలనము లేకుండుట సుతరాం బాగులేదు. అని కీచకుడు తలంచి పలికినాడు. "ఇంపారెడునురులు" అనునది కీచకుని సామంతమును, ఆత్మవిశ్వాసమును సువ్యక్తము చేయుచున్నది. సైరంధ్రి రసికత్వ మెఱుగని జడురాలని వాడు తలంచలేదు. ఆమె సరకు

సేయకుండుట, పై బడక నిలుచుట, విలాసములు భావించియు బుష్పాస్త్రుచే బ్రదికియుండుట, నిలువున గ్రాగకుండుట, ఇంపారెడునుపల దగలకుండుట చూచి కీచకుడు మఱియు ముగ్ధు డై నాడు. ఆమెయందలి పరమరసికత్వమున కుప్పొంగినాడు. ఈఅభిప్రాయమునే "ఇట్లు" అను పదము స్పష్టీకరించుచున్నది. "నీవాక్కృతవెనన్ను నేలుకొంటిగాక మాట లింకేటికి గమలవదన" అని పలికినాడు. "నీకోడితిని. నన్నేలయింపుము" అనినాడని భావము. అనగా మాటల కతీతమైన పరిస్థితిని వ్యక్తీకరించినాడని యభిప్రాయము.

క. అనవుడు మనమున నిస్సీ,యని యుచితనిగూఢభంగులగుభాషణముల్
దనప్రియ వినిపించుట కి, ట్లనియెఁ మృదురీతి భీము డాతనితోడన్.

భార్యను జెఱుపవచ్చినాడు. తనపైకి చేయి చాచినాడు. ఇన్ని మాటలాడుచున్నాడు. అప్పుడు భీమునకు "ఛీ" అనిపించినది. మనసులోనే "ఇస్సీ" అనుకొనినాడు. ద్రౌపది వినవలయునని తలచి కొన్ని మాటలు పలికినాడు. అవి మృదురీతిని బలికినాడు. అనగా నాడుదాని కంఠధ్వని పెట్టినాడు. మనసు నిచ్చునట్లుగా గరువతనము ప్రకటించుచు బలికినాడు. ఒడలు మండిపోవుచున్న కఠోరసమయమున నింత ధృతి ధరించియుండుటయే ఉత్తమనాయకుని గంభీర స్వభావము. ద్రౌపది కిది రెండవపరీక్ష నిచ్చినాడు భీముడు.

తే. ఇట్టివాడవు గావున నీవు నన్ను
బొగడికొన దగు నకట నాపోల్కి యాడు
దాని వెదకియు నెయ్యెడ నైన నీకు
బడయవచ్చునె యొఱుగక పలికి తిట్లు. ౩౩౭

క. నాయొడలు సేర్చినప్పుడ, నీయొడ లెట్లగునొ దాని నీ వెఱిగెదు వ
న్నేయబలలతోడిదిగా, జేయ దలంచితివి తప్పు నేసితి గంటే. ౩౩౮

క. ననుముట్టి నీవు వెండియు
వనితలసంగతికి బోవువాడవె యైనం
దనువే బడసిన ఫలమే
కనుయొద విదె చిత్తభవవికారము లెల్లన్. ౭౩౯

"నీవు పలికినదంతయు నిజమే ఒప్పుకొనుచున్నాను. కాని నాలో నున్న ఘనతను నీవు పూర్తిగ గ్రహించి పలుకలేదు. అట్లయిన నిట్టి ప్రసంగము చేసియుండవు. నా యంగస్పర్శచే గల్గు సుఖవిశేషమున నీయెడ లెట్లగునో చూడు మిపుడు దెలిసికొననున్నావు. నన్నితర కాంతలతో సరిపోల్చుడమనునదే తప్పు అని నీవు గ్రహించి యుండలేదు. నన్నుబొంది యింక స్త్రీలమాట (ఇతరకాంతల పొందును) దలంచువాడవా నీవు. తత్ఫలిత మంతయు సుస్మృతివికారముల నెల్ల నీవు కనుగొందువు" అని భీముడు పలికినాడు. మఱియు "అహంకారము గల్గినవాడవు నిశ్శంకగ లోన బ్రవేశించినావు. నన్ను ఆడుదని తలంచుచున్నావు. నన్నుముట్టగనే నీయెడ లెట్లగునో యది యెఱిగెదవుందువు. నన్నుగూర్చి నీవిట్లు తలంచియుండుట తప్పే చేసితివి. నన్ను ముట్టి యింక స్త్రీల సంగతికి బోవుట యొకలా. తనువే అంతమొందుచున్నది. మనమందు గల్గిన వికారముల కెల్ల శాస్తి ననుభవించి మడియనున్నావు" అని ధ్వనిగల్గునట్లుగా భీముడు ప్రసంగించినాడు. ఇట్లు పలుకుచు భీముడు తటాలున లేచినాడు. ఆతని రోషకఠినమౌ హాసము కీచకున కుద్వేగము గల్గించినవి. "రోషకఠినంబౌ హాస మా సూతునెమ్మన ముద్వేగము బొందజేయు" అనుటలో ఆహాసము భీమునియందున్నటుల చెప్పుటలోగంటె అవి కీచకునియం దెట్లు ప్రతిఫలించినదో-కీచకుడు తటాలున నెట్లయినాడో (అంతగా శృంగారము వెలిగించినవాడెట్లు చివుక్కుమనినాడో) అది వ్యక్తము చేయుటలో సొగసున్నది. అది రచనాచమత్కృతియై యున్నది. బృహన్నల అడ్డాదిడ్డముగా సారథి వేషము వేసుకొనునపుడు గూడ తిక్కన యిట్లే రచించియున్నాడు.

క. తెప్పించి తొడుగు మీా వసి
యొప్పించిన నిట్టు నట్టు నెఱపలుగా మై
గప్పికొని యా బృహన్నల
యప్పుడు నగుపించె నచటియబలాజనమున్. ౪-౩౯

బృహన్నలచేష్టలు అచటి యబలాజనముల నగిపించినవని సారస్యముగ రచించినాడు.

భీముడు కీచకుని దలపట్టి వంచినాడు. వా డనుమానింపక చె

ట్టదల్చికొనినాడు. కోపాటోపదీప్తాంగుడై నాడు. గంధర్వుడు వచ్చినాడని తలంచినాడు. తనయగపాటొరులెఱుగుదురని సూతుడు, సమయభంగమగునని భీముడు గొంకుచు చప్పుడు చేయకుండ పోరుచుండిరి. లోగడ భీముడు మల్లునితో బోరినాడు. ఇపుడు కీచకునితో బోరుచున్నాడు. మల్లయుద్ధము వేడుకగను, కీచకయుద్ధము కావేషముగాను తిక్కన భిన్న రీతిని రచించియున్నాడు. కీచకుడు సరియని యెప్పుడు వినియెదను అని తల్లడపడుచున్న ప్రియవనితకు "కీచకుడు చచ్చినాడు" అని మొదట దెలియజేసినాడు. పిదప వానిని జూప నెంచి గాఢయత్నమున నిప్పు దెచ్చి వెలిగించినాడు. అచ్చెరువు భయము ప్రియము పెనగొనగా నామె కీచకుని జూచినది. భీము డాయగా జని చూచుచు వ్రేల్మిడిచినది. తల యూచినది. విలక్షించి తగ్గెనది. ముక్కుపై వ్రేలుంచుకొని "కీచక యింక సుఖింపుము. అట్టుగా మిడిసిపడిన శాస్తికాకుండునా" అని పలికినది. వెఱగందినది. ఇచ్చట ద్రౌపదినిగూర్చి "భీతమృగేక్షణ, చపలాక్షి" అను రెండుపదములను కవిబ్రహ్మ ప్రయోగించి యున్నాడు. భీతమృగేక్షణ చచ్చినకీచకుని గాంచినదనియు, చపలాక్షి అనూంసపిండమును (కాలు చేతులు గానరాక ఒక్క పేముద్దగానున్న కీచక కళేబరమును) అటునిటు చూచుచు వెఱగందుచున్నదనియు భావము. పూనిక నెఱపితి, సతియవమానము పరితాపభరము నిపుడు మాన్పితిని అని లోన నుప్పొంగుచున్న వృకోదరు డుత్సాహపూరితమైన వాక్యములు పలికినాడు. "చింతాశల్యము వాసెనే" ఈ మొదలగునవి పలికినాడు. ద్రౌపదియు భీముని నవలోకించి మనమందు నిండారిన సమ్మోదము వెలివిరిసి చెరయగా నాతని యుత్తమనాయకత్వమును గొనియాడినది. "ఇట్టి ధైర్య మహిమ యెందును జూడలేదు. (చూడజాలను) గౌరవము దలపోయలేను. సాహసము మెచ్చజాలను, సొంపు స్తుతి యొనర్పజాలను. మహిత విస్మయానందనిర్మగ్ననైతిని." అని పలికినది, ద్రౌపదియొక్క ఈ పలుకులాతనికి కర్ణరసాయనములయినవి. ఇంక తడయంజనదని పలికి చయ్యన నేగినాడు. "తడయజనదు" అని భీమునినోట బలికించినాడు తిక్కన. రహస్యమును గాపాడుట కాత డెంత జాగరూకుడై యుండినది యిందు వలన వ్యక్తమగుచున్నది

# తిక్కన విరాటపర్వము

## తృతీయాశ్వాసము

---

భీముడు మహానసమందిర పరిసరమున శరీర ప్రక్షాళనము సేసికొని యనులేపనమున నస్పృగ్గంధ ముడిపికొని కృతకృత్యుడై శయ్యాతలంబున గూర్చుండెను. భీము డియంతయు గావించుమేర కూరకొనినది ద్రౌపది. భీమసేను డింతకు వంటయింటికి బోయి నిశ్చింతమున నుండునని నిశ్చయించి నర్తనశాల వెలునడినదై ద్రౌపది కావలివారల బిలిచి "నాపతులచే సింహబలుడు మడిసినాడు" అని తెల్పినది.

ఆ. వారు సంభ్రమించి వడి గోలదివియలు
గొనుచు నులివు మిగుల గూడబాఱి
నృత్తశాల జొచ్చి రక్తతటి నాకల
కల మెఱింగి కీచకవ్రజంబు. 3.8

ఉపకీచకులు బంధువులువచ్చి కీచకుని చూచిరి. బంధువులు కీచకుని నిందించిరి అని వ్రాసి తిక్కన యిక్కడ వాడు పౌరకంటకుడేగాక బంధువులకుకూడ నసహ్యముగ నున్నాడని వ్యక్త మొనరించినాడు. వాడెంత దుర్మార్గుడుకాకపోతే వానిబంధువులు శవ ముండగనే నిందింప దొడంగెదరు అనునది యిచ్చట సువ్యక్త మొనరించియున్నాడు. అందఱును శోక విస్మయపరీత చేతస్కులైరి. ఉపకీచకులు ద్రౌపదిని జూచి సంజాతమహోగ్రకోపులైరి. బలవంతపఱిచి విరాటునివద్ద ననుజ్ఞబొందిరి. ద్రౌపదిని గీచక శవముపై కట్టివేసి పరేతభూమికి బయలువెడలిరి. ఇచ్చట "చారువిలోచన, పాండుపుత్రాంగన" అను రెండు పదములను దిక్కన వాడియున్నాడు. "చారువిలోచన" అనునది సైరంధ్రియొక్క దైన్యావస్థనంతయు, నుప కీచకుల క్రూరత్వమును వ్యక్తీకరించుచున్నది. "పాండుపుత్రాంగన" అనునది ద్రౌపదియొక్క పరిభవమునంతయు వ్యక్తీకరించుచున్నది. ఎంతటి మనోజ్ఞమూర్తి. ఎంతటి ఉత్తమురాలు ఎంత పరిభవమునకు బాల్పడినది

అనునది ఆ రెండుపదములు వ్యక్తీకరించుచున్నవి. ద్రౌపది భయభ్రాంత చిత్తయై బాష్పజలోద్గతి మొగము గప్ప గట్టిగా నాక్రందన మొనరించినది. భర్తల బేర్కొని మొఱలిడినది. "ఆనతవైరి యోజయ" అను పద్యమున "జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బల" అను పదములకు సార్థక్యము గనబఱుపబడి యున్నది. భీముడీ యెలుగు వినినాడు. "నాభార్యకు మఱియు వీరింత పనిచేసినారా" అని యనుచు రోషమొంది వేగ నగడ్త దాటిపోయి వృక్షమొకటి పెఱికి ఉపకీచకుల యెదుటకు వచ్చిపడినాడు. అదిచూచి వారు ముందడుగిడక నిలిచిపోయిరి. "గంధర్వుడిదె ముట్టుకొనిరి. ఇకేమి గతిరా బాబూ" అని భయపడి నలుదిక్కులకు పఱుగిడిరి. అందందుదాగిరి. ఉపకీచకులు ద్రౌపదితోగూడ కీచకశవమును అట దబ్బాటున నెత్తివేసి పురముదిక్కున బాఱజొచ్చిరి. వారినందఱను భీముడు నుఱుమాడినాడు. ద్రౌపదిని విడిపించినాడు.

ఈవార్త విని విరాటుడు చకితచేతస్కుడైనాడు. సహోదరమరణ శోకాయత్తచిత్తయయిన జీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించినాడు. ఇంకనెట్లయిన సైరంధ్రి నంతిపురమునుండి బంపివేయుము అని పలికినాడు.

ద్రౌపది సచేలస్నాన మాచరించినది. పురము సొచ్చి రాజవీధిని బోవునపుడు పురజనులు పలువిధముల వెఱగందిరి. వారి భయమును జూచిన ద్రౌపదికి నవ్వు వచ్చినది. అంతరంగమున నిండిన హాస్యరసము ముఖమున బ్రకటితము గాకుండ జేసినది. మహానసగృహమున యథాస్థితిని నిలిచిన భీమసేనునకు గృతజ్ఞతను దెలిపి సల్లాపరసము ననుభవించుచు అంతస్స్మితకమనీయకపోల యగుచు నర్జునునితోడ బ్రసంగించినది. సమ్మదపూరమునకు గలువతనమను బలితంపుగట్టవెట్టి ధీరయై యేమియు నెఱుగనిదివోలె వికృతిలేక అంతిపురము ప్రవేశించినది. సైరంధ్రిని జూడగనే సుదేష్ణకు భయము శోకము గల్గినది. వినయము చూపినది. దగ్గఱ ఉనిచికొనినది. ముఖము నవలోకించి పలికినది. ఇక్కడ చూపిన వినయము మొదలగునవి ముఖముచూచి పలుమాట లాడుటకే అని భావము.

తే. నీవు దక్కనిదానవు నెలత ధైర్య
రహిత చిత్తులు మగవారు రాజు దీని

దలచి భయమంది నిన్ను నీ వలచునెడకు
నరుగు నట్లుగ బ్రార్థించి యనుపుమనియె. ౫౯

"ప్రార్థించి" అను పదము విరాటాదుల అసహాయస్థితిని నంతయు వ్యక్తీకరించుచున్నది. సుదేష్ణ భర్త తెల్పుమన్నది అట్లే మనసు నెట్లో పట్టుకొని పలికినది. కాని మరి యాగలేకపోయినది. అనుజవియోగతాప ముత్కటమైనది.

క. బిరుదుగల మగలు గలరని
తెరమిడి చంపింపజూచెదవు జనములు నీ
పొరువున బో వెఱతురు మా
పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మెం దైనన్. ౬౧

ఈపద్యము ప్రతిపదమునందును నామెకు వొచ్చిపోవుచున్న తాపము స్పష్టపడుచున్నది. మాపట్టణము విడిచిపొమ్ము అని పలికినది. అంతతో నాగక మారాష్ట్రమునుగూడ విడిచిపొమ్ము అని పలికినది. "పొమ్మెందైనన్" అనునది అంచున "ఎందైనన్" అనునది సుదేష్ణ అసూయనంతయు వ్యక్తీకరించుచున్నది. సైరంధ్రి యింక పదుమూడుదినములు వ్యవధికోరినది. సుదేష్ణయు నందులకు సమ్మతించినది.

దుర్యోధనునివేగులవారు పాండవులను అంతట వెదకి కను గొనజాలక సంకేతస్థానమున గలిసికొని హస్తిపురము ప్రవేశించిరి. తిక్కన యిక్కడ అనుపమానమైన సీసపద్యమును వ్రాసినాడు. అందు "సహజమైన యలంకారమహిమ నతిశయిల్లి మహనీయవైభవ మెసక మెసగ వరలు నరపతి మందిర ద్వారభూమి" అని రచించినాడు. దుర్యోధనుని మందిరద్వారభూమియందు సహజమైన అలంకారము లొప్పి యున్నవని వ్రాసి దుర్యోధనుని ఐశ్వర్యవిశేషము నంతయు వ్యక్తమొన ర్చినాడు. వచ్చిన చారు లందఱు జయజయశబ్దపూర్వకంబుగా సాష్టాంగ దండప్రణామంబు నేసిరి.

క. మొగిచిన చేతులు ముందల
నిగిడించి నితాంతవినయ నిరతిం జారుల్
దగ విన్నవించి రిట్లని
జగతీశ్వరునకు నిజ ప్రచారం బెల్లన్. ౭౦

"మొగిచినచేతులు ముందల నిగిడించి" అనునది ప్రభువుల యెదుట భటులుసూపు నితాంత వినయమును వ్యక్తమొనరించుచున్నది. మొదట చేతులు మొగిచిరి. ఆ మొగిచిన చేతులు ముందల నిగిడించిరి. కావుననే నితాంతవినయనిరతి నిజి వ్యక్తీకరించుచున్నది.

ఆ. పరగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు
ప్రాసుప్రాను దుర్గమంపుజోటు
దుర్గమంపుజోటు దొనదొన గుహాగుహా
యాదిగాగ నెందు నరసి యరసి. 3

వేగులవా రన్నిచోట్ల మఱియు మఱియు వెదకిరి. ఈపద్యమున ప్రతిపదము రెండుపర్యాయము లుచ్చరింపబడినందున వారెంతగా బ్రతిచోటును గాలించియున్నదియు తెల్లమగుచున్నది. "దుర్గమంపు జోటు" అనుపదముపైన "దొనదొన, గుహాగుహా" అను రెండక్షరముల పదములను అందున ప్రాస్వాక్షములను రచించుట అర్థగాంభీర్యమును దెల్పుచున్నది. పద్యాంతమందున్న "అరసి అరసి" అనునది మఱియు నన్వేషదీక్షను వ్యక్తమొనరించుచున్నది. "ఎచ్చట నెట్లుగా నన్వేషింపవలయునో అట్లుగా నన్వేషించితిమిగాని పాండవులజాడ మాకెఱుకపడలేదని తెల్పినారు. కీచకోపకీచకుల అద్భుతమరణమునుగూర్చి దెల్పిరి. అప్పుడు దుర్యోధనుడు మంత్రాలోచన మొనరించినాడు. విరాటనగరముపై దండెత్తుటకు నిశ్చయించినారు. "విరాటునిపై నెత్తిచని అతనివెనుక బఱతెంచు పాండురాజసూనుల నెల్లభంగి నరయుదును" అని త్రిగర్తాధిపతి సుశర్మ పలికినాడు. దుర్యోధనుడు "ముందుగా సుశర్మ పోయి విరాటుని గోవుల బంధించి యుద్ధ మొనర్పనిండు. ఆవెనుక కౌరవులును గొన్ని యావులను బట్టినచో పాండవు లవశ్యము గయ్యమునకు బఱతెంతురు" అనిపలికినాడు. ఇందువలన గౌరవమంత్రాంగమందు పాండవు లుత్తరగోగ్రహణమునకే వత్తురని ఊహించినట్లు తెల్లమగుచున్నది. దక్షిణగోగ్రహణమున భీమాదులను సుశర్మ కనిపెట్టకుండుటకు (పోల్చకుండుటకు) ఇది యొక హేతువుగ దిక్కన కల్పించియున్నాడు.

పూర్వపు కావేషమును బురస్కరించుకొని సుశర్మ యుద్ధమునకువెడలి దొంగపాటువవచ్చి విరాటుని గోవులను దొంగిలించినాడు.

(3-౧౩౨ వచనము) గోపాలకు లావృత్తాంతమును విరాటున కెఱిగించిరి. ఆత డదిరిపడినాడు. వీరాలాపములు పలికి యుద్ధసన్నద్ధుడైనాడు. ఇక్కడి "ఏమీ నిక్కమె" అనుశార్దూలవిక్రీడిత వృత్త మాతని వీరాలాపములను చక్కగా దెల్పుచున్నది. అనేకపర్యాయము లోడి చనినవా డిపు డిట్టి తెంపుసేయుట కోర్వక విలుచుకొని పడుచున్నాడు విరాటుడని యింపు తిక్కన ధ్వనింపజేసినాడు. "శతానీకుడు, మదిరాశ్వుడు, సూర్యదత్తుడు, శంఖుడు" వీరు యుద్ధసన్నద్ధులైరి అని తెల్పుటలో తిక్కన ఆపేళ్లు కనురూపమైన వర్ణన గావించియున్నాడు. ఆవర్ణన లాపేళ్లను సార్థక మొనర్చునట్టివై యున్నవి. (3-౧౪౬-౧౪౯) యుద్ధవిజృంభణసమయమునకూడ నీసార్థక్యమును జూపుచునే తిక్కన పద్యములను రచించియున్నాడు. (3-౧౭౨-౧౭౭) నిదానించి చూచిన ఆపోలికలు (నామమునకు వర్ణనకు నుండుపోలికలు) సుస్పష్ట మగును. ధర్మరాజు తమకును యుద్ధప్రసక్తి గల్గింపుమని విరాటుని గోరినాడు. విరాటు డందులకు సమ్మతించి శతానీకున కాజ్ఞాపించి రథాదిపరికరముల నిప్పించినాడు. కాని రథచోదకులు లేనందున పాండవులు "సూతకృత్యంబులకుం దారచాలి రథంబులు దోలికొని చనుదెంచిరి. ఉత్తరగోగ్రహణసమయమున సుశర్మునకు [illegible] నొక్కడు గూడ సారథి లభించలేదు అనువిషయమునకు మఱియు నందము గూర్చువాడై తిక్కన యిచ్చటనే దానిబీజమును వేసినాడు. కాని యిచ్చట నొక్క చిక్కుకలదు. విరాటుని రథికుల కందఱకు సారథు లుండిరి. ధర్మజ భీమ నకుల సహదేవులకు మాత్రము సారథులు లేకుండిరి. ఇది వింతగ దోచి పాండవులు బయల్పడుటకు హేతువు కావచ్చును. ఈ చిక్కును గప్పిపుచ్చుటకై తిక్కన యొకచమత్కారము చేసినాడు. "సారథి నొచ్చిన దేరును గడపుచు నేయుచు గయ్యంబు సేయువారు (3-౧౭౧) అని వ్రాసినాడు. యుద్ధము కొంతసేపు జరిగిన పిమ్మట కొందఱు రథికులు సారథులు చాలనివారై రథములు తామే గడపుకొనుచు యుద్ధము చేసిరనియు నప్పుడు పాండవులుకూడ పైకి దోచి యుద్ధ మొనర్చిరనియు తిక్కన తెల్పినాడు. మఱియు యుద్ధము క్రమముగా ఘోరమైనది అని తెల్పుట కొకపద్ధతిలో వర్ణించినాడు. మొదట శరయుద్ధము ప్రారంభమైనది. పిదప భటులు పోరిరి. శరయుద్ధముకంటె భటులయుద్ధము సన్ని

హితమైనదని భావము. పదాతిసైన్యము, అశ్వికసేన, గజబలము, రథికులు రథికశ్రేష్ఠులు యుద్ధమొనర్చిరి అని క్రమముగా వర్ణించినాడు. చతురంగ సైన్య మిట్లు విజృంభించగా దక్కిన దొరలును దలపడిరి. (వీరును చతురంగ బలములోనివారేగాని వేఱుకాదు.) అనుజతనూజ మంత్రిసుభటాప్తజన ములపోరు సూచి నెమ్మనమున బొంగినవాడై మత్స్యమహీరమణుడు మై పెనిచి ఉత్సాహియై యుద్ధమునకు దలపడినాడు. మైపెనిచి అనుచోట విరాటునిగూర్చి మత్స్యమహీరమణుడు అనుపదము వాడబడుట గమ నింపదగినది. మత్స్యము మైపెనిచినట్లుగా విరాటుడు చుఱుకుగా నున్నా డని సారస్యము. కనుచీకటిలోగూడ నుభయబలములు మచ్చరించి పోరాడినవి. అంతట గాఢాంధకార మలముకొనినది.

క. తనమనుమలు పాండుతనయు
లని సేతకు వేడ్కసేయు టాత్మ గని తమం
బున వారు మెఱయ రని వ
చ్చిన క్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్. ౧౯౨

పాండవులు విజృంభించుటకు కాల మనుకూలమైనదని చమత్కా రము. ద్రౌపది విషయమునగూడ తిక్కన యిట్లే రచించియున్నాడు.

క. అంతం గుంతీనందన
కాంతాచింతా మహాంధకారముతో న
త్యంతంబు మచ్చరించెనొ
సంతమసం బన ప్రభాతసమయం బయ్యెన్. 3-3౫

ద్రౌపదికి గల్గిన చింతపోవువఱకు (కీచకోపకీచకులవధ జరుగువఱకు) చీకటియుండినదనియు, నది పరిసమాప్తి నొందిన పిమ్మటనే ప్రభాతసమ యమయిన దనియు సారస్యము. "మచ్చరించు" అను పద మీయభి ప్రాయముననే వ్యక్తమొనరించుచున్నది. ప్రభాతమని చెప్పక ప్రభాత సమయమని చెప్పుట మఱియు సారస్యమైనది. ప్రభాతమగుటకు దగిన కాలము వచ్చుసరికే భీముడు కార్యమును ముగించినాడని భావము. "అరుణ కిరణుం డుదయించె నట మున్న పాంచాలి సచేలస్నానంబు సేసి" అనునది ఈయభిప్రాయమును మఱియు స్ఫుట మొనరించుచున్నది.

చంద్రోదయానంతరము యుద్ధము ప్రారంభము కాగానే సుశ

ర్మయు దదనుజుడును విజృంభించిరి. సుశర్మ విరాటుని విరథుని గావించి బంధించుకొని పోవుచుండెను.

చ. అతిరభసంబుమై నడరి యాతని బట్టి సుశర్మ పెల్చునా
ర్చి తనరథంబుపై నిడి యశేషబలంబులు నగ్గలింపఁగా భయ
ద్రుతగతి బాఱినఁ గని విజయదుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతి విభవంబునన్ మది సుఖం బొలయంగ మరలెన్ మహోద్ధతిన్.

వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరంబగు చిత్తంబుతో మత్స్యవిభునివలనను సూపుచు నిట్లనియె. ౨౦౩

పలుమాఱు పరిభవము నొందియున్న సుశర్మ పూర్వపు కావేశము నంతయు దీర్చుకొనుచు విరాటుని బంధించినాడు. సుశర్మయొక్క అట్టహాస మునంతయు పై పద్యము ప్రస్ఫుట మొనరించుచున్నది. “పెల్చునార్చి” అనునది సుశర్మ అట్టహాసము నంతయు దెల్పుచున్నది. తిక్కన “ఆర్చి” అనుపద మిచ్చట సాభిప్రాయముగా బ్రయోగించినాడు అట్లుగా నార్చి సుశర్మ విరాటుని తనరథమున్పై నిడికొనినాడు. ఉపకారమునకు బ్రత్యుప కారము సేయదలంచినాడు ధర్మజుడు. అజ్ఞాతవాస మింకను కొలఁది యుండగానే అట్టి సంకటము తటస్థించినది. అయినను ధర్మజుడు సాహ సించినాడు. ఇట్టి పరిస్థితిని ఊహించియే యుద్ధభూమి కాతడు వచ్చి యున్నాడు. కావుననే తిక్కన యిక్కడ ధర్మరాజునిగూర్చి “ధర్మతన యుడు” అని పేర్కొనినాడు. వేవేగ విరాటుని విడిపించు శక్తిగలవా డని తెలుపుటకు “అనిలనందను” డనుపేరుతో భీముని పేర్కొనినాడు. తిక్కన పలుచోట్ల సాభిప్రాయ మగుపదముల నిట్టే వాడియున్నాడు. అవి దగ్గఱిసంబంధమునో, దూరపుసంబంధమునో సూచించుచు అంద గించుచున్నవి. “సత్వరంబగు చిత్తముతో” అనునది ధర్మజుని ఆత్ర మును వ్యక్త మొనరించుచున్నది. తమ కంతగా నాశ్రయ మొసంగి యున్న విరాటుడు తమకండ్లయెదుటనే బంధింపబడినాడు. రాజ్యపీఠ నుడు, నిరాశ్రయుడు అగుచున్నాడు. ఆశ్రితరక్షాదక్షు డగుధర్మజు డట్లు కాకూడదని తలంచినాడు. అందువలన నాతనిచిత్తము సత్వరమైనది. “మత్స్యవిభునివలనను సూపుచు” అనునది యీ యభిప్రాయమునే యింకను ప్రోద్బల మొనర్చుచున్నది.

తే. ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి
యున్నవారము గావున నుగ్రరిపుల
పాలు వడకుండ విడిపింప బాడి యితని
నెయిదు మెయిదము రథరయ మెసక మెసగ. ౨౦౪

తనయభిప్రాయమును ధర్మజు డాత్రముతో దెల్పినాడు. "పాడి" అనుపదమిందు సరసమైనది. నాకేకాక మనకందఱకును నిది విహితకృత్యమే అని భీమునకు దెలియబఱచినాడని భావము. పద్యమున నింతవఱకునున్న ఆత్రముకంటెవిశేషించిన దాత్రము అనునది పద్యాంతభాగమున దెల్పబడినది. పద్యాంతభాగమునున్న ద్విరుక్తి పదములు దీనిని వ్యక్త మొనరించుచున్నవి. "ఎయిదు మెయిదము" అనునదే విశేషాత్రమును దెల్పుచున్నది. ఇంతకన్న "ఎసక మెసగ" అనునది మఱియు నాత్రమును స్పష్టీకరించుచున్నది. మహాబలనందనుడు (భీముడు) మేను వెంచి "ఈసాలవృక్షముచే నరాతిసేన డొల్లనడిచి విరాటుని విడిపించెదను" అని పలికినాడు.

తే. నీవు దమ్ములు నొక్కెడ నిలిచి చూచు
చుండు డని పల్కుటయు బుయిలోటతోడ
గీచకారాతి దప్పక చూచి నగుచు
నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు. ౨౦౬

విరాటసభలో గీచకు దురాక్రమము జూచిన భీముడు తటాలున విజృంభించగా ధర్మజుడు సన నయనాకారంబున వారించి యది తగదని యొఱిగించినాడు. విజృంభణమును బ్రోత్సహించక వారించినా డపుడు. అది వారించవలసిన యవసరముగాన నట్లు చేసినాడు. ఈయుద్ధమున బయల్పడుదు మనుభీతి వారి కంతగా లేదు. ధర్మజుడు ప్రోత్సహించిన పైని భీముడు విజృంభించువాడుగా రచింపబడుట బహు రసవంతముగా నున్నది. పై రెండు సంఘటనలందు భీమునిరీతిని వేఱువేఱుగా దిక్కన రచించి కావ్యశోభను గూర్చియున్నాడు. విరాటసభలో ధర్మజునికంటె భీముని విజృంభణమే తగినది. ఇచ్చోట ఆశ్రితరక్షణ మనునది (ఆశ్రయ రక్షణ మనునది) ధర్మజునిదే ప్రాధాన్యమైనది. కావుననే ధర్మజాజ్ఞానంతరమే వృకోదరుని విజృంభణము జరిగినది. ఇందు కనుగుణముగా

నించుక సావకాశము గల్గినవాడువలెనే "ఈసాలముతో వైరిబల విజృంభణము మాన్పుదును" అని ధర్మజునితో బలికినాడు. సాలవృక్షమున మర్దింతును అని భీముడు పలుకగానే ధర్మజుడు పుయిలోటతోడ జూచి నగుచు బల్కినాడు. ధర్మజునకు నగుపాటి అవకాశమును గల్పించినాడు కవిబ్రహ్మ. "కీచకారాతి దప్పక చూచి నగుచు" అని సాభిప్రాయముగా వ్రాసినాడు వృక్షమును దిలకించగానే ధర్మజునకు గీచకారాతియైన భీముడు స్మరణకు వచ్చినాడని సారస్యము.

ధర్మజు నాదేశానుసారము భీముడు లోకసామాన్యాయుధముల గొని విజృంభించినాడు. నకుల సహదేవులును, ధర్మజుడును విజృంభించిరి. అంతవఱకు విజృంభించక విరాటుడు బంధింపబడగానే విజృంభించుట జూచి వారు పాండవులై యుందురని సుశర్మ ఊహింపవలసియున్నది. కాని యట్లు గ్రహింపకుండుట కనేక హేతువులను తిక్కన కావ్యారంభమునుండియు జాగ్రత్తగా లిఖించియున్నాడు. ధర్మదేవతావరము ప్రధానవిషయము. విరాటనగరపరిసరమందు ఉన్నరూపున ధర్మజునకు సన్న్యాసిరూపమలవడినది. అట్లే భీమాదుల కొనగూడినది. (౧ ౧౦౮) అని రచించినాడు. దైవవశమున పాండవులకు మాఱురూపములు గల్గినవిగాన మానుషబుద్ధి పనిచేయలేదనియు మనుష్యనేత్రములు కనుగొనలేకపోయినవనియు భావము. సుశర్మపై విజృంభించినవారు అయిదుగురుగాక నలుగురుగా నుండుట మఱియొక హేతువు. ఆనాడు పగటిపూట జరిగిన యుద్ధములో విరాటసైన్యమే విజృంభించినదిగావునను చంద్రోదయానంతరము యుద్ధము ప్రారంభములోనే సుశర్మ విరాటుని బంధించినాడుగావునను పాండవు లప్పుడే (విరాటగ్రహణానంతరమందే) విజృంభించిరి అని తలంచుటకు వీలులేదు. ఈ భావము స్ఫురించుట కవకాశము లేనిరచన తిక్కన గావించి సొగసు గూర్చినాడు. చంద్రోదయానంతరము యుద్ధము కొంతసేపు తీక్ష్ణమై విరాటసైన్య మోడిపోవుసపుడు (వెనుదిరుగునపుడు) విరాటుడు బంధింపబడినాడు అని ఇట్లుగా (ఈ మొదలగు) నవకాశ మున్నట్టుల రచింపక చంద్రోదయము కాగానే గుప్పున ప్రమాదవశ మనునట్లు విరాటుడు బంధింపబడినాడు అని రచించుటలోనే ఈ

లౌకికము—రచనాగాంభీర్యమున్నది. సారథులు లేనివారై సాధార ణులవలె పాండవు లప్పు డుండుటయు నొక హేతువై యున్నది.

పాండవవిజృంభణసమయమున విరాటున కుత్సాహము గల్గినది. జనితోత్సాహుఁడైన విరాటుఁడు సుశర్మ తేరునందున్న ఘనగదాదండ మెత్తికొని ఉటికి సుశర్మను వేసినాఁడు. ఉపకారమును స్మరించుచు విరా టుఁడు పాండవులను బ్రశంసించినాఁడు. ''ఈవంటలవాని పరాక్రమము, ఈ నలువురుదక్కఁగ'' ఈ మొదలగునవి ఆనలువురు ఆయూరికి క్రొత్తవా రనునది వ్యక్తమొనరించుచున్నది. ఈ అభిప్రాయమును గప్పిపుచ్చుటకై "ఉపకారమొ, బంటుతనమొ" అని విరాటునిచే బలికించినాఁడు. "మమ్మె రవుగా దలంచియియ్యెడ నిట్టట్టన వలవదు"అని ధర్మజునిచే బలికించినాఁడు. వీటివలన వా రాయూర చిరకాలమునుండి యున్నవారని సూచింపబడి నది. వెనుకటి యభిప్రాయము కప్పిపుచ్చబడినది. అయిదుగురుగాక నలు గురుమాత్రమే యచట నుండుటచే ననుమానమున కాధారము చాలి యుండలేదు. పోలిక స్పష్టమైన తరువాత "మీరు పాండవులు" అని చెప్పవలసినదేగాని ముందుగా సుశర్మ యేమనగలఁడు. తెల్పినప్పైని వారు పాండవులని తేలకుండినచో నాయవస్థ మరణముకంటె, ఓటమికంటె హీనమగునుగదా. అదిగాక ఓడినవాఁడై సగము చచ్చినట్లున్న సుశర్మ లజ్జావనతాననుఁడై యున్నాఁడు. కావున సుశర్మ పాండవులను గుఱుతిం చుట కవకాశ మేర్పడలేదు. తా నవశ్యము గెల్తు ననుచు పూర్వపు కావేషముతీర్చుకొనవచ్చిన సుశర్మకుశృంగభంగ మేర్పడినది. నిరుత్సాహు డై నాఁడు. అట్టి సుశర్మ ఘనమైన దైవరక్షగల్గియున్న పాండవుల నెఱుంగ లేకపోయినాఁడు. ప్రమాదవశమున విరాటుఁడు దొరికిపోయినాఁ డనునది చమత్కారము. అట్లే సాధారణులవలెనున్న ధర్మజభీమాదులకు సుశర్మ దొరికిపోయినాఁ డనునది యింకొకచమత్కారము. మెఱుపుయుద్ధమైనదని చమత్కారము. విరాటుని విజయఘోషపురమున జాటింప జంఘాలురను బంపిరి. విరాటాదులు చంద్రికాసుందరంబగు నొక్క సైకతస్థలంబున నారాత్రి వుచ్చిరి.

---

# తిక్కన విరాటపర్వము

## చతుర్థాశ్వాసము



సూర్యోదయానంతరమున కౌరవులు ఉత్తరగోగ్రహణము చేసిరి. గవాధ్యక్షుడు వచ్చి ఆసంగతిని దెల్పి ఉత్తరుని యుద్ధమునకాయత్తము గావలసినదని కోరినాడు. కాంతాజనములలో బొగడబడినవాడై ఉత్తరుడు సారథి లేడని విచారించినాడు. "ఎవ్వడు గల్గునొక్కొ నాకిత్తఱి నే గదా కడప నెంతయు నేర్తు రథం బనం బురిన్" అనునది వాని డాంబికమునంతయు వ్యక్తమొనరించుచున్నది. "రథం బనం బురిన్" అనునది ఎత్తుమాటలేగాని లోనుండి వచ్చినవి కావు అని ఆమాటలు వ్యక్తపఱచుచున్నవి. "కురుబల మేగుదెంచె నట" (౯) అను పద్యములోని "అట, బిట్టరబట్టు, అట్టె" ఈ మొదలగు పదములును ఉత్తరుని స్వభావమును చక్కగా జిత్రించుచున్నవి.

చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుడను బుద్ధి గలంగగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యే బసుల గ్రమ్మఱ దేరక యున్న నన్ను భూ
వరుడు సుహృజ్జనంబు బరివారము చిత్తములందు మెత్తురే. ౧౧

పార్థుడొక్కడే వెడలి కౌరవులనెల్ల సాధింపగలడని ఉత్తరుని ఈమాటలవలన ధ్వనింప జేయబడినది. ఉత్తరుడే యిట్టి యభిప్రాయము వెడలించియున్నప్పుడు ద్రౌపది యింక నెట్లోర్చియుండగలదు. కావుననే సామర్షాపహాసతరళహృదయయై చని ఆవృత్తాంతమును మెత్తని పలుకుల నింద్రతనయునితో దెల్పినది. "సామర్ష" అనుపదము ద్రౌపదికి మనసునందు గల్గిన యభిప్రాయముల నన్నిటిని సూచించుచున్నది. అపహాసము ఉత్తరుని డాంబికమున గల్గినది. సారథ్య మెట్లయిన లభించునటుల గావింపుము అని ద్రౌపది నాతడు బంపినాడు. ఆమె యుత్తరయొద్దకు బోయినది.

చ. జనపతినందనుండు దగుసారథి నారయు చున్న వాఁ డెఱిం
గినపని సెప్పఁగా వలయు గ్రీడి మనంబున మెచ్చునట్టి నే
ర్పును భుజశక్తియుం గలిగి రాథికి నెక్కిన సూతవృత్తిమై
నని సడి సన్న యేర్తెఱి బృహన్నలకుం గల దంబుజాననా. ౧౫

తే. అర్జునునకు ఖాండవదహనాదులైన
విక్రమము లాబృహన్నల వెరవులావు
గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ
నువిద దీని నెఱింగింత ముత్తరునకు. ౧౬

ఇందు సైరంధ్రి బృహన్నలకు సారథ్యమందు నేర్పుగలదని తెల్ల మొనర్చినదేగాని ఆతడు సారథ్యము సేయునని మాత్ర మామె ప్రత్యక్షముగా బలుకలేదు. ఉత్తరునితోఁగూడ "తేరు బృహన్నలావశగతిం జరియించిన గెల్వవచ్చు" ననియే చమత్కారముగ బల్కినది. "దీని నెఱింగింత ముత్తరునకు" అను దానిలో బృహన్నల మహిమావిశేషమును సైరంధ్రి తెల్పినదనియు. సారథ్య విషయమును ఉత్తర దెల్పినదనియు నభిప్రాయము గలదని చమత్కారము.

కం. మన ముఱియాడుచు నుండఁగ
దన కోరు లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుడు బృహన్నల బిలువం
బనుచుట కోడబడిన పలుకు వలుకుటయు దగన్. ౨౮

"సరేకాని ఏమిచేసెదను" అను భావము నిందుత్తరుడు చూపినాడని తిక్కన రచించినాడు. బలాబల విమర్శలేని ఉత్తరున కిది తగిన రీతిమై యున్నది. సంగతి నెఱుంగని పేడిని యుద్ధమునకు గొనిపోవువాడేమాత్రపు మేటిమై యుండగలడు. తిక్కన యిక్కడ రాజపుత్రుడగు ఉత్తరునిరీతిని, డాంబికమును గూడ వ్యక్తమొనరించినాడు. ఉత్తరవచ్చి బృహన్నలను సారథ్యముసేయుమని ప్రార్థించినది. ఆమెమాట త్రోసివేయలేనివాడువలెనే అర్జునుడు సంగీతనిలయమునుండి బయలుదేరినాడు. సలిలంబుగా మెత్తమెత్తన నడలెంచు మత్తశుండాలంబుబోలె అరుగుదెంచినాడు. "కౌరవులతోడ గయ్యంబు గలిగె నాకు గడగి నేడు రథమ్మావు గడపవలయు" నని ఉత్తరుడు పలికినాడు. ఆడువారి

మధ్య ప్రగల్భములు పలికిన ఉత్తరుని స్వభావము నీపలుకులు మఱియు బోధించుచున్నవి. బృహన్నల "నాశక్తియొఱిగి పంచి పనిగొని కడిమిమై బగఱ గెలుము" అని పలికినాడు. "పంచి పనిగొని" అనునది సాభిప్రాయ మైనపదము.

"గోగణము ముంగలిగ నేల గోడినడగ, నడచు కౌరవరాజసైన్యమును ఉత్తరుడు కనినాడు. ఈ సీసపద్యమునందు (౫౧)తిక్కన నడచివచ్చుచున్న కౌరవరాజసైన్యమును వనముతో సరిపోల్చినాడు. "ధరాధూళి లలితవనము, దివికి నలి గాపువోయెడు తెఱగు దాల్చ"అని వర్ణించినాడు. ధూళిధూసరితమైనటుల, దివికిపోవునటుల వర్ణించుటచే కౌరవులచేటు నిది సూచించుచున్నది. నడచుచున్న కౌరవరాజసైన్యము దివికేగునదిగా నున్నదని చమత్కారముగా రచించినాడు. ఉత్తరుడా కౌరవరాజసైన్యమును జూచి గరుపాఱినమేను, దలకుమనము, ఱెప్పవడిన చూపులు గన్గొ తొట్రిలుచు బృహన్నలతో "ఇది నాచేత నగు పని కాదు. సంగతి తెలియక వచ్చితి మేమిదారి" అని పలికినాడు అర్జునుని గూడ తనలో జేర్చుకొని పలికినాడుత్తరుడు. "మనకు మార్కొనునట్టి కొలది కాదు" అనుదానిలోని "కాదు" అనుపదము మిగుల రసవంతముగా నున్నది. ఈ మాటలేమియు నర్జునుడు వినిపించుకొనలేదు. "నీవు రాకపోవుచున్కి యిది యొప్పునె యిప్పటిభంగి జూచిన న్వీరల నేను మార్కొనమి నిశ్చయము" అని ఉత్తరుడు పలుకుటలో అర్జునుని ధీమా వ్యక్తమగుచున్నది ఉత్తరుని పలుకుల నర్జునుడలక్ష్య మొనరించి పోవుచున్నాడనునది ఉత్తరునినోటనే పాఠకులకు దెలిపించినాడు కవిబ్రహ్మ. "మనము గోవుల మరలింతము. అంతియకాని రథికాపనిమీద పోవలదు. నేను వెఱ్ఱివాడను కాను" అని పలికి అర్జునుడు అంతిపురములో వాడాడినమాటల నెత్తి చెప్పినాడు. "పసులదయ్య మెఱుగు బడతుల సంతోష మేల నాకు ననికి జాల నేను" అని ఉత్తరుడు పలికినాడు. ఉత్తరునకు అంతకంతకు భయము హెచ్చుపోవుచున్నదని యిచ్చట క్రమముగా గవి వ్యక్త మొనరించుచున్నాడు మఱియు నర్జునుడుత్తరుని క్రమముగా ధీరుని గావించుచున్నాడని కూడ కవిబ్రహ్మ వ్యక్త మొనరించుచున్నాడు.

చ. తనభుజశక్తియుక్ రిపుల దర్పము నేర్పడ జూచి చూచి యి
ట్లును దెగకున్న బోక యిది లోకము చక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చ రీబలము నీదెస దేఱియు జూడ దింతకుక్
మును భయహేతువైన విధముం దగ జెప్పుము నాకు నుత్తరా.

సీ. దెసలు బీటలు వాఱ దివురు చిందంబుల
కోలాహలములకు గుదియఁబడక
యురవడి సేనలు దెరల బై దోతెంచు
ధూళి పెల్లడరిన దూలపోక
చతురంగబల మతిసాంద్రత గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్మాంగ
తతినాటు తఱచున దల్లడిలక
తే. బహువిధంబుల బగతుర బరవసమున
నిత్తెఱంగున గలుగు క్రం పెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడు గాక
దవ్వుదవ్వుల నిక్కిన నవ్వ రెట్లు. ౬౨

ఉత్తరునకు భయ మింకను హెచ్చిపోకముందే అర్జును డీమాటలు వానిమనసున కెక్కించినాడు. యుద్ధమధ్యమున నట్టి పరిస్థితి నేర్పడుననియు నప్పు డుత్తరుడు ధీరుడై నిలిచినగాని కార్యము కాదనియు దలంచి అందు కిప్పుడే బీజము పాఱవేసినా డర్జునుడు. భీష్మ యుద్ధానంతర మట్టి పరిస్థితి గలుగుగా నుత్తరు డీమాట నప్పగించువాడు వలెనే యిట్లు పలికినాడు.

చ. ఉడుకువలేని కయ్యమున కోర్వగవచ్చునె నాకు డప్పి పు
ట్టెడు నొకమాటు నాగ్రహము డింపవు నీవును జక్కసేసి ప
చ్చడి గలపంగ వెండియును జంపితనంబున వచ్చివచ్చి పో
రెడు మొన లింకజాల నొనరింప భవద్రథసూతకృత్యమున్. ౪-౧౮౬

ఉత్తరు డిట్లనగా విని కవ్వడి నవ్వుచు "నేను గలుగ నీకు నోహటింపనేల" నని పలికినాడు. ఇది అర్జునుని గర్వమును దెల్పుచున్నది. అపనుంసకు దనవంటి ధనుర్ధారి మఱిలేడను గర్వ మొకటి

గలదు. మహాప్రస్థానికపర్వమున నిట్లు గలదు. విగతాసుడై పడియున్న అర్జునునిగూర్చి భీముడు ధర్మజుని నిట్లు ప్రశ్నించినాడు.

సీ.........ఈయమలచరిత్రుని
యం దెన్నడును నసత్యంబు గాన
మిటు పడుటకు గత మేమి నావుడు నీత
డక్కౌరవుల నెల్ల నొక్కనాడ
తే. యాహవంబున దెగటార్తు ననియె నట్లు
సేయ డయ్యె బలొక్కటి సేతయొకటి
యగుట చాలదోషము వినుము మఱియుగాక
యెల్ల కోదండధరుల గర్హించుచుండు. ౧-౮౧

ఇట్టి గర్వముకలదు కావుననే ఉత్తరుడు భీతి చెందినప్పుడెల్ల "నేను గలుగ" అనియే అర్జునుడు పలికియున్నాడు. ఒక పర్వమందు పూర్వాపరసంబంధమును గ్రహించుటయే గాక భిన్నపర్వములకు గూడ నిట్టి సంబంధములను తిక్కన కల్పించియున్నాడు. అర్జునునికి కేవలము అహంకారముకాదు. అన్న ప్రకారము కార్యమెట్టియిన సాధించువాడు. ఒక్కరోజులో గౌరవుల నందఱ సాధించెదనని పలికినది ప్రజాశక్త్యుత్సాహకారకమై యొప్పియున్నదని గ్రహింపవచ్చును. ఏమైనను అన్నప్రకారము ఒక్కరోజులో సాధింపకుండుట లోపమే. అయినను ఎప్పటికైనను గౌరవులను సాధించియున్నాడుగాన అతనికి కేవలాహంకారము మాత్రము కానేరదు. ప్రస్తుతము మగల నందఱను నర్జునుడు మర్దించియున్నాడు. రాజొకడే మిగిలియున్నాడు గాన నామాటలు ఒప్పియున్నవి.

ఉత్తరునకు హృదయమందు భీతి గల్గినను రాకుమారుడుగాన నింతవఱకు మొండిగా నోర్చినాడు. భయోత్కంఠ మొంది "తేరు దోలుకొని రయంబున బురి కరుగుటయ నీతి" అని పలికినాడు. అర్జునుడు "అది తగదు. అదిగాక సైరంధ్రి నన్ను విశేషించి పేర్కొని యున్నది. పౌరావలి దీవన లిచ్చిరి గాన నేను రిత్తవోను" అని పలికినాడు. తేరు ముందుకు దోలుకొనిపోవుచున్నాడు. అదిచూచి ఉత్తరుడు మఱి నిలువలేకపోయినాడు.

క. దవ్వుల వితెగిన బౌరులు
నవ్వుదురట మేలు మేలు నను నాగకు నీ
క్రొవ్వలుగ దేని దలపడు
మెవ్విధి జని తేని యనుచు నె త్తిసభీతిన్. ౭౧

క. శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గవిడిచి యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురిదెసకును లజ్జ వీటి బోవం బాతెన్. ౭౨

"ఎవ్విధి జనితేసి" అనునది "ఏలాగు నెత్తికొట్టుకొనెదవో కొట్టుకో" అనుభావమును వ్యక్తమొనర్చుచున్నది. "నను నాగకు" అను పదము ఉత్తరునియందు బహుచక్కగా నమరియున్నది ఉత్తరుడు మానము విడిచి వీటిదెస పాఱజొచ్చినాడు. "డిగ్గవిడిచి" అనుపదము ఉత్తరుని భయోత్కంపమును వ్యక్తమొనరించుచున్నది. అర్జునుడు పదశతమాత్ర ప్రదేశపలాయితుండైన ఉత్తరుని నెయిది పట్టుకొనినాడు.

సీ. వెలవెల బాఱుచు వెగ డొందు బెదపుల
తడియాఱ నెంతయు దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్ల నిండ జెమర్చు
బదములు గరములు గుదియబడకు
హృదయంబు దటతట నదరంగ బెలుకులు
దీనదృష్టుల మోము దేఱిచూచు
నెలుగు గద్గదిక దొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థించు మాట గీడ్పాటు దోప
తే. నిష్కళంకశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములు నురగాఢ్యరథము
గరటిదశకంబు నొకయూరు బురము నొచ్చి
నపుడ యిచ్చెద నీ కను నార్తు డగుచు. ౭౩

ఈ పద్యమున ప్రాణహాని యగునేమో యనుభయమున్న ఉత్తరుని పరిస్థితిని దిక్కన వర్ణించినాడు. మఱియు నుత్తరునివిషయమై అవస్థాంతరభయమును (పరిస్థితియందుఁగల తేడాను) ఇట్లుగా వర్ణించినాడు.

అర్జునుడు కర్ణుని జయించి ద్రోణునిపై బోవ నుంకించినపు డుత్తరు డిట్లని నాడు.

ఉ. వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లను
న్మిక్కిలి నైన శౌర్యమును నిర్భర తేజము నంతకంత కి
ట్లెక్కుడులావు జూచి మది యెంతయు బెగ్గిలి మేను చేష్టలం
దక్క నశక్య మింకిట రథస్యవహారము నిర్వహింపగన్. వి. ౧౧౨

ఆ. పుట్టినంతనుండి యిట్టివి యెన్నడు
గాన నెందు వట్టి గాన చోద్య
మంది యంతరంగ వివశత బొందిన
కతన సంక్రియముల కడక దక్క. ౧౧౩

అధీరుడగు నుత్తరుని భయమును మొదట వర్ణించినాడు. ధీరు డైన ఉత్తరుని భయము నిప్పుడు వర్ణించినాడు. కౌరవవీరుల నందఱను మర్దించి దుర్యోధనునిపైకి బోవ నుంకించిన యర్జునునితో గడు ధీరుడై యున్న (దిట్టతేరిన) ఉత్తరుడు పలికిన "ఉడి[illegible] కయ్యమున కోర్వగవచ్చునె......చాల నోసరింప భయ[illegible]మున్" అనునది భయమునందలి యింకొక తెరగును వ్యక్తీకరించుచున్నది. ఉత్తరుని భయప్రసంగమున దిక్కన యింకొక్క అపూర్వవిషయమునుగూడ ప్రకటించియున్నాడు. యుద్ధమధ్యమున నర్జునునిలావు ఎక్కువ యగుచున్నదనియు, అంతకంత కది యెక్కువైనదనియు తెల్లమొనర్చినాడు. కీచకుని జూచిన ద్రౌపదికి భయము గల్గినది. అప్పుడు ద్రౌపదికి ప్రాణభయము లేదు. మానభయమే ఆమెకు గల్గినది. భయములలో గల తేడాలు వీటిని పరికించినచో తేటపడగలవు. వాటి స్వరూపస్వభావములను అట్లే సంతోషములు, శోకములు మున్నగువాటియొక్క భిన్నభిన్న లక్షణములను దిక్కన తన కావ్యప్రపంచమున విరివిగా సృష్టించి యున్నాడు.

"యుద్ధము నీ కశక్యమైన మానివేయుము. సారథివిగమ్ము" అని పలికి ఒడబాటు లేకున్నను నుత్తరుని నొగల నడుకొననిచ్చి యర్జునుడు జమ్మి చేరినాడు. "నడుకొననిచ్చి" అనునది రథమందు వానిని గూలవేసినాడని స్ఫురింప జేయుచున్నది. "ఇన్నగమున గాండీవమున్నది. విరవిరోద

మప్పు డదిగాని యీవిండ్లు పనికిరావు. ఇవి నీకొలదివి" అనినా డర్జు నుడు. శవాకారమునసున్న మోపు నాచెట్టుపై జూచి "నన్నీ నీచపు బనికి బనుప నీకు దగునా" అని ఉత్తరు డనినాడు. అందుకు ధర్మనంద నానుజు డది అస్త్రసంచయముగాని శవము కాదని నమ్మబలికినాడు. "ధర్మ నందనానుజుడు" అనుపదమును కవి సన్వినియోగముగ నుపయోగించి నాడు. ఉత్తరు డడుగగా నర్జును డామోపునందున్న యస్త్రము లెవ రెవరివో యెఱిగించినాడు. తనకుగల పదినామములను, అవి గలుగుటకు గల హేతువులను దెల్పినాడు. బృహన్నల యర్జునుడని తెలియగానే అద్భుతహర్షంబులనొంది ఉత్తరుడు "చిత్తము ప్రమోదరసత్వము బొంది పొంగెడున్" అని పలికినాడు. మఱియు "నీ తను వేల షండ భావంబున బొందెనో యెఱుగవలయును" అనినాడు. నీవు షండుడ వెట్లయితివి అనకుండ నీ తను వేల షండభావంబున బొందెనో అని పలుకుట సరసముగ నున్నది. "భావంబున" అనుపదము మఱియు రసవం తముగా నున్నది. అట్టిభావమే గాని షండు డతడు గాడనుభావమును "ఎఱుగవలయును" అనుపదము వ్యక్తీకరించుచున్నది. "పుంస్త్వాభరణా" అను సంబోధన మిచట సొగసైనది.

చ. అనవుడు నాత డిట్లను మదగ్రజు పంపున బ్రహ్మచర్యవ
ర్తనమయి పూర్వశాపవిహితం బగురూపము దాల్చి యేకహా
యనపరిపాలనీయ మగునట్టి వ్రతంబు సమాప్తి బొంద జ
ల్పిన జతనంబు లోకులకు బేడితనం బయి తోచె నిమ్మెయిన్. ౧౬౦

ఇం దర్జునుడు యథార్థమునే పలికినాడు. "జతనంబు లోకులకు బేడితనంబై తోచె" అని పలుకుటలో భావగోపనము గలదు. గమ్మ తుగా యథార్థమునుండి తప్పుకొనినాడు. తిక్కన కొన్నికొన్ని పద్యము లందు భావమును ద్రోసికొనుచువచ్చి పద్యమును కొనవఱకు నడిపించి కొనకు క్రియాపదమునుండి ఒక వింతసొగసును గూర్చుచుండును. ఉత్త రుని గ్రమముగా ధీరుని గావించుకొని అర్జునుడు యుద్ధాభిముఖుడై బయలుదేరినాడు. ఇచ్చట ఉత్తరునిగూర్చి "చేయునది లేక మ్ముగ్ధుండమ్మ హీజ మలసత నెక్కెన్" అనియు ఆయుధములు ఎఱుకయైన పిమ్మట "అప్పుడు మహాత్ముండగు నయ్యుత్తరుండు పాండవోత్తము నెఱుం

నాడు. అర్జునుడు దివ్యపరికరములనెల్ల ధరించి యుద్ధసన్నద్ధుడై వెడలినాడు.

వచ్చుచున్నవా డర్జునుడని నిశ్చయమైన పిదప కౌరవవీరులందు గందరగోళము పుట్టినది. ఆసమయమున నొకరిపై నొకరు కలహించుకొని పలుకుచుండుటను జూచి భీష్ముడు "ద్రోణాచార్యుందు నీతిపథంబునం బలికె నాచార్యతనయువచనంబు లుచితంబులు గృపాచార్యుం డాడినచందంబును దెఱంగువడి యున్నయది మన్నగల మానినీయగుట నంగరాజునకు సంగరపాటవంబుమాటలు దగుంగాక మాన్యుల నధఃకరింప నగునే" అని పలికినాడు. పరస్పరము కలహించి వారువారు పలికినవి భీష్ముడు నిర్ణయించినచొప్పుననే యున్నవి. తిక్కన ఆమాటల నట్లే నియమించుకొని రచించియున్నాడు. దుర్యోధను డీకలహశాంతికై "గాంగేయ కర్ణులం గూర్చికొని గురునిం బ్రార్థించి యశ్వత్థామను వేడికొని కృపాచార్యులం జేర్చినాడు" అని రచించినాడు. ఇదియు వారివారి స్వభావస్వరూపములను వ్యక్త మొనరించుచున్నది. "అర్జునుడు యుద్ధమునకు వచ్చినాడు. మనమొనయందు దుర్నిమిత్తములు బొడగట్టుచున్నవి. రాజును రక్షింపవలసియున్నది. కావున తదుచితమైన వ్యాపారమును మనము చేయవలెను" అని ద్రోణు డొక నిర్ణయమును బలికినాడు. ఈమాటలు నీతిపథమునే వ్యక్తీకరించుచున్నవి. దుర్యోధను డప్పుడు ద్రోణుని నధిక్షేపించి పలికినాడు. అందుపై నశ్వత్థామ "నీవింకను నొడ్డన పడలేదు. ఏల నీ వృథాభిమానము. ఆచార్యులు యుద్ధమున శోభించరు అని రారాజు పలికినను సిగ్గుమాలి రణంబుసేసెనేనియు ద్రోణుండ నేయుంగాని యేనట్టిదాని కోర్వను" అను నీమొదలగు మాటలు పలికినాడు. ఈమాటలు నిజముగా నప్పట్టున నుచితములే అయియున్నవి. "బుద్ధిమంతు లింద్లకడనుండి భోజనావసరాదులందు పలుకుదురుగాని పోట్లాడెడువారు గారు" అని రారాజు పలికినదానికి బదులుగా "నింటికడ నిది జూదముకాదు" అని అశ్వత్థామ బదులు పలికినాడు. "పెఱిందిదెస నిక్షేపిన మనకు వాని విజయంబు గోరుచుండుట లెస్స" యని పలికినదానికి "విరాటుడైన మారొక్కండుముగాని పరిచయస్థుడగు నరు డేపున నుట్టిన నతనిపొంత బోదుమె" అని బదులుపలికినాడు.

కర్ణుడిదివిని సక్రోధుడై యోధవీరలోకంబునాలోకించి వీరాలాపంబులుపలికి నాడు. ఇది నిజముగా సంగరపాటవమును వ్యక్తీకరించుచున్నవి. అందు పై కృపాచార్యుడు "కాలుద్రవ్వుదు, కార్యగతికి జొరవు, అర్జుననొంటి మార్కొనగూడదు, కురువిభుఁడు, భీష్ముడు, గురుఁడు, అశ్వత్థామ, నీవు, నేను కూడుకొని తాకుదము. ముక్కంటికైన గ్రీడి నొంటి మార్కొన వశమె" అని పలికినాడు. ఇవి నిజముగా నప్పట్టున దెఱంగుమాటలై యొప్పియున్నవి. కర్ణుడప్పుడు సంరంభమున కృపుని నధఃకరించి పలికి నాడు. కర్ణుడు సంగరపాటవంబుమాటనే పలికినను విసుగుతోడ మాటా డినాడు. అట్లుగా మాన్యుల నధఃకరించి పలుకుట సబబుగా లేదని భీష్ముడు పలికినాడు. తనమాటలందు గార్యనిశ్చయమును జూపియున్నా డుగాన ద్రోణుని బ్రసన్నుని గావించుటకై దుర్యోధనుడు ప్రార్థించినాడు. ఆగ్రహమున దాను పలికిన దానికి నగినటుల పలికిన నశ్వత్థామను వేడికొని నాడు. సక్రోధుడై కర్ణుడు హద్దుమీఱి పలుకగా నది తగదు. కార్యగతిని జూడుము అని పలికిన కృపునిమాటలు దెఱంగుపడియున్నవి గాన దుర్యోధనుఁ డాతని దేర్చినాడు. దుర్యోధనుడు శాంతిని గూర్చుటకై వారివారి నిట్లు భిన్నమర్యాదతో వేడుకొనినాడని తిక్కన రచించినాడు. ఇది బహుగాంభీర్యముగాను బూర్వాపర సంబంధశోభితముగాను నున్నది. గాంగేయ కర్ణుల గూర్చికొని దుర్యో ధను డోదార్చుట సాభిప్రాయమైనది. కులజ్యేష్ఠుఁడగు భీష్ముని, మాటలు విసరివేసిన కర్ణుని వీరిద్దరిని గూర్చుకొని రారాజు మాన్యుల నోదార్చి నాడని యభిప్రాయము. భారతవీరుల స్వభావస్వరూపములను నిర్ణయించు పట్ల భారతమంతయు సమగ్రమముగ బరికించి నిర్ణయింపవలసియున్నది. కవిబ్రహ్మ భారతమంతయు సమగ్రమముగ బరికించిన నది స్పష్టము కా గలదు. ఆతడు పూర్వాపరసంబంధమును నుంచుకొనియే భారత మాంధ్రీకరించి స్వతంత్రగ్రంథముగ నొనర్చినాడు. "దుర్యోధనుడు కృపాశ్వత్థామల కరంబులకు నిజపాణిపుటంబులు సాచి క్షమింప వేడి నాడు" అనితిక్కన రచించినాడు. బ్రాహ్మణులు నుత్తములు నగువారి నోదార్చుమర్యాద నిట్లుగా దిక్కన వ్యక్త మొనరించినాడు. ఓదార్పు మాటలందుకూడ నిట్టిమర్యాదను బాటించియున్నాడు.

క. క్షమియింప వలయు నొక డెఱు
గమి నేమే నన్ననంత గటకటబడి భూ
రమణుని కార్యస్థితి చి
త్తములం దెడ సేయునట్టితరమే మీరల్. ౨౨౫

"అట్టితరమే మీరల్" అనుదానిలో నెంతయేని లౌకికమున్నది. మర్యాద ఉట్టిపడుచున్నది.

అర్జునుడు ప్రణామమును, కుశలప్రశ్నను ఉద్దేశించి యభిప్రాయ మగునటుల బాణములు ప్రయోగించి ద్రోణ గాంగేయ కృపుల మెప్పును బడసెను. కౌరవవ్యూహరచన నవగాహన మొనరించుకొనెను. నిరామిష మైన సేనతో దలపడక పసుల జాడబట్టిపోయి వాటిని విడిపించెను. అర్జు నుని దివ్యపరికరములనుండి బయల్వెడలిన దివ్యధ్వనులను విని పసులు తమపాలముదిక్కు పట్టినవి. పరిచయమార్గమున గోష్ఠాగారమునకు బాఱుచున్న పశుల నడ్డగించుటకు రానటుల గురుసైన్యమును అర్జునుడు వారించినాడు.



# తిక్కన విరాటపర్వము

## పంచమాశ్వాసము

---

పశువులు పట్టువడిన పిదప నర్జునుడు అనతిదూరవర్తియగు కౌరవ చక్రవర్తిదెస తేరువోవనిచ్చెను. కౌరవవీరులందఱు దుర్యోధనున కండగా నిలిచిరి. రారాజు పశులు పట్టుబడినందులకు విచారించి అర్జునుని నెదుర్కొనినాడు.

క. కనుగొని యెలన వ్వొలయు వ
దనమున గరువంపు జెన్ను దలకొనగా న
ర్జునుడు విరాటసుతున కి
ట్లను గేవలవీరరస మయాత్మకు డగుచున్. 3

పేరెన్నికగన్న కౌరవవీరులందఱు తన్నొక్కని సాధింప దలంచి ముసురుచున్నందులకు అర్జునునకు ఎలనవ్వు గలిగినది. "ఎలన వ్వొలయు వదనమున గరువంపు జెన్ను దలకొనగా" అనునది అర్జునుని సామంతమును స్పష్టీకరించుచున్నది. అతడు కేవలము వీరరసమయాత్మకుడైనాడు. కౌరవవీరులచిహ్నములను దెల్పి ఎచ్చటెచ్చట నెట్లెట్లు రథము నడపవలసియుండునో ఆ వివరమంతయు నుత్తరున కెఱుగబలికినాడు. అప్పు డశ్వత్థామ సస్మితుండగుచు గర్ణుని నుపాలంభించినాడు స్మితము, సస్మితము, ఆహ్లాదము, నవ్వు, హాస్యము ఈ మొదలగుపదముల నాయా పట్టులందు వాడుచు దిక్కన ఆయాఘట్టములందు ప్రత్యేక పరిస్థితిని వ్యక్తమొనర్చి యున్నాడు. అపుడు కర్ణుడు క్రోధఘూర్ణమానతారకుడై అశ్వత్థామకు బదులు పలికినాడు. కర్ణుని కోపమంతయు వానిదృష్టియందే వ్యక్తమగుచున్నదని యభిప్రాయము.

అర్జునుడు కౌరవసైన్యమును దనుమాడ దొడంగినాడు. ఆసమయమున దొరలు తలపడిరి. అర్జును డప్పుడు వేల్పువచ్చినట్లు (దయ్యము

పట్టినట్లు) మేనుపొంగ గొప్పగా బోరాడినాడు. అంబుధిలోన మహా మత్స్యము దిరుగాడునటుల నాతడు కౌరవసేనాసముద్రమున విచ్చలవిడి దిరుగాడ జొచ్చెను. చిత్రసంచారమున నా సైన్యమును విభాగములు గావించెను. చతురంగసైన్యమును గలంచెను. ౫౦_౫౫ వఱకుగల పద్య ములలో చతురంగములలో నొక్కొక్క అంగము సంగతి ప్రత్యేక ముగా దెల్పబడినది. ౫౬ పద్య మొక్కదానిలో చతురంగసైన్యము యొక్క సంగతి తెల్పబడినది. తిక్కన యిట్లుగా రచించి యుద్ధ మప్పటికి మఱియు (క్రమముగా) బీభత్సమగుచున్నదని వ్యక్తీకరించినాడు.

ఉ. శిక్షితచిత్రసంగర విశేషములం బ్రతిహేతిఖండనా
దక్షత పెంపుసొంపునను దైవబలంబున నత్తఱిం సహా
స్రాక్షతనూజు సారథి రథాశ్వచయ ధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతిలేక యొప్పె గురుసైన్యము వెక్కసమంది బెగ్గిలన్. ౫౭

పటుసామర్థ్యవిశేషమున విలసిల్లు నర్జును డప్పుడు దైవబలంబు కతంబున మిక్కిలి వెలుగొందినాడు. అతని పరికరములుగూడ (సాధన సంపత్తిగూడ) దెబ్బతినలేదు. ఈ పద్యమున దైవబలమన్నది చివరకు జెప్పబడుట సారస్యమైన విషయము. అది అర్జునుడు యుద్ధమున ననితర సాధ్యమైన కార్యమును సాధించినాడు అని సాధించుచున్నది. దైవబల మాతని కండగా నున్నది. చిట్టచివర బలీయమై రక్షగా నేర్పడినదని సారస్యము కౌరవసైన్యము వెక్కసమందినది. బెగ్గలినది. అర్జును డప్పుడు అతిరథశ్రేష్ఠులపైగూడ బాణముల బ్రయోగించినాడు. కౌరవ బలము వెఱచి భీష్మునుఱువు నొచ్చినది. అప్పు డర్జునుడు ప్రత్యేక ప్రథన కుతూహలాయత్త చిత్తుడై తలపడ నెంచెను. మొదట కురుకుమార వర్గము, పిదప కర్ణుడు యుద్ధమునకు దలపడిరి. కర్ణుడు శక్తి నొకటి ప్రయోగించెను.

ఆ. వైచుటయును సవ్యసాచియు గౌరవుల్
విస్మయంబుతోడి వెఱపువొంద
నధికరయము మెఱయ నది వెక్కుడునియలు
చేసె నంతరమున శితశరముల. ౧౦౧

"విస్మయముతోడి వెఱపు" అనునది అర్జునుని నేర్పును, కర్ణునిపై

నాశగొనిన కౌరవుల ఆర్తమును వెల్లడించుచున్నది. కర్ణు డోడిపోయి పాఱిపోయినాడు. "మత్స్యపతిసుతు డార్యున్" అని యిక్కడ గలదు. కౌరవులు నమ్మియున్న వీరుడు, అంత గా నర్జునునియెదుట ప్రగల్భములు గొట్టినవాడునగు కర్ణు డిట్లు పాఱిపోవుట చూచి ఉత్తరుడు కేలికొట్టి నాడు. అర్జునుడు దేవదత్తము పూరించి ద్రోణునిపైకి బోదమనుచు వీరావేశంబున గౌరవానీకంబు నాలోకించినాడు. అప్పు డుత్తరుడు వెక్కసపాటు భీతి విహ్వలభావము నొంది యింక రథము నడపజాలనని పలికినాడు. "వెక్కసపాటు" అను పదముతో నీపద్యము (౧౧౨) ప్రారంభింపబడినది. ఈ వరుసమాటలు కర్ణార్జునులయుద్ధమందలి తైక్ష్ణమును వ్యక్తము చేయుచున్నవి. ధీరుడై నిలిచిన ఉత్తరుడు మరల నిట్టిమాట పలుకుటచే బోరుఅప్పటికి ఘోరరూపము దాల్చినదని వ్యక్తమగుచున్నది. అర్జునుడు "రథమును ద్రోణున కెదురుగ బోనిమ్ము" అని ఉత్తరునకు దెల్పినాడు. ఉత్తరార్జును లీయుత్తరగోగ్రహణయుద్ధమున నెప్పు డెప్పు డెట్లుగా జరించియున్నారో అది వ్యక్తీకరించుటలో వా రెవరి కృత్య ములు వారు చక్కగా నెరవేర్చిరి అని తెల్పుటయేకాక ఒకరికొకరు అనువుగ నెట్లు ఇంగితజ్ఞులై చరించిరో అవి తిక్కన చక్కగ రచించి యున్నాడు. బృహన్నల అర్జును డని తెలియగానే నాతనిచే సమాలింగి తుండై ఉత్తరు డిట్లనియె.

చ. మనము కలంక దేతె రిపుమర్దనవిక్రమ యెక్కుతేరు నీ
ఘనభుజశక్తిప్రాపున నఖండితశౌర్య మహోన్నతుండనై
యనిమొన సారథిత్వమున మహత్త్వము వైరులు మెచ్చ జూపెద
నను బనిగొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు గోవులన్. ౧౫౪

క. మనమున గోరుదు నే న, ర్జునునకు సమరమున రథ్యచోదకభావం
బున బనిసేయవలయు నని, యనిశము విధికరుణ నాకు నది సిద్ధించెన్.

వ. అని పలుకు నుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కిట్ల నియె. ౧౫౬

మ. ప్రియ మతిక్షణము నాకు నీదెస మదిన్ భీతి ప్రదోద్వేగ సం
శయముల్ సేరగ నీను నీకు ఘనరణాకల్పనాబుద్ధి ని

శ్చయ సంపాదిని నాదుదృష్టి నిను నశ్వవ్రాతముం జోక గా
లియు రానీను దృణీకరింపు రిపుద్రోర్లీలాసముల్లాసమున్. ౧౫౭

"ఎక్కు తేరు, పనిగొమ్ము, లెమ్ము" అనుపదము లుత్తరుని యుత్సాహమును వ్యక్తము చేయుచున్నవి అర్జునునకు సారథ్యము చేయవలయునని చిరకాలమునుండి వాని కభిలాష మెండుగ గలదు. దైవేచ్ఛం జేసి తలవని తలంపుగా నది లభించినందున వా డుత్సాహవంతుడైనాడు. ఉత్సాహపూరితమైన వానిమాటలు విని అర్జునుడు "గాలిగ్నైన రానీయక నిను గాపాడెదను" అని హెచ్చరించినాడు. అర్జును డట్లు దోచుటచేతను, పైగా నాతని హెచ్చరింపు పలుకులచేతను నుత్తరు డుత్సాహవంతుడైనాడే గాని అనుభవరూపమైన ఉత్సాహము వాని కింకను దెలియదు. అందుచేత నర్జునుడు మొదట నద్భుతనాదము గల్గిన దేవదత్తమును బూరించినాడు. ఉత్తరుడు మూర్ఛనొందినాడు.

చ. చెవి లవిసెన్ దిశల్ దిరిగె జిత్తము నీఱయి పోయె నాకు నీ
రవమున నిమ్మహోగ్ర కపిరాజపతాకయు జూడ్కి జీకటుల్
గవియగ గ్రాలెడున్ భవదఖండిత తేజము పర్వి యాత్మకున్
వివశత జేయుచున్నయది విహ్వలభావము మాన నేర్చునే. ౧౭౭

అనుపమానమగుయుద్ధ మపుడు జరుగనున్నది అట్టిది ఉత్తరున కనుభవములేదు. కావున నది యెంతటి బీభత్సతను గల్గించి విహ్వల భావమును బుట్టించునో అది మొదటనే చవి చూపెనా డర్జునుడు. "విహ్వలభావము మాన నేర్చునే" అనుదానిలో "మాన నేర్చునే" అనుపదము అనుపమానముగ బ్రయోగింపబడినది. ఆనాదమున కట్లగుటయేగాని మానుటకు వలనుపడునా? పడదు అని ఆపదము వ్యక్తీకరించుచున్నది. అది పరిచితమైపోయిన మఱి భయము గల్గదు. ఆప్రయత్నమే అర్జును డిపుడు చేసినాడు. మఱియు యుద్ధమునకు బోవు వీరుడు మొదట శంఖనిర్ఘోష మొనర్చుట ఉచితమైకూడ నున్నది. అర్జునుడు తగుమాటలు వలికి ఉత్తరుని గొందలపాటు గ్రమమున డిందుపఱచి శంఖము మరల పూరించినాడు. ఉత్తరు డీసారి ధీరుడై నిలువగలిగినాడు. అర్జునుని యభిప్రాయానుసార ముత్తరుడు భీష్మద్రోణాదు లున్నమొన వలపటబెట్టి యరదము బోనిచ్చెను.

కౌరవసైన్య మప్పుడు మూడుభాగములై యున్నది. నాల్గవభాగము సైన్యము దుర్యోధనుని వెంబడి గలదు. ఇంకొక నాల్గవభాగము గోవుల వెంబడి గలదు. మిగిలిన సగము సైన్యమును గూర్చుకొని భీష్మాదు లర్జును నెదిరింప నిలిచియుండిరి. ఉత్తరు డప్పు డీసగము సైన్యమును దాటించి గోవు లున్నస్థలమునకు రథమును దెచ్చిపెట్టినాడు. అనగా సగముసైన్య మొకప్రక్క సగముసైన్య మింకొక ప్రక్కగా నున్నవని యభిప్రాయము. వెనుకనున్న సైన్యము తన్ను జేరకముందే గోవులను విడిపించి పురికి దోలించినా డర్జునుడు. పాలము జొరబోవుచున్న గోవుల నడ్డగింపకుండ నెడ సొరంగవలయునని అర్జునుడు దెల్పగా నుత్తరు డట్లే రథము నడిపినాడు. అనంతర మాతని యాదేశము ననుసరించి దుర్యోధను డుండుచోటునకు రథము నడిపినాడు. అర్జును డప్పు డుత్తరునకు కౌరవవీరులలక్షణముల నెఱిగించి యిట్లు సంభాషించినాడు. "గురునకు ప్రదక్షిణముగ రథము బోనిత్తము. ఇతనియెడ పరిభవము వలవదు. ఈతనితోడి కయ్యమున కియ్యకొనదగదు. దుర్యోధనుని బరిమార్పబోవుచో శాతశరోత్కర మీతడేయునో నన్ను నేయడో చూతము. ఆత డాజికి వచ్చిననే మన మెదుర్కొందము. అశ్వత్థామ కృపులు మాన్యులు. వీరితోడ నంతగా గయ్యమునకు గాలుద్రవ్వవలదు. ఎచ్చోట నెదురుమెలగిన నచ్చట మనరథము నల్లనల్ల చననిమ్ము. కర్ణు డెదురుపడిన పోయి పడుదును. నీవర వాయించకలేక రథము పఱపవలయును. దుర్యోధనుని గనిసినపుడు నాకు పండువ. ఈతని రథ మగుపడినంతనే ఎవ్వ రడ్డపడినను మెఱపువలెనే అతని ముందర రథము నిలుపుము. భీష్ముని రథముపొంత బోవలదు. అలుకపుట్టి భూకాంతునకు, సైన్యమునకు జెంత నేరనీయక సిలుగులు పెట్టగలడు" అని పలికి అర్జునుడు రథ మెట్లెట్లు నడుపవలసియుండునో బోధించినాడు. చతురంగసైన్యము తలపడినది. అక్షతధ్వజసూతహయత్వ్రలసదఘల్లు రథవల్లనుం డగుఫల్గునుండు ఘోరముగా యుద్ధ మొనరించెను. ఆసమయమున నుత్తరుని బలుమాటతోడి యేపు సెవికిని, జూడ్కికి నింపు నొసగగా నింకను నుత్సాహమును బొంది అర్జునుడు శత్రుసేనాయోధుల జించి చెండాడెను.

క. సమవిషమవినిమ్నోన్నత
సమీపదూరస్థలములు సదృశములుగ జి
త్రము క్రియ నవిహితగతులను
సమరమహిం గ్రీడిరథము సను నవితథమై. ౫-౭౬

మ. బలమెల్లన్ వెలి రెండుపాయలుగ శుంభద్వేగుడై చొచ్చి యా
వలగా నడ్డమువచ్చి నాలువుగ దుర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుడై
వలయంబుల్ సని చించి చిక్కువలుచన్ వైకల్యసంపాదియై. ౪౮

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబున దదీయరథంబు గౌరవసైన్యంబునందు సంచరించు నయ్యవసరంబున.

ఉత్తరార్జునులనేర్పు లిందు మిళితములై వ్యక్తమగుచున్నవి. ఆ బీభత్ససమయమునగూడ సహస్రాక్షతనూజుసారథిరథాశ్వచయధ్వజములు పరాస్త్రశస్త్ర క్షతిలేక యొప్పెను. ఇచ్చట "సహస్రాక్షతనూజుడు" అను పదమును దిక్కన యెంతయు సాభిప్రాయముగావాడియున్నాడు. ప్రత్యేక ప్రథన కుతూహలాయత్తచిత్తుడైన నరుడు "అదె కర్ణు డాజికేళికౌతుకమున గడగి వచ్చుచున్నాడు. మనమే ముందు దొడరవలయును" అని పలుకగా నాతనిలావు నచ్చి ఉత్తరు డతినిర్భయముగ గర్ణున కెదురుగా దేరుపోనిచ్చెను. అర్జునుడును వృషభంబున కాదికొను బెబ్బులిబోలె రాధేయు దెస నడచెను. గరుడుడు పామును ఉద్భాసితపక్షుడై పొదువు భంగి బొదివెను. ఆతనియమ్ములకు వెఱచఱచి సూతపుత్రుడు పఱచెను. ఉత్తరు డదిచూచి అర్చెను. అర్జునుడు దేవదత్తమును బూరించెను. ఆ సమయములో గర్ణుడు పాఱిపోవునట్లు చేసినా డర్జునుడు. అందుకు దగినట్లుగా నుత్తరు డార్చినాడు. నే నొక్కడనే అర్జునుని నెదిరించెదను అని బింకములు పలికిన మొనగాడు కర్ణుడు కౌరవపక్షమున బారిపోయినాడు. మొదటలో నధీరుడైన ఉత్తరు డిప్పుడు మంచి దిట్టరియై నొగనెక్కి కూర్చొని కర్ణుడు పాఱిపోవునపు డర్జునునకు దగినసారథియై ఆర్చినాడు. ఉత్తరుడు తన పనివాడితనమును జూపినాడు.

చ. ఎదురుగ బోవనిమ్ము రథ మీతని తేరికి నన్న నాతడుం
బదిలముతోడ రథ్యములపగ్గము లేర్తైఱనూలుకొల్పియు

మ్మదగతి నట్లు చేసిన నమానుషవిక్రము డైనద్రోణుడుం
గదిసి యిభం బిభంబు కెనకం జనుదెంచినలీల వచ్చినన్. ౧౭౧

ఎదురుగా రథమును బోనిచ్చుట మర్యాద. పెద్దలున్నచోటునకు పిన్నలు ఎదురుపోవలయునుగదా. ఇందు వినయము, యుద్ధాభిలాషకూడ తెల్లమగుచున్నది. ఉత్తరుడు మన్మదగతి రథము తోలినాడు. అప్పుడు ద్రోణుడును ఎదురుగ వచ్చినాడు. గజము గజమును కెనక వచ్చినలీల వచ్చినాడు. కర్ణార్జునుల యుద్ధ మప్పుడు ప్రయోగింపబడిన యుపమాన ములు ఈ యుపమానములు నాయాయుద్ధస్వభావమున కనుగుణమై యొప్పియున్నవి. "తనను ప్రారంభింపుము" అనినాడు శిష్యుడగు నర్జునుడు. గురుడు భయంకర యుద్ధ మొనరించినాడు. ఆయుద్ధమున నాతనిబలము తోడుపోడ తలుగజొచ్చినది. "పరిభవముపలదని" తొలుతనే యర్జును డుత్తరునితో బలికియున్నాడు. అట్లే ఆరథికసారథు లందుకు దగినరీతి నిట సంచరించిరి. ఆసమయము చూచి అశ్వత్థామ వారి నెదుర్కొనినాడు. ఆ యుద్ధము శితసుఖనృత్త సంగరముచావమున దోచెను. అర్జును డతియ గోడీనుడు. అవిలేనివా డశ్వత్థామ. కాన శర శూన్యుడైనాడు. అది కనుగొని కృపాచార్యుడు సెంగట తలమీాటి నిలిచినాడు. అర్జునుడు గురుపుత్రుని రథము విడిచి కృపునినెదుర్కొ నినాడు. అనగా నర్జునుడు మొదట నా దేశించినప్రకార ముత్తరుడు మాన్యుడైన అశ్వత్థామునుండి రథము మరలించినాడని చమత్కారము. కృపుడు సమస్తపరికరములను బోగొట్టుకొని కత్తి డాలు పట్టుకొని ఉటికినాడు. వాని నర్జునుడు తునియలు చేసినాడు. కృపుడప్పుడు ద్రోణ పుత్రుని రథమెక్కిపోయినాడు. బలములు, అంపన్న దొరలు సంకుల యుద్ధముసేయగోరి నిలువగా నర్జునుడు చతురంగబలమును గూల్చినాడు. అనగా మొదట నర్జునుడు పలికినప్రకార ముత్తరుడు కృపాశ్వత్థామల నుండి రథము మరలించినాడని చమత్కారము.

కం. బలువిడి మనదివ్యాస్త్రం
బుల చవి సూపంగవలయు బోనిమ్ము రథం
బలసగతి నతనిదెస కని
పలికిన నత డట్లచేసె బరమప్రీతిన్. ౧౭౩

భీష్మునిదెస రథము నడుపుమని అర్జునుడు పలుకగా నుత్తరుడు పరమప్రీతిని దోలినాడు. భీష్మార్జునులు(కురు వృషభులు)వృషభములభంగి పోరజొచ్చిరి. ఆయుద్ధమున భీష్ముడు సోలి రథకూబర మూతగ నిలిచినాడు. అర్జును డుత్తరునకు మరల హెచ్చరికను దెల్పి దుర్యోధను నెదిరించినాడు. దుర్యోధనునిపైకి బోవుచు నర్జునుడు "ఎడనెడ నడ్డపడు కురువీరులం జిఱునగవు గెడనిగుడ మెఱుంగువాలమ్ములదొలంగ జడియుచుం గదిసినాడు" అని తిక్కన యిక్కడ రచించినాడు. ఇది సాభిప్రాయమైనది. "ఎవ్వ రడ్డపడినను మెఱపు మెఱచిన చాడ్పున దుర్యోధనుని దఱియజొరుము" అని అర్జునుడు మొదటలో నుత్తరునకు దెల్పియున్నాడు. అట్లుగనే యిప్పు డుత్తరార్జునులు అడ్డపడువారి నతిశయించి (తలకడచి) దుర్యోధనుని జేరి తలపడిరి అని భావము. రథిక సారథుల లక్ష్యైకదేశ మిచట గమనింపదగిన విషయము.

క. ఆచార్య సూర్యతనయ కృ
పాచార్య ప్రభృతి రథికు లందఱు దన్నుం
జూచుచు నుండగ నద్దెస
కేచి భుజాబలము మెఱయ నింద్రజు డరిగెన్. ౧౭౯

ఈపద్యముగూడ పైయభిప్రాయమునే వ్యక్తీకరించుచున్నది. దుర్యోధనార్జునులు ఏనుగు ఏనుగు దలపడినటుల దలపడి పోరిరి. తన చుట్టును బయమైన నయ్యురగకేతనుడు మరలిపోయినాడు. ఉరగకేతనుడు అనుపదముగూడ సాభిప్రాయముగానున్నది. పామువలెనే మరల తిరుగబడనున్నాడని చూచించుచున్నది. కర్ణుడు నిలువజాలక పాఱినాడు. దుర్యోధనుడు చుట్టును బయమైన మరలిపోయినాడు, అదియు కాలు ద్రోసిపోయినాడు. నమ్మినబంటు, ఆతని నేలినవాడు నిట్లయిరని సారస్యము. యూథపతితోడి పంతిసముత్కరంబు వెనుకదగిలెడు సింగంబు విధము దోప నార్పునాదంబుగా నరు డంట దాకినాడు. ఇం దర్జునుడు సింహముతో సరిపోల్పబడినాడు. ఇట్లుగా గౌరవపక్షమందు భీష్ముడొక్కడే సరిపోల్పబడియున్నాడు." మందాకినీతనయుం డప్పు సటావిలుంఘన సముదగ్రక్రోధ సింహాకృతిన్ ధనువొండుద్ధతలీల నెత్తికొని యస్త్ర

శ్రేణి బర్వించె" (౧౭౫) అని తిక్కన రచించియున్నాడు. భీష్మార్జునులు కురసింహాలని భావము.

క. వెనుకొని కర్ణుని పెడతల
యును దుశ్శాసనుని వీపు నాకొక్క శరం
బున నేసె నప్పు డయ్యన
తనయుం డిట్లనియె సతిరథశ్రేష్ఠులతోన్. ౧౯౮

ఇది సభాపర్వాంతమందు గౌరవులు గావించినదానికి జవాబుగా నున్నది. వెడలిపోవుచున్న దుర్యోధను నెలుంగెత్తి పిలిచి అర్జును డాతని నుపాలంభించినాడు.

ఉ. క్షత్రియు డోడునే తగదు కౌరవరాజ రయుండవే బృథా
పుత్రులలోన బిన్న నను బోరికి పిల్వగ మాని నాగ ని
ర్ధాత్రి ప్రసిద్ధికెక్కి బలదర్ప సముగ్రుడ వైన నీవు నీ
మిత్రులుగాడ నిట్లయిన మెత్తురె నత్తురె కొల్వ భూభుజుల్. ౨౦౩

సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లొలుగడ
రా బురవీథుల గ్రాల గలదె
మణిమయం బైన భూషణజాలముల నొప్పి
యొడ్డోలగంబున నుండ గలదె
కర్పూరచందనకస్తూరికాదుల
నింపుసొంపార భోగింపగలదె
యతిమనోహర లగు చతురాంగనలతోడి
సంగతి వేడ్కలు సలుప గలదె

తే. కయ్యమున నోడిపోయిన గౌరవేంద్ర
వినుము నాబుద్ధిమరలి యీతనువువిడిచి
సుగతి వడయుము తొల్లింటి చూఱగలదె
జూద మిచ్చట నాడంగ రాదు సుమ్ము. ౨౦౧

క. నీయట్టివాడు నిన్నీ
పోయెడిదే యిట్లు వోకుపోకు మనుడు భూ

నాయకుడు మరలి పటుకో
పాయత్తత ద్రొక్కబడ్డ యహిగతి గవిసెన్. ౨౦౬

అర్జునునితోడ జాలక నిలువజాలక కర్ణుడు పాఱినాడు. దుర్యోధనుడు చుట్టును బయమైన మరలినాడు. అడియు కాలు ద్రొక్కిపోయినాడు. నమ్మినబంటు కర్ణుడు ఆతని నేలినవాడుదుర్యోధనుడు నీయవస్థలో నుండ నపుడు అర్జునుడు రారాజు నెలుంగెత్తి పిలిచి ఉపాలంభించినాడు.'క్షత్రియుడొడు నే'అనినాడు. దుర్యోధనుడు కాలుద్రొక్కిపాఱుచున్నాడు గాన నది చెప్పుచున్నా డర్జునుడు. 'తగదు' అనుపదము పాటించదని సొగసు గూర్చుచున్నది. "కౌరవరాజ" అనుసంబోధనము మఱియు సాభిప్రాయమైనది. పృథాపుత్రులలోన బిన్న నేను. యుద్ధమునకు బిల్చుచున్నాను. మానుష్యుడవను ప్రసిద్ధిపొంది బలదర్పసమగ్రుడవై యున్నావే. అట్టి నీవు నీమిత్రులతోగూడ నిట్లయిన మెత్తురా ? నీవు జూదమునకు బిలిచినను మేము వచ్చితిమి. క్షత్రియోచితమైన యుద్ధమునకు నిన్ను నే నిపుడు పిల్చుచున్నాను. అట్టిచో నీవిపు డిటుల మరలుట తగునా ? అని చెప్పిపొడిచినాడర్జునుడు. జూదమున నింకేమి యొడ్డెదవని ధర్మజుని నవమానపఱచి యున్నారు కౌరవులు. కావున నర్జును డామాటల కిపుడు బదులు పలికినాడు. "వత్తురె కోల్వ భూభుజుల్" అనునదిగూడ ఇట్టి చెప్పే అయి యున్నది. "అదృష్టహీనులగు నీమగలను జూచి సభికు లేమియు బలుక లేదు. లేరిచట నీకు మగలు" అని ఆనాడు కౌరవులు సభలో బలికి యున్నారు. తిక్కన సోమయాజి భారతమంతయు నాంధ్రీకరించలేదు. విరాటపర్వము మొదలు దెనిగించినాడు. నన్నయభట్టు తెనిగించిన సభాపర్వమునకు నీవిరాటపర్వమునకు పొందిక (పూర్వాపరసందర్భము) గల్గినదికాదు. కావున దన యభిప్రాయము వచ్చునట్లుగా దిక్కన సోమయాజి ఉద్యోగపర్వమున నీవెనుకటి సభాపర్వవృత్తాంతమును దడవుచు సంజయరాయబారములో శ్రీకృష్ణునిచేత నిట్లు పలికించినాడు.

క. లేరిచట మగలు నీకును
పేరలు జూదమున నోడి విడిచిరి నిన్నుం గా
వారిజలోచన నీపై
గూరిమిగల మగని వెదకికొను మొగి ననదే. ౧-౩౫౦

క. నరునకు నది వాఙ్మయమగు
శరమై హృదయంబునాటి చలియింపక దు
ర్భర వేదన జేయ౦గా
జిరకాలము నచ్చికిత్స సేసెనె చెప్పుమా. ౨౪౧

వ. మఱియు దుశ్శాసనుండు సీరలంటఁబట్టు గొట్టువారోయిన
వారలు పౌరుషంబుగల మానిసి యింతెవ్వం డనియెను. ౨౪౨

"మానివాగ, పౌరుషంబుగల మానిసి" అనుపదములు సాభిప్రాయ ముగలవై యున్నవి. ఆమాటలు నరునకు వాఙ్మయమగు శరమై దుర్భర వేదన చేయుచున్నవని చదించుటయు పూర్వసంబంధమును దడవుటయే యైయున్నది. కావున నర్జునుఁడు ఉత్తరగోగ్రహణమున దెబ్బతీసినాడని కవిహృదయము. సీసపద్యములో సాక్షేపమును పెట్టినాడు తిక్కన. "ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ నడువ భూపతులు గొలువ" అని మొదటిపాదములో గలదు. నీవు హస్తినాపురాధీశుఁడవే అయినను ఏనుంగు నెక్కజాలవు. పురవరం దురంగజాలవు అని అర్జునుడు పలికి నాడు. "ఆరోజులు గతించినవి. ఇక వచ్చునా" అనినాడని భావము. వీథులలోనికి వచ్చుటకు మొగమెట్లు చెల్లునిపోవడమే కాదు. కోటయందుం డినను కూడ పెద్దకొలంబున నుండగలుగుదువా. అదియు జేయజాలవు అంతియకాదు. అంతఃపురమం దుండినను నింపుసొంపార భోగింపజాలు దువా అదియుగాదు. ఏకాంతగృహమందైనను చతురాంగనలతోడి సంగతి వేడ్కలు సలుపగల్గుదువా మొగమెట్లునా నీకు. ఇంతటిపరాభ వము నొందిన నీవు ఇంక నేమియు జేయజాలవు. కావున నీతనువు విడిచి సుగతి వడయుము. ఎట్టియిన మానవుఁడు మర్యాద విడిచినైన జూదమా డుట కిచట వీలులేదుగదా అని అర్జునుడు చెప్పి పొడిచినాడని సార స్యము. "ఓడిపోయిన నీవు పురమెట్లు ప్రవేశింపగలవు, సింహాసన మెట్లు క్కగలవు, భోగింపగలవు, సరసములాడగలవు, చాలును, అంతే నీగతి. జూదపురోజులు గతించినవి" అని పలికినాడని భావము. "క్రాలన్, ఒప్పి, ఇంపు, సంగతి" అనుపదములు మఱియు రసపోషకమైనవి. "దుర్యో ధనా! నీవొకవేళ నాభోగముల ననుభవింతువుగాక. జంకుగొంకులేక యథేచ్ఛగా ననుభవింపజాలుదువా. కావున నిట్టి నీరసపు బ్రతుకేల

చావును" అని అర్జునుడు పలికినాడని ఆపదములు సువ్యక్తము చేయుచున్నవి. "కయ్యమున నోడిపోయిన గౌరవేంద్ర" అనునది రెండువైపుల నన్వయించుచున్నది. కయ్యమున నోడిపోయిన గౌరవేంద్ర పురమం దెట్లు ప్రవేశించి సింహాసన మధిష్ఠించి భోగములననుభవింప గలవు అని సీసపద్యభాగమున నన్వయించుచున్నది. కయ్యమున నోడిపోయిన గౌరవేంద్ర ఇంకేమి బ్రతుకు నామాట వినుము తనువు విడువుము అని తేటగీత భాగమున నన్వయించు చున్నది. పాఱిపోయిన నింత చులుకన హేళన గలదు గాన నీవు ట్టివాడు "ఛస్సీ పోయెడిదే" అని అనినాడు. "ఛస్సీ" అనునది అర్జునుని సామంతము సంశయు వ్యక్తమొనరించు చున్నది. యుద్ధరంగమున సర్వసైన్యములతో నున్న కురురాజు నెంతగా సాధించుచున్నదనియు నిది వ్యక్తమొనరించుచున్నది. పోకుపోకు మని అర్జునుడు పలుకగా దుర్యోధనుడు క్రోక్కబద్ధ యహిగతి మరల గవిసినాడు.

రాజు తెంపువగాచి సైన్యమంతయు విరుగబడినది. విజయుడు "ఆశ్చర్య ధుర్య నిరతిశయ రయభరిత కరయుగళుడయినాడు." ఈ సమాసమందలి ప్రతిపదము విజయుని శౌర్యసంరంభమును వ్యక్తీకరించు చున్నది. విజయుడు అనుపదముగూడ సాభిప్రాయముగా ప్రయోగింప బడియున్నది. అర్జును డిట్లు విజృంభించి రథ రథ్య సారథి స్వాంగంబుల గాచికొని తనతోడంబుట్టువుల ప్రతిన లూహించి యొందు నేయనొల్లక సంమోహనాస్త్రము ప్రయోగించినాడు.

ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలంగ
దలలు మెడలు జక్క నిలువకొఱగ
నెల్లవారునెఱుక నెడలి చొక్కి నిఁ
ద్రాతిశయము గూరినట్లు లైరి. ౨౨౮

ఉన్న పాటన కౌరవసైన్యము చొక్కి నిద్ర బొందినది. అర్జును డుత్తరమాటల దలంచి ఉత్తరునిచేత నంబరములు దెప్పించి రథయుతుక టంబు వెలువడి నిలిచినాడు. ఆసమయమున గురుపితామహుడు శర వర్షములు గురిసిన నాతని నొంచి పైకి వచ్చినాడు. దుర్యోధనున కపుడు తెలివివచ్చినది. కనువిచ్చి దిక్కులు కలియజూచినాడు. ఇచ్చటి ఈవర్ణన

మంతయు మానవస్వభావమును వ్యక్తమొనరించుచున్నది. మఱియు దుర్యోధనుని భయమును, ఆత్రమును వ్యక్తము చేయుచున్నది. దుర్యోధనుడు తిరుగ యుద్ధాభిలాషను గనబఱచగా భీష్ముడు "మన ప్రాణముల మీద కాతడు రాక నిలిచినాడు గాన మనమింతట నిలుచుట కార్యము" అని పలికినాడు. కౌరవులు యుద్ధభూమినుండి మరల జొచ్చిరి. అప్పుడర్జునుడిట్లనినాడు.

ఆ. పసులు మరలె శత్రుబలములు పీనుంగు
వెంటలయ్యె రాజు బెగ్డవోలు
జీర లొలుకబడిరి సిగ్గటి బిరుదులు
వైచి రింక మగుడ వలదె మనకు. ౨౨౨

క. హయములు మరల్పు మింత
ట్లియు బంధులు నెమలు సంతసింప గుమురు గ
ట్టి యెదుర సూతుడు వానికి
బ్రియమగ శ్వాసిద్ధియును బటికి బోవలయున్. ౨౨౩

ఇందు మొదటి పద్యము తన విషయమునను, రెండవ పద్యము ఉత్తరుని విషయమునను అర్జునుడు పచించినాడని వ్యాఖ్యానము. "కౌరవుల గెల్చుట నీయుద్ధ బాహుబలము బలుకుము. పిలిచి చెప్పుడుగుము" అని అర్జునుడు పలుకగా నుత్తరుడొల్లమి లేకందులను సమ్మతించినాడు. ఎప్పటియట్ల రథమెక్కినాడు. అర్జునుడు బృహన్నలగా నొగ లెక్కినాడు.

విరాటుడు యుద్ధభూమినుండి (దక్షిణ గోగ్రహణము నుండి) పురము ప్రవేశించి సింహాసనాసీనుడై ఉత్తరుని గూర్చి విచారించినాడు. కౌరవులమీదకు బృహన్నల సారథిగాగ నరిగియున్నాడని తెలిసికొని విషాద వేదనాదోదూయమానమానసుడైనాడు. అనుపమానమగు కౌరవసైన్యము వచ్చెనట గాదానొంటరిగ జనినాడే. వేవేగ సైన్యముల బంపుడు అనినాడు. "అక్కడకు వచ్చి సహాయ్య మొసగినాడు గాన నిక్కడ వీరికిని జయమవును. బృహన్నల సారథిగాన దేవతలనైన నతడు రుడు గెల్వగలడు" అని ధర్మజుడు పలికినాడు. "ఏయే పసుల వెంట మనము విరాటపురమున వర్తింతము" అని పాండవులాలోచించుకొను

తఱి ధర్మజుడు సన్యాసివేషమున నాతనికడ నుందునని తెల్పుచు జ్యోతిర్విద్యయందు జాతుర్యమును గనబఱుతుననికూడ పలికియున్నాడు. విరాటుని దఱికి వచ్చినపుడు ఈవిషయము నాతడు వ్యక్తపఱచలేదు. కాని సమయము గల్గినపుడెల్ల జ్యోతిశ్శాస్త్ర పాండిత్యమును బ్రకటించుచుండెనని ఇచ్చటి ధర్మజుని మాటలవలన వ్యక్తమగుచున్నది. క్రియలో జూపవలసిన విశేష మదిగాన ధర్మజుడు నోట బలికి చెప్పక తన ప్రవర్తన సమయమున నానేర్పును బ్రకటించినాడని సారస్యము. ధర్మజుని యీమాటల వినుచు గలంగు హృదయమున దాపము నొందినాడు విరాటుడు. ధర్మజుని జ్యోతిర్విద్య యెందును బొల్లు కాకపోయినను, అన్నియు యథార్థమగు దాఖలాలుగా నుండినను విరాటు డిప్పుడు నమ్మజాలకపోయినాడని యభిప్రాయము. కౌరవసేనను గెల్చుట ఉత్తరునకతీతమైన పనియని ఈవిషయము సుస్పష్టము చేయుచున్నది. ఎంతమాత్రము నమ్మదగినదికాదని భావము. కావున విరాటు డెట్లును నమ్మజాలకపోయినాడు. ఆతని అపనమ్మక మంత బలవత్తరముగా నున్నదని భావము. త్రిగర్తసేనచే నొవ్వని యోధులు పోయి సాయపడవలెనని పలికినాడు. "విధి గెలువవశమె బ్రహ్మకు నైనన్' అని పలికినాడు. ఎంతటి తెలివిమాలినపని చేసినా డుత్తరుడని విరాటుడు పలికినాడని భావము. విరాటు డిట్లు పలుకు నవసరముననే గోపాలురు వచ్చి ఉత్తరుని విజయవార్త నెఱిగించిరి. "తత్తురగరథధ్వజాలి నొక తుప్పుడు రాలదు" అని పలికెను.

తే. అంతరంగంబు నిండి రెండలువులందు
వెడలు సంతోషపూరంబు విధము దోప
గన్నుగవ సమ్మదాశ్రులు గడలుకొనుచు
గండఫులకాంకురములతో గ్రమ్ముదేర. ౨౮౦

సభాసదుల కావిరాటుని సంతోషపూర మెట్లు స్పష్టమైనదియు దిక్కన యిందు జక్కగ నిరూపించి యున్నాడు. ఈ పద్యము మూలమున నాటి సభాసదులకే కాక మనకుగూడ గనబడునట్లుగా జేసినాడు కవిబ్రహ్మ.

క. ఏమేమీ యని గోప
స్తోమము బలుమాఱు నడుగుచుఁ మెయి వొదలఁ
భూమీశుఁ డపుడు మంత్రుల
మోములు గనుగొని సగర్వమున నిట్లనియెన్. ౨౮౧

“ఏమేమీ” అని విరాటుడు పలుమాఱు అడుగ జొచ్చినాడు. ఎన్ని మాఱ్లు వినినను విన కుతూహల మెుందుచున్నాడు. వినినదే మరల మరల విన నిచ్ఛగించుచున్నాడని యభిప్రాయము. “మంత్రుల మోములు గనుగొని” అనుదానిలో విరాటుని గర్వాతిశయ మంతయు వ్యక్తమగుచున్నది.

శా. వీటన్ వీథుల నెల్ల నేనుగులపై విస్ఫార ఘంటాధ్వనిం
జాటం బంపుఁడు పేర్మి నుత్తరుజయాశ్చర్యంబు బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహితస్ఫీతసువ్రాతముఁ
ఘోటస్యందనవారణప్రతతులం గూడన్ సతూర్యంబుగన్. ౨౮౨

విరాటుని గర్వమంతయు నాతని పలుకులలో వ్యక్తమగుచున్నది. ఉత్తరుని జయమును జాట బంపు డనినాడు. “వీటన్, వీథులన్, ఎల్లన్” అను క్రమపదములు సంరంభమందలి వరిగసమును స్పష్టీకరించుచున్నవి. పట్టణమంతయు జాటబంపుడనినాడు. అంతతో సంతృప్తికలుగలేదు. “వీథులన్” అనినాడు. అంతటితో గూడ చాలుననిపించలేదు. “ఎల్లన్” అని పలికిగాని సంతృప్తి నొందలేదు. మొదటి పదములలోనే యిట్టి సంరంభమును జూపి ఇంకను సంబరమొందుచు బలికినాడు. ఉత్తరుని జయమునుమాత్ర మూరకొనక “ఉత్తరు జయాశ్చర్యము” అని పలికినాడు. నిజముగా నది ఆశ్చర్యమైన జయమేకదా. విన్నవారందఱు నిదియేమియాశ్చర్యమని తలంతురని భావము. ఈ పద్యము “సతూర్యం బుగన్” అని అంతమగుట మఱియు సారస్యమైనది. “సతూర్యంబుగన్ ఘోటస్యందన వారణ ప్రతతులం బుచ్చుడు” అని పలుకుటకంటె నిట్లుగా దిరుగవేసి పలుకుటలో వడితనము వ్యక్తమగుచున్నది. “నెత్తం బొకపలుక యాడుదమే యని యుబ్బుమైమాటగా బలికినాడు. ‘నీవు సుమాళంబున నున్నవాడవు. నేను నీతోడనాడి జయింప నెఱతును” అని ధర్మజుడు పలికినాడు. ఆడినపుడెల్ల నాతడే గెల్చుచుండెనని యిందు

వ్యక్తమొనరించుటయేగాక పాండవులింక జయపరంపరలోనివారనికూడ నిట తిక్కన వ్యక్తమొనరించినాడు. విరాటుడు నగుచు సైరంధ్రిని సారెలు దెమ్మని పనిచి పలుక ముందటికి దిగిచికొనినాడు. ఇది విరాటుని తొందరపాటును దెల్పుచున్నది. సైరంధ్రి సారెలు దెచ్చులోపలనే ఆత డాటకు సిద్ధమగుచున్నాడని భావము. "ఇందురమ్ము" అని ధర్మజుని బిలిచినాడు. అప్పుడు ధర్మరా జిట్లనినాడు.

అ. జూద మాడి ధర్మసూనుండు రాజ్యంబు
నను జూచు బ్రియాంగనను బణంబు
గాఁగ నొడ్డి యాడి కాఱియబడడె య
ట్లగుట దీనితోడి యర్థి గీడు. ౨౪౫

ధర్మజునిమాటలు సార్థకములు. ఈ జూదము ధర్మజునకు దెబ్బ తగులుటతో నంతమొందినది.

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితోన్మాదంబుమై నిట్లనుం
గురుసైన్యంబుల ముట్టి గెల్చి యెలమిఁ గోవర్గముం దెచ్చె ను
త్తరు బాహాబలశౌర్యసారము లుదాత్తంబుల్ గదే యొందు నె
వ్వరు నెక్కాలము నిట్లు నేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్. ౨౪౬

విరాటు డీమాటల నున్మాదుడై పలికినాడని తిక్కన చమత్కారముగ రచించినాడు. తనకొడు కంతటివాడైనందులకు మిన్నుముట్టియున్న ప్రమోదసంపదయంతయు నాతని వెఱ్ఱిచేసి యీ మాటలను బలికించినదని సారస్యము. సంపద ఉన్మాదమును (గర్వభూయిష్ఠమును) గలిగించగా విరాటు డాడినపలుకు లివి యని భావము. ఈపద్యమందు పొల్లు అక్షరములను గవి వాడి దిట్టతనమునకు గొఱత ప్రకటించి విరాటుని పరిస్థితిని సరిచూపినాడు. ధర్మజు డపు డిటుల పలికినాడు.

చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్య మహోగ్ర యోధ వి
స్ఫురణము నోర్వజాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుడ జయించెనేని వసుధావర యింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధర బ్రసిద్ధికి నెక్కఁడె యాత డొక్కఁడున్. ౨౪౭

అర్జునుడు (తమ్ముడు) ఘనకార్యము సాధించుకొని వచ్చినందుల కుప్పొంగుచున్నవాడు ధర్మజుడు. అసలు కార్యము సాధించుకొనివచ్చిన వాడు బృహన్నలగా ప్రవేశించుచున్నాడేగాని అర్జునుడుగా ప్రవేశించుటలేదు. (ఉత్తరుడిదె తాను సూతుడు నగ్రత వచ్చుచున్నవాడు అని దూతలు పలికినారు.) కావున ధర్మజుడును నిపుడు తొందరపడలేదు. వ్యక్తము కాలేదు. కాని ధర్మజునకు లోనగల్గిన యుత్సాహ మీమాటల బలికించుచున్నవి. దేశకాలముల గుర్తెఱిగినవాడు ధర్మజుడు. విరాటుడు కేవల మంధుడుగ నున్నాడు. ఈ తారతమ్య మీసంవాదమున స్పష్టము చేయుచున్నాడు తిక్కన. విరాటునినోట పౌరుషవచనములను పెట్టినాడు. ధర్మజునినోట ధీమాను ప్రకటించినాడు. "సర్వజాలి ఉత్తరుడు జయించెనేని" అనుపదము లీభావమును ప్రకటింపజేయుచున్నవి. "ఉత్తరుడే కౌరవుల జయించిన ధరలో ప్రసిద్ధికి నెక్కుడే" అని పలుకుటలో రెండభిప్రాయము లున్నవి. ఈవిజయ మిట్లే నిజమైనచో (నిజముగా నుత్తరుడే యుద్ధమొనర్చి జయించినచో) నిటుపై నాకొడుకు పుత్రునియందెల్ల గీర్తివంతు డగును అనునది ఒక యభిప్రాయము. ఇది పద్యమందు స్పష్టముగా గనబడుచున్న యర్థము. ఉత్తరుడే యుద్ధమున జయముగొనుట జరిగియుండదు. అట్లయిన నతడిప్పటికే ధరయందు ప్రసిద్ధి పొందియుండవలసినది. ఏ ప్రసిద్ధియు లేనివాడిప్పు డీ ఘనకార్యము గావించినాడనగా రాజా! నీవెటుల విశ్వసించితివి అని ధర్మజుడు పలికినా డనునది రెండవ యభిప్రాయము. ఈ రెండవ అభిప్రాయము విరాటునకును నచ్చనిది. "ఓర్చుకొనినాను. ఇంక నీమాట యుడుగుము" అని పలికినాడు. కటంబు లదర గన్నుల గెంపు గదుర బలుక చప్పు డగ్గలంబుగా నెత్తు మాడుచున్నాడు. జూదములో విరాటు డోడిపోవుచున్నాడని తిక్కన యిందు ధ్వనింపజేసినాడు. ఓడిపోవు చుండుటయు, పైని కంకుని పొడుపుమాటలును నప్పుడు విరాటుని నెక్కువగా నిబ్బంది పెట్టినవి. ధర్మజుడది సరకుచేయలేదు. మొదటలో విరాటు నుద్దేశించి "నీవు సుమాళంబున నున్నవాడవు" అని ధర్మజుడు పలికియున్నాడు. నిజముగా నంతకన్న ధర్మజుడును సుమాళంబుననే యున్నవాడు. ఆ సమయమున నా [illegible] కొంచపుటకే యిచ్చయించి

నాడు కాని ఓడువాడు కాలేదు. చిరకాలముగా బరాభవము నోర్చుకొనియున్న ధర్మజు డాశత్రువులను బూర్తిగా బరిభవించి తమ్ముడు వచ్చియున్నాడని తెలిసికొనినాడు. పట్టరాని ఆనందమున మునిగిపోయినాడు. కావున విరాటుని సరకుచేయకున్నాడు. ధర్మజుని యుత్సాహ మింకను నిటుల బలికించుచున్నది.

చ. కురుబల మేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వరాదె యు
త్తరునకు నా బృహన్నల రథంబుపయిం బరవాహినీ భయం
కర భుజసారముల్ మెఱయగా దఱి గాంచితి నంచు విక్రమో
ద్ధురగతి నాజికేళి నిరతుం డయి దుర్గమలీల నుండగన్. ౨౫౨

విరాటుడు సహింపక పలికినట్లే ధర్మజుడును నామాటలు సహింపక యిట్లు పలికినాడని భావము. "తఱిగాంచితి నంచు" అనునది ధర్మజుని పరమోత్సాహమును బూర్తిగా వ్యక్తీకరించుచున్నది. "అర్జునున కెట్టి అమూల్యావకాశము లభించినది" అని ఉప్పొంగుచున్నాడని భావము. విరాటోత్తరులకుకంటె ధర్మరాజార్జునులకే ఆయుద్ధము హెచ్చు సంబంధము గల్గియున్నదని ఇందున్న చమత్కారము "గెల్వ రాదె" అనుదానిలో "రాదె" అను పదము ఈ పద్యమున దలమానికమై యొప్పియున్నది. ధర్మజుని ఉదారాంతరంగమంతయు నాపదమం దుట్టిపడుచున్నది ధర్మరా జీమాటలు పలుకగా విని విరాటుడు సక్రోధహాసోల్లాసవికృతాననుడైనాడు. కొడుకు పొగడ్త నాల మొనవచ్చుచున్నందున క్రోధము గల్గినది. పేడిని తెగపొగడుచున్నందున హాసము గల్గినది ఉత్తరు జయాశ్చర్య సంజనితమైన యుత్సాహము గల్గియున్నది. ఆ యుత్సాహ ముప్పొంగుపరికి కంకుని విఱుపుమాటలు వినవలసి వచ్చుచున్నది. అందువలన వికృతాననమైనది. ఈ క్రోధము హాసము, ఉల్లాసము, వికృతాననత్వము వ్యక్తమగునటుల నీ ముందు పద్య మిట్లుగా దిక్కన రచించినాడు.

ఉ వింతలు సాల నీవలన వింటిమిగాని ధరిత్రి నెందు నే
మింతకుమున్ను సారథుల నెవ్వరి జూడమె వైరివీర దు
ర్దాంత భుజావిలాస మలరం దెగి పోరుల నస్త్రశస్త్ర వి
క్రాంతి గడంగువారి [illegible] లు చాలుచుండగన్. ౨౫౩

సారథుల పరాక్రమము జూపి మెఱయువారి నెందయిన చూచితిమా, వింటిమా అని విరాటుడు పలికినాడు. ఇట్లు పలుకుచుండగనే యాతనికి బట్టరానంత కోపము వచ్చినది. కన్నుల నిప్పులు రాలుచుండినవి. "అని కన్నుల నిప్పులు రాలుచుండగన్" అని పద్య మంతమగుట బహుసారస్యమైనది. విరాటుని కోపవేగ మిందు సుస్పష్టమగుచున్నది.

క. నాకొడుకు పోటుమాటలు
నీకేటికి బొంకగ నాడనేర్పు పరాకృతి
ప్రేకమున బలుకుచుండుట
మాకు సహింపంగ రాదు మానుము విప్రా. ౨౬౭

"బొంకగనాడనేర్తువు" అనగా నీజిహ్వ ఎందుకు తెగ్గక రాలేదు. నాకొడుకు జయించినాడని నీనోట నేల పలుకజాలకున్నావు. నీయంత మూర్ఖత్వ మేలనోయి సహింపలేను. "బొంకడా" అనినాడు. "ఆడనేరవు" అనుటచే ధర్మజు డట్టి జయోత్సాహ మెంతగా బొందియున్నదియు వ్యక్తీకరించుచున్నది గౌరవనీయునందు గౌరవనీయుడు చూపు కోపరసమంతయు నిందు పుట్టిపడుచున్నది. కంకునియం దాతని కెంత గౌరవ ముండినదియు ఈ పద్యము వ్యక్తముచేయుచున్నది. నిజముగా ధర్మజు డీమాటల సహింపలేకున్నాడు. తనతమ్ముడు జయించుకొని రాగా నుత్తరుడు జయించినాడని అతడెటుల పలుకగలడు నోట పలుకజాలకుండెను. గాంభీర్యహృదయుడగు ధర్మజు డప్పుడు "విప్రా" అను సంబోధనమునుగూడ సహించలేడు. అప్పుడు జూదమున గెలుపొందుచున్నాడు. అనుజజయోత్సాహ మాటయం దత్యుత్సాహమును గల్గించుచున్నది.

క. అనినం జలపడిన గుంతీ
తనయాగ్రజు డిట్టు లనియె దరహాసం బా
ననమున ముసగుపడగ న
జ్జననాయకుతోడ నిట్లు శంకితభంగిన్. ౨౬౮

ధర్మజుని హృదయగతోత్సాహ మెటుల నభివ్యక్త మగుచున్నదియు నీ పద్యము వ్యక్తీకరించుచున్న

ఉ. ఆహవకేళి వేడుక బృహన్నల చిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని సారథిగా గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీ పసుల నొక్కఁడు దక్కక యుండ సత్వరో
త్సాహత దెచ్చె గావలయు దప్పదు నాపలుకట్ల చూడుమీ. ౨౫౮

క. అని యంతట నిలువక య
మ్మనుజేశ్వరు మొగము జూచి మఱియును నతఁడి
ట్లను బురము లోన జాటం
బనుపు బృహన్నలజయంబు భవ్యవిచారా. ౨౫౯

యథార్థస్థితినిబ నలుపెట్టినాడు. అంత నిలువక ఆతని మొగముచూచు చునే (మొగమాటములేక తనయుత్సాహమును మాత్రమే పురస్కరించుకొని)బృహన్నల జయము జాటబంపుము అనినాడు. "భవ్యవిచారా" అనగా నాలోచించవోయి దక్షిణ గోగ్రహణమును స్మరించవోయి అని నాడని చమత్కారము. ఇంత ఉత్సాహసమయములోగూడ బృహన్నల యని పలికినాడేగాని అసలు సంగతిని వ్యక్తీకరించినాడు కాదు. అదియే ఉత్తములగు పాండవులలోనున్న అనన్యమైన గాంభీర్యము. 'ఒక్కఁడు' అనుపదమిచ్చట బహుచమత్కారముగా బ్రయోగింపబడియున్నది. ఉత్తరున కిందు లవలేశమైన సంబంధము లేదు. ఆ విజయమంతయు నా బృహన్నలదే (తన తమ్మునిదే) అని ఆతడు పరమావధిగా బలికి నాడని ఆపదము దెల్పుచున్నది. మఱియు "పశుల" పదముతో చేరి సంపూర్ణ కార్యసాధనను దెల్పుచున్నది. "దెచ్చె గావలయు" అనునది ఏకపదముగాను, భిన్నపదములుగాను నందగించుచున్నది. ఈపదము పిదప నున్న "తప్పదు, నాపలుకు, అట్ల చూడుమీ" అనునవి మఱియు నందగించుచున్నవి.

ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగ
బడగయెత్తు నురగపాలురేఖ
నెవము చేతిసారె గొనివ్రేసె బతి వేడి
గడన యుడుగు నున్న నుడుగ వనుచు. ౨౬౦

ధర్మజునినోట నిట్టిమాటలు రాగానే ఇదివఱకే సహింపలేకుండ నున్నవిరాటుడు పద్రుద్దేరి ... [illegible] ము తాండవించినది. చేతిసా

రెతో ధర్మజుని గొట్టివేసినాడు. ఆవేశమున దబ్బాటున కొట్టివేసి పిదప "పేడిగడన యుడుగుమన్న నుడుగవు" అనినాడు. కొట్టివేసిన పిదప పలుకులే ఈ సందర్భమునకు దగినట్టివి. అజాతశత్రుడు అలుక గదరని హృదయంబుతో బాంచాలింజూచినాడు, ఇచ్చట "అజాతశత్రుడు" అను పద ముపయోగింపబడుట రసవంతమైన విషయము. ఎవరి యుత్సాహము వారిదిగాన విరాటునిపై ధర్మజునకు గోపకారణమే లేదని సారస్యము. "పాంచాలి దెసం జూడ్కి మఱగ నూరకుండె" ననుదానిలో ధర్మజునిలో నున్న యుత్సాహ మామె గ్రహించిన ట్లయినదని సారస్యము. ఊరక కుండె ననుటలో నటుపైని ద్రౌపదియే పనిచేయవలెనని ధర్మజుడు సూచించినాడని భావము. ఆమె తన యుత్తరీయమున నారుధిరము దుడిచి ఉపచార మొనర్చుచున్నది. "అలుకగదురని హృదయంబుతోడం బాంచాలిదెసం జూడ్కి మఱగ" ఇంవలి పూర్వానుస్వారములు ధర్మజుని నిండుమనంబున కన్వర్థములుగా నున్నవి.

ఉత్తరుడు పురములో బ్రవేశించునపు డాతని నందఱు నుతింపుచుండిరి. ఆ గొమ్ముడు వారల కోర్వక ఆత దర్మజునంబుతో నిట్లని నాడు.

చ. కురుబలముం జయించుటయు గోవుల దెచ్చుటయుం బృహన్నలా
స్ఫురిత భుజాబలంబునన చూవె నిజం బిది నాక యేల యొ
వ్వరికిని నెవ్వరిం గెలువవచ్చున యిట్టి సహాయసంపదం
బొరయక యున్న మీ కెలుగ బోలునె నాబ్రదు కెట్టిభంగియో.

"ఎవ్వరికిని నెవ్వరిం గెలువవచ్చు" నని పలికించుటలో నుత్తరుడు కొంతవఱకు యుద్ధవ్యాపార మొఱిగినవాడని స్పష్ట మొనర్చినాడు తిక్కన. అర్జును డుచితముగా ధని గౌరవమున జేయుచుండినాడని ఉత్తరు డిం దభిప్రాయము దెల్పినాడు. "ఇట్టి సహాయసంపదం బొరయక యున్న మీ కెలుగ బోలునె నాబ్రదు కెట్టిభంగియో" అనుదానిలో నాచేత మీకు దెలియదా, నా మొఱము నేనేమి కురుబలమును జయించు లేమి" అని పలికినాడని చమత్కారము. "ఈతని సహాయమే లేకుండిన నేనాయుద్ధమున నెంతయో చిక్కుపడిపోయి యుండుదునుసుమీ" అని పైకి పలికినట్లుగా నిందుగలదు.

ఉత్తరుడు లోన బ్రవేశించి తండ్రికి బ్రణమిల్లినాడు. విరాటు డెంతో సేపు కుమారుని గౌగిలించుకొనినాడు. ఉత్తరుడు వెనువెంటనే ధర్మజునకు నమస్కరించినాడు. మొగముగంటిచూచి "ఇదియేమి" అని యడిగినాడు. విరాటు డది యెఱిగింపగా భయసంభ్రమములు మల్లడి గొన నుత్తరుడు తండ్రితో "తప్పుసేసితిరి" అనినాడు. విరాటు డుత్తరునిమాట ప్రకారము ధర్మజుని వేడికొనినాడు. రాజు దెస దాను ప్రసన్నుడగుట ప్రకటిత మగునటుల బలికినాడు ధర్మరాజు. ధర్మజుని యాదేశానుసార మంతనమునకు కావలనుండిన బృహన్నల లోన బ్రవేశించినాడు. ఆతడు బ్రవేశించినపిమ్మట విరాటు డుత్తరుని సమరప్రకార మడిగినాడు. ద్రోణాదిమహావీరుల నెట్లోర్చితివి అని అడిగి యిట్లు పలికినాడు.

ఉ. గోవుల నెట్టు లాగితి వకుంఠితవిక్రముడైన రాజరా
జేవిధి మానభంగమున గెల్లను నోర్చి పలాయమానుడై
నీ విజయంబు సైచి ఘననిందకు నియ్యకొనంగ జాలె బు
త్రా వెఱగయ్యెడుం రణవిధం బఖిలంబు నెఱుంగ జెప్పుమా. ౨౮౩

"ఓర్చి, సైచి, ఇయ్యకొనంగజాలె" అనునవి మంచి సొగసుగా బ్రయోగింపబడియున్నవి. "పుత్రా" అను సంబోధనముకూడ విస్మృతార్థమును గల్పించుచున్నది. "నేను కురుసేనల గెల్వలేదు. దేవసంజనితుడు నాగ నర్హ్యమగు చందనువాడు మహాత్ముడొక్క డని నను గాచినాడు. కౌరవులనందఱ గెల్చినాడు. గోవులమరలించినాడు. నేను కౌరవ సేనను జూచి పడవడ వడకి పాఱజొచ్చినాను. ఓడ కోడకు మని నన్ను గూడవచ్చి పట్టుకొని మగుడ గొనిపోయి రథముపై బెట్టిన నేనతని యాజ్ఞకు మిగుల కుండితిని" అని తెల్పినాడు. "నే నతనియాజ్ఞకు మిగుల కుండితి" అని ఉత్తరుడు చమత్కారముగ బలికినాడు. విరాటుడు నిండు పేరోలగంబున నున్నాడు గాన గౌరవము నిలబెట్టుకొనుచు, విరాటుని ఉత్సాహమును సమూలము చెఱిపివేయకుండ నుత్తరుడుత్తమరీతిని బలికినాడు. సారథ్యము తానొనర్చితిని అని స్పష్టము చేయునట్లు పలుకుటలోనే విశేషమున్నది. ఉత్తరుడు దీనిని గోప్యము చేయుచునే విషయమంతయు నెఱిగించినాడు.

ఉ. కౌరవసేన గోగణము గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజు గానక యుపాంతమునం దొలగించి వేగ నా
తే రట దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబు దు
ద్వారరయంబు మాన్చి పశువర్గము నిద్దెస వెల్వ నార్చుచున్. ౨౮౮

"వేగనాతేరటదోలి" ఇందు "నాతేరు" అనియు "ఆతేరు" అనియు పదమేర్పడుట గమనింపదగినది. తోలి అనునది తోలి తోలించి అను నర్థముల గల్పించుటయు గమనింపదగినది. ఉత్తరుడు తాను పాఱి పోవచ్చితిని అని పలుకుటలోగూడ గాంభీర్యము నుంచుకొని జాగ్రత్తగా బలికియున్నాడు.

తే. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడి
వడగ జనుమూక గని వడవడ వడంకి
పాఱు తేరంగ నమ్మహాభాగు డప్పు
డోడ కోడకు మని నన్ను గూడ వచ్చి. ౨౮౬

ఇందు "నేను పాఱిపోగా" అని పలికినట్లు లేదు. ఆ అర్థము గ్రహింపు అగునటుల నుత్తరుడు పలికినాడు. ఆపరిస్థితిలో బలుకవలసిన నుచితరీతిని ఉత్తరుడు గమనించి పలికినాడు. "ఓడకోడకుము" అను నదియు గవి చాలా జాగ్రత్తగా బ్రయోగించినాడు. ఉత్తరుని రాజ మర్యాదయందే అది కొంతగా ప్రతిఫలించుచున్నది. ఎవరు లేనిచోట పాండవులు బయల్పడిన నవసరమున యథాస్థితిని ఉత్తరుడు దెల్పినాడు. అవి ఆపట్టున కెంతయు దగియున్నది. అర్జునుని ఘనత కది మఱియు పోషణముగా నున్నది. ఉత్తరు డిట్లు పలికినాడు.

చ. ఒకరుడ తాను భీతి వెగడొందెడు రెండవ నన్ను నెట్టకే
లకు దగ దేర్చునప్పుడు బలంబులతో గురురాజు సూడ దా
నికి మది శంకలేమి మహనీయపరాక్రముడైన యీ కిరీ
టికి జనుగాక యివ్విధము డెప్పర మన్యుల కోర్వ వచ్చునే. ౩౩౬

చ. తము నెఱిగించి యల్ల నుచితప్రియభాషల నన్ను నూఱకృ
త్యమునకు జొన్ప నేను బ్రమదంబున నప్పటి కియ్యకొంటి లో
కముసమరంబు లట్ల యని కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యముల జరింప జేత భరమె తా ... సోహటించితిన్. ౩౩౭

క. మొగమోడ డితడు గౌరవ
జగతీశుడు విఱిగినపుడు జవమున వెనుకం
దగిలి యిది జూద మాడగ
నగునెడగా దఱుమవలయు ననియె నతనితోన్. 33౮

ఇది అర్జునుని కార్యశూరతను ప్రస్ఫుట మొనర్చుచున్నది. అర్జునుడు దుర్యోధను నుపాలంభించినసంగతిని ఇక్కడనే తెల్పినా డుత్తరుడు. మొదటలో దెల్పలేదు. అప్పుడు ధర్మజుడు పెడమొగమై యున్నాడు. అర్జునుని జక్కజూడలే దాతడు. కావున నుత్తరు డీవిషయము చెప్పదలంచలేదు. యుద్ధమెట్లు నడచినదియు మాత్రము తెల్పినాడు. కావుననే బృహన్నలయు "జతురంబుగా బలికి తిదియ తెలుపు తెఱంగు ధర్మనందనునకు నింతకుమిక్కిలి యొఱింగింపకుండునది" అని ఉత్తరునితో బలికినాడు. అనంతర మాత డుత్తరకు బొమ్మపొత్తికల నిచ్చినాడు.

పాండవులును ద్రౌపదియు నొకచోట సమావేశమైరి. గోగణనివర్తనంబును, రణప్రవర్తనంబును నన్యోన్యవిదితంబైన యనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుడు భీమసేనునితో "[illegible] జూడకున్నాడీతడు. కారణ మరయ లేకున్నాను" అని పలికినాడు. [illegible] తన్ను విరాటుడు చేతిసారెతో గొట్టినసంగతిని దెల్ప మొగము గంటిసూపినాడు. ఇక్కడ "అగ్రజుడు, భీమసేనుడు, బీభత్సుడు" అనుపదములను గవి సాభిప్రాయముగా వ్రాసినాడు.

క. అని చెప్పి గంటిసూపిన
ననిలతనూభవుడు గనలి యాదుష్టాత్మున్
దనయాదిబంధుయుతముగ
ననిచెద జముప్రోలి కనియె నంగము వొంగన్. 3౧౦

వ. కిరీటియుం గోపించి. 3౧౧

క. తనకొలది యెఱుంగని యి
మ్మనుజాధము నిపుడ పట్టి మర్దింపక త
క్కినగాదు వీని రాజ్యము
నిను [illegible] ధరజుతోన్. 3౧౨

చ. అనవుడు నాత డిట్టు లను నక్కట యింతకుముంద రేమియున్
మనల నెఱుంగ డవ్విభునిమాటున బూనికఁ దీర్చికొంటి మా
తని కొక యొగ్గు సేత యుచితంబె యెఱింగెడునట్టు గాగ బో
యిన గనియున్ దురుద్ధతి సహించిన జాతము గాక పిమ్మటన్. 3౧3

ఇవి నిజముగా భీమసేనుడు, బీభత్సుడు, వారి కగ్రజుడు పలికిన మాటలుగానే యున్నవి. దుష్టాత్ముడనినాడు భీమసేనుడు, మనుజాధముడనినాడు బీభత్సుడు, దురుద్ధతి అనినా డగ్రజుడు. జగదేక సార్వభౌముని కెట్లును ఎగ్గాచరింపరాదు. అది జరిగించినవాడు శిక్షాపాత్రుడగును అనుభావమున నీముగ్గురు నిక్కడ ప్రసంగించిరి. మఱియు నీపద్యములు ధర్మజభీమార్జునుల స్వభావములనుగూడ చక్కగా వ్యక్తీకరించుచున్నవి. సబాంధవముగ జంపువాడు భీమసేనుడు తగువిధమున బలికినాడు. తనకొలది యెఱుంగనివానిరాజ్య మన్యథా గావలసినదే అనినాడు బీభత్సుడు. ఇచ్చట "కరిటి" అని పద ముపయోగింపబడుటయు సాభిప్రాయముగా నున్నది. తప్పునిర్ణయముకానిదే దండనము వలదనినాడు ధర్మరాజు.

మఱునాడుదయమున పాండవులు రాజవేషములు ధరించి నగరికి బోయిరి. ధర్మసుతుడు సింహాసనమును, భీమాదు లాత్మసముచిత రుచిరాసనముల బంచాగ్నులుబోలె నాసీనులైరి. కొల్వుండు బుద్ధిగల్గి విరాటుడు త్తరునితోడ నచ్చటకు వచ్చి విస్మయమంది యొల్లవముగ దలంచుచు నిట్లనినాడు.

క. ఇదియేమి కంక నీ వు
న్మదవృత్తిని శంక పక్కి నా గద్దెయపై
బదిలంబుగ గూర్చుంటివి
వదియును గా కిపుడు డిగ వహంకారమునన్. 3౧౪

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కిట్లనియె. 3౧౯

సీ. నడదివియలు సేసె నగరికి మాణిక్య
మకుటముల్ ఘూనిన

దగునాజ్ఞ సూయాణముగ నొనరించె మం
చిగ నేలనాలుగుసెఱగులకును
ర్థి తార్థిజనుల సచేతన త్యాగధ్వ
జములుగా నన్ని దేశముల బఱపె
దిక్కులన్నింటను చెలుపారు పూతగా
వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు
తే. రాజసూయాధ్వరప్రవర్తకుడు నిత్య
సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ
రాజు సుమ్ము మత్స్యావనీరమణ యితడు. ౩౨౦

ఉ. ఈత డజాతశత్రుడు మహిం దగ దిగ్విజయంబు సేసె వి
ద్యాతిశయార్థి వాసవుమహాసన మైనను నెక్క నర్హు డు
ద్ద్యోతితమూర్తి గౌరవకులోద్భవు డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రు డీ చిఱుతగద్దియకుం దగడే నరేశ్వరా. ౩౨౧

సంవత్సరమునుండి కంకుడు విరాటుడువలెనే వ్యవహారించుచున్నాడు. నిన్నను బృహన్నలను పొగడి నోటికివచ్చినట్లెల్ల మాటాడినాడు. నేడుసింహాసనమే యెక్కిపోయినాడు. నిన్నటి వ్యాపారమును మించియున్న దీనాటి వ్యాపారము. కంకున కంతకంతకు అహంకారము మిక్కటమైనదని విరాటుడు తలంచినాడు. అంతటి అకృత్యమాచరించియు తన్ను గాంచికూడ లేవకుండుట మఱియు నాశ్చర్య మనిపించిన దాతనికి. అప్పుడు సంక్రందననందనుడు బదులు పలికినాడు. సంక్రందననందనుడు అను పదమును రసవంతముగ గవి ప్రయోగించినాడు. శత్రువుల నాక్రోశింపజేయువాడు సంక్రందనుడు. అర్జునుని మాటలు వైరిగర్వ నిర్మూలములైనవని సారస్యము. ఈ సీసపద్యమందు కవి క్రమపూర్ణత్వమును లిఖించినాడు. మనుజపతులు, నేలనాలుగు సెఱగులు, అన్ని దేశములు, అన్ని దిక్కులు అనునవి అంతకంతకు నిండును దెల్పుచున్నవి. అర్జును డిందు ధర్మజుని ఘనతను వర్ణించి చెప్పినాడు. ఇట్లే ద్రౌపదిగూడ భీమసేనుని ముందర ధర్మజునిగాదుర్దశను వర్ణించి పలికినది. (౨-౧౮౭-౧౯౨) ఈపద్యములందు గవి [illegible] పుగసన్నమును భిన్నరీతుల రచించి

యున్నాడు. అర్జునునినోట పురుషోచితవచనము, ద్రౌపదినోట స్త్రీ ప్రకృతి వచనము వెలువరించినాడు కవి. పై పద్యముల నన్నిటిని గమనించినచో నీరీతి సువ్యక్తమగును. మఱియు వీర వీరపత్నీ వచనములుగాను, అందు విశేషించి జగదేకవీర తత్పత్నీ వచనములుగానుగూడ రచించినాడు. అజాతశత్రుడు దిగ్విజయమొనరించినాడనుటలోనే ధర్మజుని అనన్య సామర్థ్యము సువ్యక్తమగుచున్నది.

అర్జును డిటుల పలుకుటకు విస్మయసంశయములు మనమున పెనగొనగా విరాటుడు "భీమాదులేరి" అని ప్రశ్నించినాడు. అర్జునుడు వారి నెఱిగించినాడు. ఇందొక్కొక్కరి విషయమై రెండేసి పద్యములలో దెల్పినాడు. మొదటిపద్యములు విరాటసంబంధమును, రెండవ పద్యములు వారివారి మహిమలను దెల్పుచున్నవి.

వ. అన విని యద్భుతరసాక్రాంతం బగు నంతరంగంబునం గలుగు సందే
హావేశంబు వినయసంభ్రమంబుల నిగుడనీ కునికింజేసి చిక్కువడి
యున్న నిజజనకునకు నర్జునుం జూపి యుత్తరుం డిట్లనియె. ౩౩౮

ఆశ్చర్యముమీద నాశ్చర్యమును జూచుచున్నాడు విరాటుడు. ఇపు డాతనికి సందేహము గల్గినది. కేవలము సందేహమే కాదు. అది సందేహావేశమైనది.

ఆ. అనిన నతడు వెఱపు నత్యాదరంబును
సంతసంబు మానసమున బెరయ
నవయవముల సంభ్రమావేశ మేర్పడ
గారవమున నిడయు గౌగిలించె. ౩౩౯

ఇదివఱకు సందేహావేశముననున్న విరాటు డిపుడు సంభ్రమావేశ మందినాడు. సంభ్రమావేశ మేర్పడినపని రచించుట మఱియు గంభీరముగా నున్నది. ఇట్లుగా విరాటుడు ఆవేశపరంపరలో మునుగుచున్నాడని సారస్యము.

క. వినయంబు మిగుల గుంతీ
తనయాగ్రజు పాదపీఠతలమున ఫాలం
బును బొంద జాగి మ్రొక్కియ
తని కౌగిలి వడసె సమా[illegible]త్మన్. ౩౪౦

మ్రొక్కిన విరాటుని ధర్మజు డాలింగన మొనరించినాడని రచిం చినచో నీ సొగసురాదు. విరాటుడు ధర్మజునిచే నాలింగితు డైనాడని రచించినను ఇంత సొగసురాదు. విరాటుడు ధర్మరాజు కౌగిలివడసినా డనుటలో గొప్ప సొగసు గలదు. ధర్మజుడు కౌగిలించుటలోనున్న గొప్పతనము అట్టి కౌగిలి వడసిన విరాటుని యదృష్టము ఇందు సువ్యక్త మగుచున్నది. విరాటుడు తన వస్త్రమంతటితోడ ధర్మరాజును గొలిచి నాడు. ఉత్తరునిమాట ననుసరించి ఉత్తర నలంకరించి మంత్రులచేత దెప్పించినాడు.

క. పదనికి రా బులు గడిగిన
మదనాస్త్రముౌరేఖ గలిగి మానిసిమెయి సె
న్నొదవ గయిసేసి రప్పుడు
ముదితాళినములు ప్రమోదమున లలితముగన్. ౩౫౫

వ. ఇట్లు శృంగారంబు సేసిన యమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలి కలతోడి గొడుగులు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు దోడ్తే ధారాధరనికర మనోహరయగు పర్జన్యలక్ష్మియుం బోలె వచ్చుచున్నం గని విరాటుం డెదురువోయి పురోహితులును బంధు జనంబులుం దానునుం బొదివికొని పాండవాగ్రజు సగ్రభాగంబు నకుం దెచ్చి యచ్చోటున నిలిపి సపరివారంబుగా దండప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యిట్లనియె. ౩౫౬

శృంగారింపబడుచున్న ఉత్తర మదనాస్త్రరేఖగా విలసిల్లినదని కవి రచించినాడు. సంవత్సరముక్రిందట పాండవులు ప్రవేశించునపుడు ఉత్తర సభాస్థలికి వచ్చియున్నది. మరల నిపుడు వచ్చుచున్నది. అప్పుడు "అలరువిలుతు పువ్వుటమ్మువోలె చనుదెంచినది" (౧-౨౬౫) ఇప్పుడు మదనాస్త్రరేఖగానున్నది. అమ్ముకంటె అస్త్రము తీక్ష్ణమైనది. మఱియు నమోఘమైనది. అట్టి మదనాస్త్రరేఖగా నిప్పు డుత్తర యొప్పియున్నది. "అలరువిలుతు" అను పదముకంటె "మదన" అను పదము రసిక భావమును బుష్టీకరించుచున్నది. బృహన్నలను సాహచర్యము చేయ ప్రార్థింపవచ్చిన ఉత్తర "...మొగుడు మొగిలుసొచ్చు తెఱగున నాట్యమంది రము సొచ్చినది" (౧-... గాడొప్పి... సొచ్చు మెఱుగుగా నొప్పియున్న
... [illegible]

యుత్తర ఈనాడు ధారాధరనికరమనోహరయగు పర్జన్య లక్ష్మియుం బోలె వచ్చుచున్నది. పర్జన్యలక్ష్మియను పదము బహుచక్కగా నున్నది. పర్జన్యాధిదేవత ఇంద్రుడు. ఇంద్రకుమార సంబంధిగా నున్నది ఉత్తర గాన నీపదము బహు సందర్భముగ నున్నది. ౩౬౦ పద్యములో "ఇంద్రసుతుండవన మాలోకించి" అనిగూడ సాభిప్రాయముగా తిక్కన రచించియున్నాడు. విరాటపర్వము పారాయణము వృష్టిప్రదముగాన నుత్తరపర్జన్యలక్ష్మింబోలె వచ్చుచున్న దని యింకొక సారస్యము. "గోడుగులు పట్టించి" యను పద మిచట మఱియు సమయంతముగా నున్నది. "అలరవిలుతు పుష్పపస్తువోలె చనుదెంచిన ఉత్తర కొలువుసొచ్చి తండ్రికి మ్రొక్కిన దానాడు (సంవత్సరముక్రిందట) ఈ నాడు పర్జన్య లక్ష్మిబోలె వచ్చుచున్నది గాన విరాటుం డెదురువోయి పురోహి తులును బంధుజనంబులును దానునుం బొదివికొని తెచ్చినాడు. ఉత్తర నంతవఱకు తెచ్చినవా రమాత్యులు. అందున గొప్పవిశేషము గలదు. శృంగారంబు నేసిన యుత్తరయుకు నుత్తరసల్ప్రాలంబమాలికలతోడి గొడుగులు పట్టించి యమాత్యులు దో తెచ్చిరి. పర్జన్యలక్ష్మి యగు నాను ... ... కావించుట, గొడుగులు పట్టించుట, అమాత్యులు ... , విరాటుడు ... పురోహితులు, బంధుజనంబులు, ... తెచ్చుట క్రమక్రమముగా జరిగిపోయినవి అని తెల్పుచున్నటుల తిక్కన యొక్కడ రచన గావించుట బహుగంభీర ముగా నున్నది. "చనుదెంచె" (౧-౨౮౫) యను పదమున్న "వచ్చుచు న్నంగని" అనుపదము హెచ్చుహెచ్చుయలును తెల్పుచున్నది. ఇంకొక్క అపూర్వవిషయ మిచ్చట గర్భితముగా నున్నది. కౌరవ పాండవ యాదవ వంశములకు కీమెగర్భమే ఆధారము కానున్నది. కావున పంటవలం తిగాను ఉత్తర చనుదెంచుచున్నదని సారస్యము. ఉత్తర సంవత్సరము క్రిందట కొలువు చొచ్చినపుడు విరాటుడు తిగిచి కవుంగిలించినాడు. మొగము మొగంబున గదియమోపుట మొదలగునవి గావించినాడు. సంవత్సర ప్రస్థానమున ఉత్తర పెద్దదైనది కావున విరాటు డిపు డెదు రేగి కొనితెచ్చినాడు. ఎదిగిన పిల్లను ... నటుల దెచ్చినాడని యభిప్రాయము. "ఇష్ట... ... అని పలికినాడు.

విరాటు డిటులపలుకగానే కుంతీతనయాగ్రజు డింద్రసుతు వదన మాలోకించినాడు. "ఈ కన్నియను గోడలిగా గైకొనియెదను. లేనిచో లోకము నన్ను లోలాత్మునిగ శంకించును అదియునుంగాక నృత్తగీతాదులయెడ నిక్కోమలికి గురుండనైన నాకు నివ్విధంబు ధర్మంబుగాదు గావున హరి మేనల్లుడు కళాదక్షుడు ఆర్యసమ్మతుడు సకల సుగుణఖనియగు నభిమన్యు డీసరోజానను వరించుగాక" అని అర్జునుడు పలికినాడు.

అభిమన్యునకు వివాహము స్థిరపడినది. రెండు దెఱంగులవారును బంధువుల బిలువ గ బరులం బనిచిరి. ఇవ్విధంబునం బ్రకాశులై పాండునందనులు శమీవృక్షనిక్షిప్తసమస్తసాధనంబులు బూజాపూర్వకంబుగా దెచ్చికొని యుపప్లావ్యంబున వసియించిరి. బంధువులందఱు వచ్చిరి. వివాహ మత్యంతవైభవముగ జరిగినది.

తే. విహితపరిపాటితో విప్రవృద్ధజనులు
పుణ్యకర్మపరంపరబూని నడప
నర్థి గృష్ణ యుధిష్ఠిర పార్థ మత్స్య
వరులు దెరయొద్ద నవ్వధూవరుల నిలిపి. ౩౯౧

వ. సాంవత్సరిక దత్త కాల కళావిశేషంబుల మంగళతూర్యంబులు
సెలంగ నత్తెర యెత్తించిన. ౩౯౨

ఉ. వీనుల దియ్య మెక్క మును విన్కి బరస్పర రాగవృత్తిలో
నూనిన జూచువేడుకుల నువ్విళు లూరెడు నెమ్మనంబు ల
చ్చో నొకయింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్న య
మ్మానినియుం గుమారుడును మారవికారము లంకురింపగన్.

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు. ౩౯౪

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపై బాఱి
తిరుటమై నునుగాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోరము
నడుగుల యొప్పుపై నల్లనడగు
బలిమిలో [illegible]లు పడతుకమైదీవ
[illegible]గుచుండు

వెలదికటాక్షముల్ విభునిపై గ్రమమున
 నెగసి మోమున జొక్కి మగిడివచ్చు

తే. నొండురువ్వుల లేజెమటల నూని ప్రేగు
పడినచాడ్పున నవయువభంగులందు
దగిలి మఱపున దడయు నిద్దఱివిశాల
నయనదీప్తులు నెఱుకువ బయలుపడగ. ౩౯౫

వ. తదనంతరంబ. ౩౯౬

తే. ఒండొరుల దోయిళుల ననుపొంద జేయు
నక్షతప్రకరంబు లన్యోన్యమస్త
కముల బోసిరి సుందారకల్పలతలు
విరులు గమియ నొంటింటిపై గురియునట్లు. ౩౯౭

చ. లలితతనూవిలాసములు లజ్జకతంబున జేసి మున్ను వి
చ్చలవిడి బట్టగా వెరవుసాలక యోరలు వాఱుచూపులన్
లలి దలబ్రాలు వోయు నెడలం దగవొందిన నూలుకొల్పి యి
మ్ముల బచరింతు రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్. 

తే. చిత్తమున గాఢరాగంబు చేత జూపు
తెఱగుదోప గెంపారెడు తీగబోడి
మృదులపాణి గుమారుండు మెలపుమై గ్ర
హించె బల్లవాలంబిమత్తేభలీల. ౩౯౯

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. ౪౦౦

క. పెనుగుడుట నిడిన మాతం
బును నవమాలికయుబోలె బొలుపొందె రతం
డును నమ్ముగ్ధయు నేకా
సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్. ౪౦౧

సీ. కోర్కులు గెడగూడుకొని పారమెద్దుంగ
 జిత్తంబు లూఱట జిగురులొత్త
బులకాంకురములకు ద
 మేనను

దఱచివేచి చనబోయి తడబడి మార్గతి
వడి చూపు లాదట బయలుపఱుప
జెమటలతావులు తమలోన గలసి వే
ఱొక్క సౌరభ మయి చొక్కు నేయ
తే. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి
హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్ట పొరిబొరి గ్రమ్ము దేర
సమ్మదాంబుధి దేలిరి సతియు బతియు. ౮౦.

"విప్రవృద్ధజనులు పుణ్యకర్మపరంపర బూని నడప" అనుటచే కన్యాదానమువఱకు పాణిగ్రహణము (లగ్నము) జరిగినదని తెలియజేయ బడినది. "సాంవత్సరికదత్తకాలకళావిశేషంబుల" అనుటలో మహ సంకల్పపూర్వక కన్యాదానము, లగ్నసమయము సూచిత మగుచున్నది "అత్తెర యెత్తించిన" అనుటలో సుముహూర్తము జరుగుట సూచిత మగుచున్నది. "అమ్మానినియున్" అనుపదము వాడి తిక్కన యీ ఘట్ట మున కుత్తమత్వము చేకూర్చినాడు. లోనూనిన కోరిక నెఱవేఱినపుడే ఆకుమారుని (వరుని) సాపేక్షగా దిలకించిన మానినీమణి ఉత్తర యని సారస్యము. అమ్మానియు గుమారుడును మారవికారము లంకురింపగ నన్యోన్యావలోకనంబు నేసిరి. ఈ అన్యోన్యావలోకనము గరిమను దిక్కన చక్కగా వర్ణించినాడు.

"వరుడు, ముద్దియ" అనుపదము లాపాదభావమునకు బోష ణముగా నున్నవి. ఆ కన్యను వరించినవా డావరుడు. ఆ వరుని వల పించిన దాముద్దియ. వరుడు ముద్దియను జూచినాడు. ఆతనిచూడ్కి ముద్దియ వదనముపై బాఱినది. అందువలన గోరిక మెండయినది. ఆ వదనమండలి (ఆ ముద్దలొలుకు లేత నాజూకుతనముచూపు ముద్దియ వదనమండలి) నునుగాంతి తీపును గ్రోలుచున్నది. "చూడ్కి" అను ద్వ్యత్యాక్షర మిచ్చుట చమత్కారమైనది. వదనమునుండి స్రవించు తీపును గ్రోలుచుండుట - నిది విచిత్రముగా సమర్థించు చున్నది. సుందరీజనములో [illegible] దాముద్దియ. సుందరీరత్నము [illegible] [illegible]కొనినవాడు నిక్కముగా

మనోరముడే యగును. ఆసుందరీరత్నము చూపిప్పు డామనోరము నిపై నల్లనడరినది. హృదయంగమునియందు సాపేక్షగా నల్లనడరిన ఆసుందరీరత్నము చూపు వింతసోయగమున నున్నదని సారస్యము. ఆ చూపు ఆ మనోరమునియొక్క అడుగులయొప్పుపై నల్లనడరుచున్నది. "అల్లనడరు" అను రెండు పదములు ఇంకను అధికభావమును సృష్టించుచున్నవి. సుందరీజనములోరత్నము గాన అడుగులయందేకాక అడుగులపైనున్న యొప్పుపై ఆమెచూపు అడరినదని సారస్యము. అభి మన్యుడు మనోరముడగు వరుడు. ఉత్తర సుందరీరత్నమగు ముద్దియ. (వధువు.) ఇప్పుడావరుడు పతియగుచున్నాడు. ఆముద్దియ అతని వెలది (సతి) యగుచున్నది అను చమత్కారము ౩, ౪ పాదములలో నిమిడి యున్నది. పతివిలోకనములు పడతుకపై మెలగుచున్నవి. వెలదికటాక్ష ములు విభునిపై బఱగుచున్నవి. ఇందలి "విలోకనములు, కటాక్ష ములు"అను రెండు పదములు స్త్రీ పురుష స్వభావమును జక్కగా బోధించుచున్నవి. సతీపతిభావమున జూపు దగులుట నిందు జిత్రించుచు గవి యింకొక్క పవిత్రభావమునుగూడ వ్యక్తీకరించినాడు. ముద్దియ వదనముపై ముందుగా బాఱిన వరుచూడ్కి యిపుడు పతివిలోకనములై పడతుక మైదీగయందు మెలగుచుండినది. అడుగుల యొప్పుపై నల్లనడరిన సుందరీరత్నము చూపు వెలదికటాక్షములై విభునిపై గ్రమమున నెగసి. మోమున జోకినది. దేవతాదర్శనము పాదాదిగను, తదన్యము తద్భిన్నముగను వర్ణించుట యాచారము. ఇం దాసారస్యముకూడ విచిత్రముగా నున్నది. విభుడు సతికి ప్రత్యక్షదైవత మని యభి ప్రాయము. వెలదికటాక్షములు విభునిపై గ్రమముగా నెగయుటయు గనునింపదగియున్నది. ఇందు క్రమక్రమమగు ననుభవము సూచిం పబడినది. సుందరీరత్నము చూపు మనోరము నడుగుల యొప్పుపై బ్రసరించుటయు, మోమున జోకిన కటాక్షములు మగిడివచ్చుటయు ననుత్తమమగు లజ్జను సూచించుచున్నది. ఇద్దఱదృష్టులు కలుసుకొనుసరికి వెలదిదృష్టి మగిడివచ్చినది. ఇది స్త్రీలసహజమ్మైన ననుత్తమమైన సిగ్గును వ్యక్తీకరించుచు నింకొక్క ... సాధించుచున్నది తనవిలోకనములం దా...

వెలదికి వశ్యుడై పోయినాడు. అయినను అతిశయించక ఆసతి యథా స్థితినే యొప్పియున్నది అను సారస్య మిందు గలదు. వధూవరుల మొదటిచూపు సుద్దియవదనముపైని, మనోరము నడుగులయొప్పుపైని పడినది. ఆ సతీపతుల రెండవచూపులు పడతుక మైదీగయందు బలుమలు మెలగుటగాను, విభునిపై గ్రమమున నెగయుటగాను నున్నది. అనగా నొకచోట నిలువక బహుముఖములుగా వారిదృష్టులు పాఱుచున్నవని యభిప్రాయము. మొదట "చూడ్కి, చూపు" అని ఏకవచనములోను, పిదప 'విలోకనవాలు, కటాక్షములు' అని బహువచనములోను చెల్ప బడుట రసవంతముగా నున్నది. 'కలయంగ, నెగసి' అనుపదములు భావ పోషణములుగా నున్నవి. ఇప్పటికి రెండువిధములగు చూపులు తెల్పబడి నవి. మూడవరకము చూపులు తేటగీతలో వర్ణింపబడినవి. పరిచయము లగు సతీపతుల నయనదీప్తు లిందు వర్ణింపబడినవి. ఇవి వారిఅవయవభంగు లందుదగులుచున్నవి. ప్రత్యక్షముగా నవయవములుచూచుట కవకాశము గాదు గాన నవయవభంగులందుదగులుచున్నవని వర్ణింపబడినది. మఱపున (పారవశ్యమున)దడయుచున్నవి. లేజెమటల నూనుటచే ప్రేమనూరిన(బరు వెక్కిన) యిద్దఱ విశాలనయనదీప్తులు నెఱుకువ బయలుపడగ దడయుచు న్నవి. ఇద్దఱకు లేజెమటలు గల్గుటచే నొకరి నొకరు ప్రేమించిన వారిదృష్టు లాలేజెమటలండు దగిలినవి. అందూరినవగుట నాదృష్టులు విశాలములై నవి. దీప్తిమంతములైనవి. అనగా నొకరినొకరు కళ్లు విప్పుకొని చూచు కొనుచున్నారనిభావము. ఇప్పు డిద్దఱివిగూడ విశాలనయనదీప్తులే. ఇద్దఱి దృష్టులు అవయవభంగులందు దడయుచున్నవి. "తడయు" అనుపదము నిదానమగు దృష్టి పరకింపజూచియు నిదానము చాలనిదృష్టి గల్గియున్న వని తెల్పుచున్నది. వా రాసమయమున వధూవరులే అయినను ఆచూ డ్కులట్లుగా నతిశయించి పరిణమించుచున్నవని సాధించుచు గవి వారి అద్వితీయ సౌందర్యగరిమను వ్యక్తమొనరించినాడు. పిమ్మట తలబ్రాలు పోసుకొనుట జరిగినది. ఇదివఱకు అవయవభంగులందు దడసియున్న చూపులు లజ్జకతంబునం జేసి లలితతనూవిలాసముల విచ్చలవిడి బట్టుటకు వెరవు సాలక [illegible] లు [illegible] సువేర్పడినది. తలబ్రాలు పోసుకొ నుట [illegible] లభించుటచే నొండొరుల

విహ [illegible]

మోహనమూర్తులపై నా వధూవరులు చూపు లిమ్ములబచరించుచుండిరి. "అవయవభంగులందు" అను పదముకంటె "లలితతనూవిలాసముల, ఒండొరుల మోహనమూర్తులపై" అనుపదములు దృష్టి నిలుచుటయందలి అందలి రసికత్వసంపదను నింకను సాధించుచున్నవి. "ఒండొరులమోహన మూర్తులపై" అని వ్రాయుటచే వధూవరుల వలపుగరిమ బహుదొడ్డది అని వ్యక్తమగుచున్నది. ఈ తలంబ్రాలు సమయమున జక్కగా (పూర్తిగా) నొకరినొకరు చూచుకొనుట జరిగినది. పిమ్మటపాణిగ్రహణము గావింపబడి నది. తిక్కన అంతకంతకు వారికి సన్నిహితత్వము దెల్పుచు వివాహక్రమ మును వర్ణించుచున్నాడు. ఆపిదప నావధూవరులు ఏకాసనమున శోభించిరి. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి హోమసమయకృత్యముల నానందించిరి. ఇట్లుగా నాసతియు పతియు సమ్ముదాంబుధిని దేలిరి. ఆంధ్రదేశ మందు వివాహపద్ధతి యెట్లునడచునో అందు మహారాజు లింట వివాహ మెంతఘనముగా నడచునో అది వర్ణించుచు అందు ఉత్తరాభిమన్యుల వివాహవైభవము అనుపమానమని సాధించుచు తిక్కన తనయొక్క అపూర్వ కవితాసామర్థ్యము నిప్పట్ల బహుముఖముల వెదజల్లినాడు.

శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతిర్మమ.



సీ తా రా ము లు.

# గ్రంథకర్త స్వవిషయము.

నన్ను గన్నతల్లి దండ్రులు స్వర్గస్థులు నరసమ్మ, హనుమంతాచార్యులుగారు. బాల్యమునుండియు సంరక్షకురాలు పెంపకపుదల్లి లచ్చమ్మగారు పెంపకపుదండ్రి స్వర్గస్థులు రామమూర్త్యాచార్యులుగారు. ఉపాధ్యాయులు కలవపూడి వేంకటాచార్యులుగారు. ఆదిరాజు జోగావధానులుగారు. వాహినీపతి లింగమూర్తిగారు. విజయనగరపురపాలకోన్నతపాఠశాలోపాధ్యాయులు. జనకసహోదరులు వేంకటనరసింహంగారు. స్వర్గస్థులు శేషగిరిరావుగారు. రామకృష్ణరావుగారు. అర్ధాంగిరమణమ్మ. సంతానము. వేంకటకృష్ణరామరావు. బదరీలక్ష్మీనరసింహం. హనుమంతరావు. లక్షుంబాయమ్మ. నరసమ్మ. రుక్మిణి.

భ్రమప్రమాదములవలన గ్రంథమందు తప్పు లుండిపోయినవి. ప్రథమభాగమందు మఱియు నుండిపోయినవి. సారమతులగు కవిసత్తములు సారమునే గ్రహింప బ్రార్థితులు.

# ఈ పుస్తకము అచ్చు అగుటకు విరాళము లొసంగిన దాతలు.

116 మాటూరి చిన్న సన్యాసిలింగం శ్రేష్ఠిగారు, విజయనగరము.

మూలరామ ప్రియ కానుకుర్తి వేంకటకృష్ణారావుపంతులుగారి పేర కుమారులు హనుమంతరావు పంతులుగారు, కన్యకాపరమేశ్వరీ కార్యవర్గమువారు, విశాఖపట్టణము. వెలగా కామరాజు శ్రేష్ఠిగారు. ఘుడియారం లక్ష్మీనరసింహంపంతులుగారు. భాగవతుల సుబ్బారావుపంతులుగారు. కోరి వరహాలుపంతులుగారు. గంటి సూర్యప్రకాశరావుపంతులుగారు. భళ్లమూడి అచ్యుతరామమూర్తిపంతులుగారు, మాధ్వయువజన సంఘము, విజయనగరము. ముప్పిడి వెంకటరావునాయుడుగారు, కంట్రాక్టరు, విశాఖపట్టణము. D. సూర్యనారాయణరెడ్డిగారు, Salt Merchant, సొపడా. J. సత్యనారాయణమూర్తిగారు, Manager La Rive & Co., విశాఖపట్టణం. చిల్లరిగె వెంకట అన్నాజీరావుపంతులుగారు, విజయనగరము. రాచకొండ రామలక్ష్మమ్మగారు, విశాఖపట్టణము. రాయవరపు మహాలక్ష్మమ్మగారు. కృష్ణస్వామి అయ్యర్ రామనాథ అయ్యర్‌గారు. పోగేటి సత్యవతమ్మగారు. G. వామనమూర్తి పంతులుగారు. G. సన్యాసిరావుపంతులుగారు. విన్నకోట దుర్గారావుశ్రేష్ఠిగారు. విన్నకోట బాలకృష్ణరావుగారు. దంగేటి జగ్గారావుశ్రేష్ఠిగారు, పూర్ణానందసమాజము. భాగవతుల గుంపస్వామి పంతులుగారు. దేవులపల్లి సాంబశివరావు పంతులుగారు. చీమలకొండ సోమేశ్వరరావు పంతులుగారు, Accountant, కోరమండల్ కంపెని. K. చిట్టి అబ్బాయిగారు, Manager, Ripley & Co. Ltd. అద్దేపల్లి హరిశ్చంద్రుడు నాయుడుగారు, Managing Partner Oriental Export & Import Co. Dr. మజ్జి సన్నిపాత్రుడుగారు. మండవిల్లి సత్యనారాయణ నాయుడుగారు, కంట్రాక్టరు. కొల్లూరి వీరభద్రరావుగారు, M. L. C. Merchant. K. Kalyanji Babu Exporter. K వీరభద్రరావుగారు, కోరమండల్ కంపెని. కడియాల వెంకటరావు గారు, దుబాష్. శ్రీపతి రామకృష్ణరావుగారు, ముప్పిడి గోవిందరావు నాయుడుగారు, కంట్రాక్టరు. G. Sitaramangaru M. A., Merchant, విజయనగరము. విన్నకోట చిన్నరామమూర్తిగారు, V. R. C. Press, విశాఖపట్టణము. పాండ్రంగి అంతర్వేదమ్మగారు. కొల్లా చిట్టెమ్మగారు. పోలిసెట్టి సీతారామమ్మగారు. అత్తిలి లక్ష్మీనరసమ్మగారు. పెద్ది ... శీతంరాజు సాంబ... రావు పంతులుగారు, శ్రీకాకుల...